

# యువ చిత్రవారి చక్రపాణి ప్రత్యేక అవార్డు రూ. 1,116

తరాల అంతరాల (generation gap) ఇతివృత్తంతో 40–50 పేజీల మధ్య పెద్ద కథకు చక్రపాణి ప్రత్యేక అవార్డుగా వెయ్యి నూటపదహార్లు ఇవ్వడానికై యువచిత్రవారు నిర్ణయించారని తెలియ జేయటానికి సంతోషిస్తున్నాం.

**రచయిత(త్రు)లూ పాటించవలసిన నిబంధనలు**

1. పెద్దకథ 40–50 పేజీలకు అరతావు సైజులో మించరాదు. ఇతివృత్తం తరాల అంతరాలకు సంబంధించి ఉండాలి.
2. అనువాదాలూ, అనుసరణలూ పనికిరావు.
3. కథలపై 'యువచిత్రవారి చక్రపాణి ప్రత్యేక అవార్డుకోసం' అని స్పష్టంగా వ్రాసి యువ కార్యాలయానికి పంపించాలి.
4. అవార్డు పొందిన కథ 'యువ' లో ప్రచురింపబడుతుంది. అవార్డు పొందని, ప్రచురణార్హమైన కథలను 'యువ' లో ప్రచురించే హక్కు ఉన్నది.
5. అవార్డును ఇచ్చే విషయంలో తుది నిర్ణయం యువచిత్రవారిదే.
6. ఈ అవార్డు నిమిత్తం కథలు చేరవలసిన ఆఖరుతేదీ మే 1, 1978.

యువచిత్ర
సీతామాలక్ష్మి నిర్మాతలు










ముఖచిత్రం : వైశాఖ పూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

జూన్ సంచికలో పూర్తినవల

ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారి

'ముళ్ళగులాబి'


అనాది కాల ప్రవృత్తముగా సంగీతము పారంపర్యంగా భారతీయ సమాజంతో నిగూఢంగా
చేయబడినది. సంస్కృతి తనంతటతానే ఏ విధంగా మిగుల వైవిధ్యంగా భాసించునో, అదే
విధముగా, భారతదేశంలో, పక్షులు, జంతువులకేగాక, దేవతలు సంగీత వాద్యములతో
విడదీయ లేని విధంగా సమ్మిళితమైయున్నారు. స్థితి కారకుడైన
చతుర్భుజుడైన మహావిష్ణు, ఒక చేతిలో శంఖమును ధరించి
యున్నాడు; కళలకు, విద్యకు మూలవిరాటైన సరస్వతి
వీణ మీటుచున్నది; శ్రీ కృష్ణ భగవానుడు సర్వదా
వేణువుతో సాక్షాత్కరించును. ఇక శివుని
చేతిలో ఢమరుకం
వీణకు, కళలకు, విద్యకు
దేవతయైన సరస్వతీ దేవికి అవినాభావ సంబంధం ఉన్నది. సామాన్య
ముగా సరస్వతి దేవిని తెల్లతామర పుష్పంపై అధిష్టించి, రెండు చేతులతో
వీణ మీటుతూ, మూడవ చేతిలో పుస్తకము, నాలుగవ చేతిలో ముత్యాల
హారంతో ఉన్నట్లు చిత్రీకరించెదరు. అందులకే దానిని సరస్వతీ వీణ
యనియు యనెదరు.
దావణగెరె
అనంతమైన నాణ్యతకు మరో పేరు
ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్, దావణగెరె, 577 002.
డిపోలు:
చిత్రదుర్గా రోడ్, దావణగెరె 577 002.
కావేరి భవన్, బెంగళూర్ 560 009.
దాజిబన్ పేట్, హుబ్లి 580 020.
THOMAS/DCM/77/D/TEL

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 37 మే, 1978 సంచిక 5

ఎన్నికల అనంతరం రాష్ట్రంలో కొత్త ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రభుత్వానికి శాసనసభలో మంచి బలం ఉన్నది. పైగా, యీ ప్రభుత్వపు పార్టీలోనికి, కొత్త సభ్యులు కొంతమంది యితర పార్టీలనుంచి వచ్చి చేరారు. కాబట్టి, అయిదేళ్ళపాటు, ఏ చీకూ, చింతాలేకుండా యీ ప్రభుత్వ పరిపాలన సాగించగలదని ఆశించవచ్చును.

ఈ కొత్త ప్రభుత్వంలో, అంటే మంత్రిమండలిలో, కొత్తవారు చాలామంది వున్నారు వారికి పూర్వపు మంత్రిత్వ అనుభవంలేదు అయితే మంత్రిమండలి నాయకుడు, డాక్టరు చెన్నారెడ్డికి పరిపాలనా అనుభవం బాగా వున్నది. అంచేత, తమ మంత్రిమండలిలోని కొత్తవారిని పరిపాలనా వ్యవహారాలలో తీర్చిదిద్దగలరనీ, రాష్ట్రంలో పరిష్కరించవలసిన సమస్యలను నేర్పుతో పరిష్కరించగలరనీ విశ్వసించవచ్చును.

జాప్యంలేకుండా వెంటనే పరిష్కరించవలసిన సమస్యలలో భూసంస్కరణలు ఒకటి ఇది చాలాకాలంగా అటూ యిటూ తేలకుండా వుంటూ వచ్చిన సమస్య. పూర్వపు ప్రభుత్వం సుమారు అయిదేళ్ళనాడు అమలులోకి తెచ్చిన భూసంస్కరణల శాసనం చాలా లోపాలతో కూడుకున్నదే కాక, అనేక సామాన్య కుటుంబీకులకు అనవసరమైన కోర్టువ్యవహారాలను తెచ్చిపెట్టింది. భూసంస్కరణల విషయంలో, దేశంలోని యితర రాష్ట్రాలలోని శాసనాలకన్న, మన రాష్ట్రంలోని శాసనం, చాలా కఠినమైన పద్ధతిలో వుంది. ఆ కఠిన సూత్రాలను తొలగించి, సామాన్య కుటుంబీకులకు కలుగుతున్న ఇబ్బందులనూ, మైనర్లకూ, స్త్రీలకూ కలిగిన నష్టాలనూ

సవరించవలసిన అవసరం ఎంతేనా వుంది. భూమిలేనివారికి యివ్వడంకోసం ఏదో విధంగా ఉన్నవారి భూమిని లాక్కోడం పద్ధతి కాకపోగా, అది ఆచరణ సాధ్యమైన విధానం కూడా కాదు. మన రాష్ట్రంలో వ్యవసాయానికి పనికివచ్చే బీడుతోసహా, వ్యవసాయ యోగ్యమైన భూమి 1,20,00,000 హెక్టారులు, రాష్ట్ర జనాభా అయిదు కోట్లు సుమారు ఒకటిన్నర కోట్ల కుటుంబాలు అనుకోవచ్చును. భూమిలేని కుటుంబాలకు అందరికీ భూమి పంచిపెట్టాలంటే, ఉన్నవారికీ లేనివారికీ ఒక్కొక్క కుటుంబానికి ఒక హెక్టారు కూడా దొరకదు. అంచేత యీ విధానం ఎన్నటికీ ఆచరణయోగ్యం కాదు. న్యాయమైన పరిమితిని నిర్ణయించి, ఆ పరిమితికి పైబడిన భూమిని ఉన్న వారిదగ్గరనుంచి తీసుకొని, లేనివారికి కొంతమందికి మాత్రమే పంచి పెట్టడం సాధ్యమౌతుంది. కాలం గడిచినకొద్దీ భూమిలేనివారి సంఖ్య ఎక్కువ అవుతూనే ఉంటుంది. అంటే జీవనాధారంలేనివారి సంఖ్య ఎక్కువ అవుతూనే వుంటుంది. వారందరికీ భూమిని యివ్వగలమనుకోవడం పొరపాటు పరిశ్రమలను వృద్ధిచెయ్యాలి పరిశ్రమలు పెరిగినట్లయితే, పెరుగుతున్న జనాభాకు జీవనాధారాలు ఏర్పడుతవి. ఎంతచేసినా జనాభా పెరుగుదలను అరికట్టకపోతే. ఏ సంస్కరణలూ పనిచెయ్యవు. పట్టణ వాసులు, సంతాన నిరోధాన్ని గురించీ, దాని అవశ్యకతను గురించీ బాగా అర్థంచేసుకొంటున్నారు. గ్రామస్థులలో, సంతాన నిరోధావశ్యకతను గురించి బాగా ప్రచారం జరగాలి. ఇలా చేస్తూ, భూసంస్కరణల విషయంలో చెయ్యదగింది ఏదో చేసి, యికముందు భూసంస్కరణలకు అవకాశంలేదని ప్రకటించకపోతే, భూమిగలవారు వ్యవసాయంపట్ల ఎక్కువ శ్రద్ధ చూపించ లేరు. ఏ విధానానికయినా, ఎప్పటికో ఒకప్పుడు ఒక భరతవాక్యం అంటూ ఉండకపోతే, యికముందు ఇంకా ఏమి జరుగుతుందో అనే భయం ప్రజలకు వుండకపోదు. కాబట్టి, ప్రస్తుతపు భూసంస్కరణల శాసనంలోని అవకతవకలను సవరించి, యింతటితో భూసంస్కరణలకు స్వస్తి అని స్పష్టంగా ప్రకటించడం అవసరం.

* * * *

వ్యవసాయ భూసంస్కరణలలాగనే, పట్టణాలలోని నివేశన స్థలాల గరిష్ఠ పరిమితి శాసనం కూడా. పట్టణాలలోని సామాన్య కుటుంబీకులకు చాలా చిక్కులు తెచ్చిపెట్టింది. ఈ శాసనాన్ని వెంటనే రద్దుచేసి, ఇటీవల తమిళనాడులో ప్రతిపాదించబడిన శాసనంలాంటి సమాధానకరమైన శాసనాన్ని చెయ్యడమో, లేక వచ్చే అయిదేళ్ళు ముగిసేటప్పటికి రాష్ట్రంలో ఏ వ్యక్తికీ, ఫలానా పరిమితికి మించిన ఖాళీ నివేశనస్థలం ఉండకూడదని శాసనం చెయ్యడమో మంచిదవుతుంది. తక్కువ ధరకు

ఎకరాలకు పైగా ఖాళీ నివేశన స్థలాలను కొని, ఎప్పుడో ఎక్కువధరకు అమ్ముకుందామని వ్యాపార దృష్టితో నివేశన స్థలాలను ఉంచుకున్నవారి మీద నిబంధనలు పెట్టవచ్చునుగాని, ఇల్లుకట్టుకొని, చుట్టూ కొంచెం విశాలమైన ఖాళీ స్థలం వుంచుకుందామనేవారి నివేశన స్థలాలమీద పరిమితి పెట్టడం ఉచితం కాదు. ఈ సమస్యను కొత్తప్రభుత్వం కూలంకషంగా చర్చించి, ఏ వర్గానికీ అన్యాయం జరగని రీతిగా, నివేశనస్థలాల పరిమితి చట్టాన్ని సవరిస్తుందని ఆశిస్తున్నాము.

*　　*　　*

రాష్ట్రప్రభుత్వం చేతిలో లేకపోయినప్పటికీ, కేంద్రప్రభుత్వంతో చర్చించి రాష్ట్ర ప్రజలకు న్యాయం చేకూర్చడానికి రాష్ట్ర ప్రభుత్వం కృషిచేయవలసిన విషయం ఒకటి ఉన్నది. అది, ఆంధ్రరాష్ట్రంలో ఉత్పత్తి అయే చక్కెరకు కేంద్ర ప్రభుత్వం యిచ్చే ధర.

మొదటినుంచీ ఆంధ్రప్రదేశ్‌లోని చక్కెర ఫ్యాక్టరీలలోనుంచి కేంద్ర ప్రభుత్వం తీసుకొనే చక్కెరకు యిస్తూన్న లెవీధర, యితర రాష్ట్రాలకన్న చాలా తక్కువగా వుంటున్నది. అందేత, మనరాష్ట్రంలోని చక్కెర ఫ్యాక్టరీలు దెబ్బతింటున్నాయి చక్కెర ధరలను పునర్నిర్ణయిస్తూ యిటీవల కేంద్రప్రభుత్వం చేసిన వుత్తరువు కూడా యీ అన్యాయాన్ని ధృవీకరిస్తున్నది. ఉత్తరప్రదేశ్‌లోని ఫ్యాక్టరీల చక్కెరకు యిచ్చే ధరకు, ఆంధ్రప్రదేశ్‌లోని ఫ్యాక్టరీలకు యిచ్చేధర, క్వింటాల్‌కు అరవై రూపాయలు తక్కువగా నిర్ణయించబడినది. ఇది చాలా అన్యాయం. ఆంధ్రప్రదేశ్‌లో రెండు సంవత్సరాలుగా తుఫాను దెబ్బకు చెరకుపంట కొంత చెడి, చెరకు ఉత్పత్తిదారులూ, ఫ్యాక్టరీ యజమానులూ నష్టపడ్డారు. అందేత, యీ సంవత్సరమైనా, ఆంధ్రప్రదేశ్‌లోని చక్కెరకు, ప్రభుత్వం, యితర రాష్ట్రాలలోని చక్కెరకన్న ఎక్కువ ధరను యివ్వవలసింది. అలా చెయ్యక పోగా, అన్ని రాష్ట్రాలలోని చక్కెరకు క్వింటాల్‌కు రు. 18-8 పైసాల ధరను పెంచి, ఆంధ్రప్రదేశ్‌లోని చక్కెరకు యిచ్చే ధరను అన్ని రాష్ట్రాలలోని దానికన్నా కనిష్టంగా వుంచడం కేంద్రప్రభుత్వం చెయ్యవలసిన పని కాదు. ఈ విషయంలో, కేంద్రప్రభుత్వానికి నచ్చచెప్పి, ఆంధ్రప్రదేశ్‌లోని ఫ్యాక్టరీల చక్కెరకు ఎక్కువ ధరవచ్చేటట్టు చూడడం, రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత. ఎక్కువ ధర లభించకపోతే, రాష్ట్రంలోని చక్కెర ఫ్యాక్టరీలకు కొన్ని కోట్లరూపాయల నష్టం వస్తుంది. ఆ పరిస్థితి రాకుండా, రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధ వహించాలి.

———

# 'ఆకులురాలే కాలం'
# ఆవిష్కరణోత్సవం

శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు వ్రాసిన కథల సంపుటి 'ఆకులు రాలే కాలం' ఆవిష్కరణోత్సవం మార్చి 12వ తేదీన సాయంత్రం 6 గం॥ లకు మద్రాసు సవేరా హోటల్ లాన్స్‌లో జరిగింది. ఆ గ్రంథాన్ని 'యువ' సంపాదకులు శ్రీ ఎ. సుధాకరరావు ఆవిష్కరించగా, ఆ సభకు 'ఆంధ్రజ్యోతి' సంపాదకులు శ్రీ నండూరి రామ్మోహనరావు అధ్యక్షత వహించారు. ప్రధాన వక్తలుగా ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకుడు శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ, సుప్రసిద్ధ కథా, నవలా, నాటక రచయిత శ్రీ గొల్లపూడి మారుతీరావు జనరంజకంగా ఉపన్యాసాలిచ్చారు. సభా ప్రారంభానికి ముందు ఆహ్వానితులకు స్వాగతం పలుకుతూ శ్రీ పి. వి. రమణయ్య రాజాగారు, ఐ. జె. రావుగార్ని 'నిరాడంబరుడైన ప్రభుత్వోద్యోగి-నిగర్వియైన సుప్రసిద్ధ కథా రచయిత' అంటూ అభివర్ణించారు. ఆహ్లాద కరమైన ఆసాయంత్రం మద్రాసు లోని ప్రముఖులతో, రచయిత లతో, రచయిత్రులతో ఆ ఆవిష్కరణ సభ నేస్తం లింగం గారి వందన సమర్పణతో ఎంతో హోదాతో, అనుభూతిని రేకెత్తించే విధంగా ముగిసింది.



ఆవిష్కరణోత్సవానికి సారథ్యం వహించి స్వాగతం పలుకుతున్న శ్రీ పి. వి. రమణయ్య [రాజా]



శ్రీ ఐ. జె. రావుగార్ని సత్కరిస్తున్న "రాజా"



జరిగిన సన్మాన, సత్కారాలకు సరసోక్తులతో సమాధానమిస్తోన్న శ్రీ ఐ. జె. రావు.
ఇందులో ఎడమ నుంచి: శ్రీ గొల్లపూడి మారుతీరావు, శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ
శ్రీ నండూరి రామ్మోహనరావు, శ్రీ ఎ. సుధాకరరావు



# చక్రపాణి అవార్డులు - 1977
# ప్రదానోత్సవం

చక్రపాణి అవార్డులు (1977) ప్రదానోత్సవం మార్చి 26, 1978 హోటల్ సరోవర్, హైదరాబాద్‌లో సాయంత్రం 6-00 గంటలకు జరిగింది. ఈ ప్రదానోత్సవ సభకు డాక్టర్ పి. సత్యనారాయణరావు, కార్డియాలజిస్టు, నిజామ్స్ ఆర్థోపీడిక్ హాస్పిటల్ అండ్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ మెడికల్ స్పెషాలిటీస్, అధ్యక్షత వహించి, చక్రపాణిగారు ఒక వ్యవస్థ లాంటి వ్యక్తి అనీ, బహుముఖ ప్రజ్ఞాశాలి అనీ, ఆయనపేరిట అవార్డులు పెట్టడం సముచితంగా ఉందనీ చెప్పారు. అవార్డు గ్రహీతలు: రూపం-శాపం (నవల) రచన: శ్రీధర వెంకట రాధాకృష్ణమూర్తి; నేను (కథ) 'ఎలక్ట్రాన్' (పింగళి వెంకటరమణా రావు) అవార్డు గ్రహీతలను శ్రీ తూమ్మూరు నాగేశ్వరరావుగారు (తెలుగు అకాడమీ) పరిచయం చేశారు. వనిత, విజయచిత్ర సంపాదకులు శ్రీ బి. విశ్వనాథరెడ్డిగారు విజేతలకు నగదు అవార్డులను (నవలకు: రూ. 1,500; కథకు రూ. 1,116), చక్రపాణిగారి మెమెంటోలను అందజేశారు. ముఖ్య అతిథిగా వచ్చిన శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారు (కలెక్టర్ సెంట్రల్ ఎక్సైజ్, మద్రాసు) చక్రపాణిగారి బహుముఖ ప్రజ్ఞాపాటవాన్ని, అవార్డుల ప్రాముఖ్యాన్ని గురించి చెప్పారు. అవార్డుల నిమిత్తం నవల, కథ ఎంపికపద్ధతినీ, తానూ మరో జడ్జీ అయిన శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిగారు అందులో ఎదుర్కొన్న ఇబ్బందుల్ని వివరించారు. నగదు రూపంలోకాకుండా, విజేతలకు రచనలను పుస్తకరూపంలో ప్రచురిస్తే బావుంటుందని శ్రీ రావుగారు సూచించారు. శ్రీ ఎస్. రంగారావు వందన సమర్పణ చేశారు.

## అవార్డు గ్రహీతల పరిచయం:

**'శ్రీధర':** వీరి పూర్తి పేరు శ్రీధర వెంకట రాధాకృష్ణమూర్తి. 10-2-1943న తెనాలిలో జన్మించారు. బి.ఏ. దాకా చదివారు. ఆంధ్రప్రదేశ్

సెక్రటేరియట్‌లో ఉద్యోగం. 1970 నుంచీ రచనలు చేస్తున్నారు. ఇప్పటిదాకా 100 కథలూ, 5 నవలలూ వ్రాశారు. వీరి నవల 'రాగవిపంచి' కి ఆంధ్రప్రభ ఉగాది నవలల పోటీలో బహుమతి లభించింది. వీరి రచనలు ఎక్కువగా మానవతావాదానికి సంబంధించినవి.

'ఎలక్ట్రాన్': వీరి అసలు పేరు పింగళి వెంకట రమణారావు స్వస్థలం-తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం. జననం: 14-1-1938 ఎం. ఎస్‌సి. చదివారు. చదివిన చదువు, చేసే ఉద్యోగం ఒక్కటి కావడంవల్ల 'ఎలక్ట్రాన్' అనే పేరు పెట్టుకొని రచనలు చేస్తున్నారు. వీరు ఇప్పటిదాకా 25 కథలూ, ఒక నవలా వ్రాశారు. వీరు 1960 నుంచీ కథలు వ్రాస్తున్నారు. ప్రస్తుతం ఉద్యోగరీత్యా అహమ్మదాబాద్‌లో ఉంటున్నారు.



ఎడమనుంచి: శ్రీ బి. వేన్. ఆర్. కృష్ణ (మద్రాసు), శ్రీ ఎన్. ఆర్. చందూర్ [మద్రాసు], కుమారి వాసిరెడ్డి సీతాదేవి



సభకు విచ్చేసిన కొంతమంది ప్రముఖులు



ఎడమ నుంచి : శ్రీ టి. సుబ్బరామరెడ్డి [చైర్మన్, ఎ పి. బిల్డర్స్ ఫెడరేషన్], శ్రీ బి. శ్రీనివాసరావు [ఆంధ్ర బ్యాంకు], శ్రీ జి. రామకృష్ణ [శ్రీ ఫిలిమ్స్, విజయవాడ], శ్రీ రాంమ్మోహనరావు [ట్విన్ సిటీ గాస్ కంపెనీ], శ్రీ బి. మరిదేశ్వరరావు, శ్రీ పి. మల్లికార్జునరావు [భారతి ఇంటర్నేషనల్, బొంబాయి]



పత్రికా ప్రతినిధులు, శ్రీ నేరెళ్ల వేణుమాధవ్, M.L.C. మొదలైనవారు.



శ్రీ విద్వాన్ విశ్వం, శ్రీ కె. రామచంద్రారెడ్డి (I.G.P.), శ్రీ నార్ల, డాక్టర్ పి. యస్. రావు, శ్రీ పి. వి. బి. రావు (Income-Tax Tribunal Member), శ్రీ బి. విశ్వనాథరెడ్డి, శ్రీ టి. సుబ్బరామరెడ్డి, శ్రీ ఎన్. ఎస్. రాజు, శ్రీ ఎస్. రాజగోపాలరెడ్డి (Hindustan Cables), శ్రీ మురళీకృష్ణ (Chary & Co.) మొదలైన ప్రముఖులు.



చక్రపాణి మెమెంటోను శ్రీ బి. విశ్వనాథరెడ్డి నుంచి స్వీకరిస్తున్న శ్రీధర్,
ప్రక్కనున్నవారు శ్రీ ఐ. జె. రావు



శ్రీ బి. విశ్వనాథరెడ్డి నుంచి నగదు అవార్డును తీసుకొంటున్న 'ఎలక్ట్రాన్



సభకు విచ్చేసిన మహిళలు



అధ్యక్షులకు పుష్పమాలను సమర్పిస్తున్న 'యువ' పబ్లిషర్
శ్రీ ఎ. చంద్రశేఖరరావు



అధ్యక్షోపన్యాసం ఇస్తూన్న డాక్టరు పిన్నమనేని సత్యనారాయణరావు
[కార్డియాలజిస్టు, నిజామ్స్ ఆర్థోపెడిక్ హాస్పటల్ అండ్
ఇన్‌స్టిట్యూట్ ఫర్ మెడికల్ స్పెషాలిటీస్, హైదరాబాద్]



వందన సమర్పణ చేస్తూన్న శ్రీ ఎన్. రంగారావు




డాక్టర్ రాజీవ్ హాస్పిటల్‌లో పనిచూసుకుని, మేడ ఎక్కాడు వాచీ ఎనిమిది చూపిస్తుంది. ఒత్తుగా మల్లెమొగ్గలు వెదజల్లినట్లు నీలాకాశంలో తెల్లటి నక్షత్రాలు వెలిగిపోతున్నాయి. కొబ్బరి మట్టలు గాలికి వింజామరలు వినయంగా వీస్తున్నాయి. రాజీవ్ సిగరెట్ వెలిగించి అలసటగా వరండాలోని ఈజీచేర్‌లో కూర్చున్నాడు, చొక్కా సగం విప్పి. వైద్యవృత్తి కత్తిమీద సాములాంటిది. అందులో రాణించాలంటే వ్యక్తిగతమైన సుఖాలు కొన్ని త్యాగం చెయ్యాలి. ప్రారంభంలో కష్టమనిపించినా వృత్తిలోని సేవాభావం ఎదుగుదలకి తోడ్పడు తుంది.

"అయ్యగారూ.. స్నానం చేస్తారా ?" చిన్నా గుమ్మంలోనుంచి అడిగాడు. వాడు రెండో ఆట సినిమాకి ప్రోగ్రాం పెట్టుకున్నాడు. రాజీవ్ భోజనం అయిపోతే వాడికి నిశ్చింత బయట పడవచ్చు

రాజీవ్ సిగరెట్ పడేసి లోపలకు వచ్చాడు. బాత్‌రూంలో సబ్బు, టవల్సు సిద్ధంగానే వున్నాయి. ఇవాళ చిన్నా కింత బుద్ధి వచ్చిందేమిటి ? రోజూ ప్రతీ దానికి కేకెయ్యవల్సి వచ్చేది.

షవర్ క్రింద అరగంట పైగా చేశాడు స్నానం. అలసట దూదిపింజలా ఎగిరిపోయింది. తెల్లటి విస్త్రీ లుంగీ కట్టుకుని భోజనానికి వెళుతూండగా వరండాలో రుక్మిణి తచ్చాడుతున్నది. "ఏం ?" కర్టెన్ లాగి అడిగాడు.

"మీకోసం ఎవరో వచ్చారు."

"ఎమర్జన్సీయా ?"

"పేషంట్లు కాదు. భోంచేస్తున్నారని చెప్పినా వినలేదు. మిమ్మల్ని వెంటనే కల్సుకోవాలిట. సత్యవతి వచ్చిందని చెప్పమంది."

రాజీవ్‌లో కలకలం. ముఖంలో వెన్నెల. ఉత్సాహం వళ్లంతా వ్యాపించింది. రుక్మిణి మరేం అడక్కుండా క్రిందికి వెళ్ళిపోయింది.

రాజీవ్ వరండాలో ఆగలేకపోయాడు. మేడమెట్లకేసి వెళ్ళాడు ఆత్రంగా. సత్యవతి సూట్‌కేస్‌తో పైకి వస్తోంది. జీరో బల్బుకాంతిలో ఆమె ఎంతో స్పష్టంగా కనిపిస్తోంది రెండేసి మెట్లు చొప్పున దిగి ఎదురెళ్లి ఆమెని అందుకున్నాడు.

"సత్యా"

"రాజీవ్."

అనుశ్రుతంగా యుగయుగాలనుంచి యువతీ యువకుల మధ్య ఆకర్షణ యిలాగే వస్తున్నది. ఆ కౌగిలింతలో ఒకర్ని ఒకరు ఓదార్చుకున్నారు. చిన్నా పైనుంచి చూస్తూండటంవల్ల రాజీవ్ ఆమెని వదిలి పైకి ఎక్కాడు. చిన్నా వచ్చి సూట్‌కేస్ అందుకున్నాడు.

"షర్బత్ త్రాగుతావా ? కాఫీ త్రాగుతావా ?"

"చాల్లే మర్యాద...నాకు ఆకలి వేస్తోంది. భోజనమే చేస్తాను" అన్నది నవ్వుతూ.

రాజీవ్ బాత్‌రూం చూపించాడు. "జలకాలాట శీఘ్రంకానియ్......ఆత్మారాముడు గోలపెడుతున్నాడు."

సత్యవతి టవల్ భుజంమీద వేసుకుని తలుపుమూస్తూ "నా ఆత్మారామి కూడా అదే గోల. ఆలస్యముండదులే," అంది.

చిన్నా సినిమా ఆశ వదిలేసుకున్నాడు. బియ్యం కడిగి గ్యాస్‌మీద పెట్టాడు.

అప్పడాలు, వడియాలు వేయించాడు. పెరుగు పచ్చడి చేసాడు. కూర వున్నా మరో వేపుడు చేశాడు. అతిథులచేత తన వంట పొగిడించుకోవడం చిన్నాకి సరదా.

భోజనం చేస్తూ సత్యవతేం మాట్లాడలేదు. పదార్థాలమీద దండయాత్ర ప్రారంభించింది. రాజీవ్ ప్రశ్నలు వెలవెల పోతున్నాయి.

"ఎన్ని రోజులయిందేమిటి భోజనంచేసి ?" రాజీవ్ ప్రశ్నించాడు.

సత్యవతి పెరుగు వడ్డించుకుని తలఎత్తి చూసింది "ఇన్నాళ్ల ఆకలే మరచిపోయాను రాజీవ్! నిన్ను ఎప్పుడు కల్సుకుందామా అన్న తొందరాయె."

"నీకోసం క్షణం యుగంలా గడుపుతున్నాను."

"పో...దొంగమాటలూ నువ్వూ. నిమ్మకి నీరెత్తినట్లు కూర్చుని, కనపడ గానే చిలకపలుకులు అప్పగిస్తున్నావు." కృత్రిమ కోపంగా అంది.

"అలుకమానవే చిలుకల కొలికి." రాజీవ్ రాగం తీశాడు.

"ఇది గానసభ కాదు. తొందరగా కానియ్......యింకా సాంబారులోనే ఉన్నావు ఇంకా రెండు అయిటమ్స్ ఉన్నాయి నన్ను కలవడానికి."

రాజీవ్ భోజనంచేసి బయటికి వస్తుండగా 'డెలివర్జీ కేసు' అంటూ కాంపౌండర్ వచ్చాడు. రాజీవ్ అతడితో వెళ్ళిపోయాడు.

సత్యవతి టీపాయ్‌మీద కాళ్ళుజాపి వక్కపొడి నములుతూ వెన్నెల ఆకాశం లోకి చూస్తూ కూర్చుంది. ప్రశాంత వాతావరణంలాగే ఆమె మనస్సు కూడ ప్రశాంతంగా వుంది

గతం పీడకలలా గుర్తుకొస్తోంది. పొందిన అనుభవం అంతరంగంలో బొమ్మలా కనపడుతోంది. ఆ జీవితం తనదేనా అనిపిస్తోంది. పరుగు పందెంలో గెలిచినట్లుంది ఈనాడు.

విధిమీద, అదృష్టంమీద ఆమె ఆధారపడలేదు. తన తెలివిచేత కాలంమీద గాలం వేసింది. అది కేవలం జూదం, సాహసం. కాని మానవ ప్రయత్నం. పరిస్థితులను రూపాంతరం చేయాలనుకున్నవారి జీవితాలలో ఆకస్మిక పరిణా మాలు ఏర్పడక మానవు. ఆశించినదానికి, నెరవేరినదానికి మధ్యగల వ్యత్యాసంపై వ్యాపారం రాణింపు ఆధారపడి ఉంటుంది.

"ఇంకా పడుకోలేదా సత్యా" రెండుగంటల తర్వాత రాజీవ్ వచ్చాడు.

"నీకోసం చూస్తున్నాను.

* * *

సత్యవతి పుస్తకం తెరచుకుని కూర్చుంది. కాని చదువు సాగడంలేదు. ప్రక్కగది నుంచి సాయి, రమ స్కూలుపాఠాలు గట్టిగా చదువుతున్నారు. సత్యవతి లేచివెళ్ళి మందలించింది. వాళ్ళు మొండిగా 'మేం గట్టిగానే చదువుకుంటాం' అన్నారు. సత్యవతి హతాశురాలైంది.

హైమావతి మంచంమీద నిద్రరాక దొర్లుతోంది. "వాళ్ళను చదువుకో నివ్వవే...లోపల ఏడిస్తే ఏం వస్తుంది" అన్నది సాగదీస్తూ.

సత్యవతి మరేం మాట్లాడకుండా పుస్తకం తెరిచింది. "ఛీ...అక్కయ్యకు కూడా జ్ఞానం లేదు. తన ప్రవర్తన ద్వారా వాళ్ళని మూర్ఖంగా తయరు చేస్తోంది.

గడియారం తొమ్మిది కొట్టింది. సాయి, రమ నిద్రలోకి జారిపోయారేమో కంఠాలు వినిపించడంలేదు. సత్యవతి ఏకాగ్రతగా చదవాలనుకుంది.

రేపే ఆఖరి పరీక్ష. ఇక చదువుకి స్వస్తి. జీవితం వో దశకి వస్తుంది. ఇక తన వ్యక్తిత్వంమీద ఆధారపడి బ్రతకవచ్చు. బలవంతంగా విలువలని చంపుకోనక్కర్లేదు.

ఆఖరి పరీక్ష కావడంవల్ల ఆమె దృష్టి చదువుమీద నిలబడటంలేదు. ఆలోచనలు ముసురుకుంటున్నాయి. శిక్ష పూర్తయి విడుదలకోసం ఆత్రపడుతున్న ఖైదీలా వుంది. వారంరోజులు వరసగా ముసురు పట్టినాక, వచ్చిన సూర్యోదయంలా ఆమె అంతరంగం మెరిసిపోతున్నది. ఇన్నాళ్ళూ పరిస్థితులకి బందీ అయి పోయింది

సత్యవతికి యిక్కడికి రావడం అసలు యిష్టంలేదు. తండ్రి పోవడంతో, యితర బంధువుల ఒత్తిడితో రాక తప్పలేదు.

"అదేమిటే నేను పరాయిదాన్నా...నువ్వు ఒక్కదానివి యిక్కడెందుకు? నాతో వచ్చెయి సరిపోతుంది." హైమావతి సానుభూతి తెచ్చుకుంటూ అంది.

ఏ మానవపరమైన మమకారమయినా, స్వార్థమయినా డబ్బుకు లోబడి వుంటుంది. అందుకు హైమావతి నిదర్శనం, తండ్రి చావుబతుకులో మంచం మీద వుండి చెల్లెలు భవిష్యత్తుకి అప్పగింతలు పెడుతూంటే,

హైమావతి బుడి బుడి దీర్ఘాలు తీస్తూ "అంత భారం నేను మొయ్యగలనా నాన్నా. మీకు మాట దక్కించగలనా?" అన్నది. సత్యవతిని తనతో తీసుకు వెళితే పెళ్ళి పేరంటం చెయ్యాలి. గౌరవం కోసం చేతిచమురు భాగవతం చెయ్యదు ఆమె.

దాని పెళ్ళికి పదివేలు బ్యాంకులో వేశానమ్మా... నేనిల్లా ఉన్నానని తెప్పించి యింట్లో పెట్టాను. దానితో దాని పెళ్ళి చేసి ఓ యిందిదాన్ని చెయ్యమ్మా!"

పదివేలు...హైమావతి సంశయం విడిపోయింది, కాని ఏడుపు శృతి పెరిగి పోయింది. బంధువులు ఓదార్చడానికి ఎంతో ప్రయత్నించారు.

సత్యవతి వసారా కిటికీనుంచి యిదంతా చూస్తోంది.

జన్మాంతర క్రియలు క్లుప్తంగా జరిపించ హైమావతి చెల్లెల్ని తీసుకుని తన యింటికి వెళ్ళిపోయింది. సత్యవతి కాలేజిలో చేరింది.

తలుపు చప్పుడయింది.

"సత్యా...తలుపుతీసి తగలెయ్...ఆయన వచ్చారేమో" హైమావతి కేకేసింది.

సత్యవతి తలుపుతీయగానే 'శ్రీకృష్ణుడి' మేకప్‌లో భగవాన్లు లోపలికివస్తూ, "నాటకం గొప్ప హిట్ సత్యా...నువ్వు పరీక్షటూ రాలేదు కాని ... నే పద్యం అందుకున్నా 'వన్స్ మోర్'" అన్నాడు గర్వంగా.

"మేకప్ కడుక్కోలేదేం బావా ?"

"మేకప్ రూమంతా కిక్కిరిసి వున్నారు జనం. ఇక నేను కనపడితే జనం వదలరు. ఈ అవస్థ భరించలేక దొంగదాటుగా రిక్షా ఎక్కేశాను." భగవాన్లుకి బాజా చాలా యిష్టం.

హైమావతి రంకె పెట్టింది. "మన ప్రతాపం చాలించండి."

భార్య కంఠం వినగానే నాటకం నిషా దిగిపోయింది భగవాన్లుకి. గదిలోకి వస్తూ "ఎలా వుంది హైమా...మందు పుచ్చుకున్నావా ?" అన్నాడు.

"తీరిగ్గా పరామర్శిద్దురుగాని, ముందా రంగులు కడుక్కురండి."

హైమావతిలో చిరచిరాలు ఎక్కువ మొగుడ్ని చూస్తేను. భగవాన్లు నాటకాల్లో తిరగడం ఆమె కిష్టముండదు. ఎప్పటికప్పుడు యుద్ధం చేస్తూనే ఉంటుంది. భగవాన్లు పెళ్ళాన్ని ఎదిరించడు. తన పని తాను చేసుకుపోతాడు. జీతం ఆమెచేతిలో పోస్తాడు సిగరెట్లు కూడ ఆమె తెప్పిస్తుంది.

హైమావతి దీర్ఘంతీస్తూ లేచి కూర్చుంది-బల్లమీద బత్తాయి అందుకుని ఒలవ సాగింది. "సత్యా ... అన్నం పడేస్తావూ ఆయనకి" అన్నది కేకవేస్తూ. ఉత్తప్పుడే ఆమె ఏ పని చెయ్యదు. ఇప్పుడు నెలలు నిండాక చేస్తుందా ? ప్రస్తుతం తన పని చేసుకోడమే ఆమెకి భారంగా ఉంది. ఒళ్ళు వంగనమ్మ కాలి మట్టెలకి కందిపోయిందిట !

సత్యవతి విసుగ్గా వంటింట్లోకి వచ్చింది. పెరట్లో గోలెందగ్గర భగవాన్లు స్నానం చేస్తున్నాడు. సత్యవతిని చూసి "అన్నం పెట్టక...కాఫీ చాలు" అన్నాడు.

సత్యవతి కాఫీ ప్రయత్నంలో పడింది ఆమె యిందాకటినుంచి నిద్ర కాగలేక కాఫీ పెట్టుకోవాలనుకుంటోంది.

భగవాన్లు లుంగీ చుట్టుకుని దువ్వెన తీసుకుని బీరువాకున్న అద్దంముందు నిలబడ్డాడు. హైమావతి అప్పటికే రెండు కాయలు తిని, మూడోది వలుస్తోంది.

"అంత తినని వాళ్ళు ముందర చెప్పచ్చు గదా. వండినది ఏం చెయ్యడం ?" హైమావతి ముఖం చిట్లించింది.

"రేపట్నుంచి అలాగే చేస్తాను." భగవాన్లు శాంతి పక్షి. సంధికి రెడీగా ఉంటాడు.

"మనం ఉన్నది తగలేసుకునే రకమాయె "

హైమావతి విసుర్లకి రాయిలా కూర్చున్నాడు. సత్యవతి కాఫీ తెచ్చి భగవాన్లు కిచ్చింది "నా కూ్కడ కాస్త ఇవ్వమ్మా...అన్నం సరిగ్గా తిన్నట్లు లేదు" అంది హైమావతి.

"పోనీ కాస్త అన్నం తినకూడదూ ?" భగవాన్లు నవ్వాడు.

హైమావతి పడుకుంది 'చాలు...సరసం' దీర్ఘం తీస్తూ.

మర్నాడు ఆఖరి పరీక్ష రాసి సత్యవతి గుండెలు తడుముతుంది నెత్తిన ఉంచిన బరువు దిగినట్లయింది. వెయిటింగ్ రూమ్ దగ్గరకి వచ్చింది.

"ఏం సత్యా...ఫస్టుక్లాసు ష్యూర్ నీకు" అంటూ ఊర్మిళ దగ్గరకి వచ్చింది. ఆమెవెంట భాస్వతి, రేణుక, కిరణ్మయి కూడా వున్నారు. ఈ మూడేళ్లనుంచి వాళ్లు పంచపాండవులుగా పిలవబడ్డారు కాలేజీలో. ఈనాడు విడిపోవడం బాధగానే వుందిమరి.

"మన ఆఖరి ప్రోగ్రాం సినిమా...ఎవరూ ఎదురు చెప్పకూడదు.'' రేణుక కారు తీసుకురావడానికి గ్యారేజీ వైపుకు వెళ్లింది.

సత్యవతికి వెళ్లాలనీ వుంది ... వెళ్లకూడదనీ వుంది. ఊర్మిళని ప్రక్కకు పిల్చి చెప్పింది. "నేను రాలేనే ... ఇంటిదగ్గర అక్కయ్య..."

ఊర్మిళ పూర్తిగా వినకుండా కొట్టిపడేసింది. "కల్చరల్ ప్రోగ్రాం అనేసరికి ఏదో వంక పెట్టేస్తావ్. ఇన్నాళ్లూ చదువో చదువో అని గోలపెట్టేదానివి. ఇప్పుడు అక్కయ్య."

"డెలివరీ టైం గనుక."

"ఫర్వాలేదు. దానికి డాక్టర్లున్నారు. ఇప్పటినుంచి బాధ్యతలతో నలిగిపోకు. ఆనక జీవితమంటే వెగటు వేస్తుంది."

రేణుక కారు ఆపింది. 'ఎక్కాలి ... ఇవాళ చెత్త హాలుకూడా మన విద్యార్థులచేత హవుస్‌ఫుల్ అయిపోతుంది.'

అందరూ గోలగా ఎక్కారు. కారు బయలుదేరింది. పొడుగాటి తారురోడ్డు మీద మెత్తగా సాగిపోతోంది. వారి గోల మధ్య సత్యవతి ఆలోచించకుండా ఉండలేకపోయింది. తను మినహాయించి నలుగురూ వెండి చెంచావారే. చదువు వాళ్ళకి గ్లామర్ అంతే. ప్రపంచంలోని సంతోషమంతా తమదేనన్నట్లు ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ వుంటారు. తనకున్నలాంటి సమస్యలు వాళ్లకి లేవు తను వాళ్ల స్నేహవలయంలోకి రావడమే విడ్డూరం.

రేణుక ఛైర్మన్‌గారి గారాల పట్టి. ఊర్మిళ అన్నగారు లీడింగ్ క్రిమినల్ లాయర్. కిరణ్మయికి తండ్రి లేడు. ఆమె తల్లి సుప్రసిద్ధ సోషల్ వర్కర్. శాస్వతి తండ్రి బిజినెస్ మాగ్నెట్. వాళ్లకి చదువు మినహాయించి అన్నీ సరదాలే. పరీక్షలు వస్తూంటే మాత్రం సత్యవతి దగ్గర గుమిగూడేవారు. ఆమెచేత చెప్పించుకుని, ముఖ్యమైనవి నోటబెట్టుకుని రాసిపడేసేవారు.

సినిమా ప్రోగ్రాం అయ్యాక శాస్వతి పోష్ హోటల్‌లో వీడ్కోలు విందు యిచ్చింది. ఉత్తరాలు విరివిగా రాసుకోవాలని ఒప్పందంచేసుకుని విడిపోయారు. సత్యవతి యింటికి వచ్చేసరికి యింటి దగ్గర యిరుగు పొరుగు ఆడవాళ్ళు కంగారుగా తిరుగుతున్నారు. హైమావతి మంచంమీద నొప్పులు పడుతోంది.

"ఏవమ్మాయ్ ... మీ బావ యింకా రాలేదు ... ఓసారి తీసుకురా పోయి. ఆసుపత్రికి తీసుకువెళ్లడమే మంచిది." మండోదరి యింట్లోకి రాబోతున్న సత్యవతితో అంది.

సత్యవతి వెనక్కు తిరిగింది. సర్కిల్‌గారింటినుంచి ఆఫీస్‌కు ఫోన్ చేసింది. 'భగవాన్లుగారు యిందాకే బయలుదేరారు' అన్నాడు ప్యూను.

సత్యవతి బయటికి వస్తూండగా రిక్షాలో యింటికి వస్తున్న భగవాన్లు కనిపించాడు. సత్యవతి వేగంగా అడుగులువేస్తూ యింటికి చేరుకుంది.

హైమావతిని హాస్పిటల్‌లో జేర్చారు. డెలివరీ కష్టమే అయింది. చిన్న సర్జరీ జరిగింది కూడా. మరోసారి గర్భమొస్తే ప్రమాదమన్నారు.

పైగా అప్లికేషన్ ఆఫ్ రెడ్ ట్రయాంగిల్. ఇంటి పనంతా సత్యవతిమీద

పడింది ఇంట్లో పనిచూసుకుని హైమావతికి క్యారేజీ పట్టుకువెళ్లాలి. భగవాన్లు మనిషిని పెడతానన్నాడు. హైమవతి ఒప్పుకోలేదు.

"ఎండవేళ దానికి యింటిదగ్గర పనేమి వుంటుందండీ ... నన్ను చూసినట్లూ వుంటుంది. సాయంత్రం మీరెలాగూ వస్తారాయె"

నర్సింగ్‌హోం దూరం. రెండు బస్సులు మారాలి. సత్యవతికి నిప్పుల గండం తొక్కుతున్నట్లు వుండేది. ఒక్కొక్కరోజు ఒక్కొక్క యుగంలా గడుస్తోంది. రాత్రి మంచంమీద వాలగానే నిద్ర ముంచుకువచ్చేస్తోంది.

ఓ రాత్రి హఠాత్తుగా మెలకువ వచ్చింది. దీపం వెలుగుతోంది. కళ్ళు విడలించుకుని చూసింది. అవాక్కయిపోయింది.

ఆమె రవిక వూడి వుంది. చీర స్థానభ్రంశం చెందుతోంది. జరుగుతున్నదేమిటో సత్యవతికి తెలియడానికి కాస్త వ్యవధి పట్టింది.

భగవాన్లు ఆమెని ఆక్రమించాలని చూస్తున్నాడు.

"బావా."

"ష్...నువ్వు కావాలి సత్యా!" భగవాన్లు ఆవేశంగా ఆమెని కౌగలించుకున్నాడు. సత్యవతి విదిలించింది భగవాన్లుని తోసేసింది. భగవాన్లు క్రింద పడ్డాడు. ఆ వ్యవధిలో సత్యవతి బట్టలు సరిగ్గా కట్టుకుంది. భగవాన్లు లేచి ఆమెని అందుకోబోయాడు.

సృష్టికి మూలమైనది స్త్రీ. సృష్టి రహస్యానికి బలయిపోయేది కూడా స్త్రీయే. భగవాన్లు ఈ అవకాశం గురించి ఎప్పటినుంచో చూస్తున్నాడు. ఈనాడు నెరవేరింది.

"నువ్వే అన్యాయం చేస్తావా బావా?" అసహ్యపడుతూ ప్రశ్నించింది.

భగవాన్లు ఆకలిగా చూశాడు ప్రస్తుతం అతడికి కావల్సింది నీతులు, ధర్మాలు కావు, సత్యవతి. లేచి ఆమె దగ్గరకు వచ్చాడు వేగంగా.

సత్యవతి అటు యిటు చూసింది. తలుపు దూరంగావుంది. భగవాన్లు ముందు నుంచే వెళ్ళాలి. వెనకవైపు మంచం. మరోదారిలేదు. షెల్ఫులోని బ్యాటరీ లైట్ విసిరేసింది. అది భగవాన్లు తలకి తగిలింది. రక్తం చిమ్మింది. 'అబ్బా' అంటూ కూలబడ్డాడు.

సత్యవతి తలుపుతీసుకుని బయటికిపోయి గొళ్ళెం పెట్టింది. భగవాన్లు కిటికీ నుంచి అరుస్తున్నాడు.

సత్యవతి వసారాలో సాయి ప్రక్కన పడుకుంది. కంటిమీద నిద్ర రాలేదు.



బావ పశుత్వం కళ్లకి కట్టినట్లు కనిపిస్తోంది. తను రక్షణకోసం యిక్కడికి వచ్చింది. కంచె చేను మెయ్యడానికే సిద్ధపడింది.

అక్కతో చెబితే ??? ఏం చేస్తుంది ??? ఖర్మ. నాలుగు చివాట్లు వేస్తుంది. దాంతో బుద్ధి వచ్చేస్తుందా ? రాదు. ఇంకా గొడవలు ఎక్కువవుతాయి. కారణం లేకుండానే ఘర్షణ పడుతూంటారు. ఇప్పుడిక చెప్పాలా ? తన మూలంగా ఆవిడ కేదో అన్యాయం జరిగిపోతూందని అక్కయ్య బాధపడవచ్చు.

ఆలోచనలతో ఎప్పుడో నిద్రపట్టింది. 'పిన్నీ... పిన్నీ' రమ తట్టి లేపితే గాని వుదయం మెలకువరాలేదు. అప్పటికే ఎండ దట్టంగా వచ్చేసింది. సత్యవతి హడావిడిగా స్టౌ వెలిగించి నీళ్లు పడేసింది. ఆమె ముఖం కడుక్కుని వచ్చేసరికి భగవాన్లు పీటమీద వారగా కూర్చునివున్నాడు. సత్యవతి మాట్లాడలేదు. అతన్ని చూడగానే ఒళ్ళు సెగలు పొగలు వస్తున్నది. బాధ్యతగల వ్యక్తి తప్పుచేస్తే క్షమించబుద్ధికాదు. సత్యవతి కాఫీ కలిపి రమని, సాయిని పిల్చింది. వెనక్కి తిరగకుండా భగవాన్లుకి దూరంగా పెట్టింది.

పిల్లలు బయటికి పోగానే భగవాన్లు మాటలు తడుముకుంటూ "నన్ను క్షమించు సత్యా... రాత్రి పొరపాటు జరిగిపోయింది" అన్నాడు. రాత్రి మనిషి కాదు. ఇప్పుడు సంఘం, సంసారం తెలుస్తోంది.

సత్యవతి మాట్లాడలేదు.

"నన్ను క్షమించలేవా సత్యా... జరిగినదానికి సిగ్గుపడిపోతున్నాను. ఆ పరిస్థితి తిరిగి రాదని హామీ యిస్తున్నాను." ఎదరకి వచ్చి ఆమె ముఖంలోకి తొంగిచూస్తూ ప్రాధేయపడ్డాడు.

పవిత్రులు సమాజంలోని తప్పులను అసహ్యించుకుంటారు. అపవిత్రులు తమ తప్పులు క్షమించబడాలనుకుంటారు. శాంతికి అశాంతికి సంఘర్షణ సహజం

నిన్నరాత్రి భగవాన్లు 'పెట్‌పార్టీనుంచి' తడబడుతూ వచ్చాడు. సాయి తలుపు తీశాడు. భగవాన్లు లైటువేయగానే మంచంమీద... చెదరిన చీరతో, ముసకొట్టుతున్న యవ్వనంతో సత్యవతి కనిపించింది. అంతరాంతరాల్లో 'తప్పు'ని పిస్తున్నా 'కోరిక' జయించింది.

"ఇకనుంచి నిన్ను చెల్లెలిలా చూసుకుంటాను."

"వరుసలు కాదు కావల్సింది, సంస్కారం. నేను నీ చెల్లెలు ఎలా అవుతాను. చెల్లెలు ముసుగువేసి మభ్యపరచుకోవడం భ్రమ. స్నేహితురాలిలా చూడు, చాలు."

"అలాగే... మీ అక్కయ్యతో చెప్పవు కదూ ?"

"ఈ భయం రాత్రేమయింది ?"

భార్య యింటికి వచ్చినా భగవాన్లుకి భయం పోలేదు. సత్యవతి చెప్పేసిందేమో... వాళ్లిద్దరూ మాట్లాడుకుంటూంటే తనగురించేననిపిస్తోంది. వారం రోజులు పైగా భగవాన్లు పరాకుగానే గడిపాడు. బాలసారెతంతుకూడా యాంత్రికంగానే ముగించాడు.

"అలా వుంటున్నారేమిటి ?" హైమావతి నిలదీసినా నీళ్ళు నమిలాడు.

సత్యవతి వీలైనంతగా అతన్ని తప్పించుకుని తిరుగుతోంది. హైమావతితో చెప్పినా పెద్ద వుపయోగముండదని చెప్పలేదు.

ఆదివారంనాడు పిల్లలు సర్కస్ కెళతామని పేచీ పెట్టసాగేరు. హైమావతి గదిరింపుతో భగవాన్లు పిల్లల్ని తీసుకెళ్లడానికి సిద్ధమయ్యాడు.

"సత్యా... నువ్వుకూడ వెళ్లకూడదూ? ఈ మధ్య యింటిచాకిరీతో ఎక్కడికీ వెళ్లడంలేదు."

"వద్దులే అక్కా... నాకు తలనొప్పిగావుంది."

భగవాన్లు బట్టలు వేసుకుని వచ్చాడు హాల్లోకి. తనతో రావడానికి భయపడుతూందని గుర్తించాడు. "ఇంట్లో కూర్చుంటే తలనొప్పి పోతుందా ? రా !" నిన్నేం చెయ్యనులే" అని కళ్లతోనే హామీ యిచ్చాడు.

"రా పిన్నీ" రమ చీర పుచ్చుకుని లాగింది. ఇంతమంది చెబుతూంటే రాననడం బాగోదని లేచింది. ఇంట్లో కూర్చోవడం ఆమెకీ బోర్‌గానే వుంది. పిల్లలున్నారు కదా... ఏం చేస్తాడ్లే అని ధీమా తెచ్చుకుంది. అయిదునిముషాల్లో తయారై వచ్చింది. దగ్గరే అవడంతో నడిచి బయలుదేరారు నలుగురూ.

భగవాన్లు టిక్కెట్లు తీశాడు. సత్యవతి పిల్లలను మధ్యగా కూర్చోపెట్టుకుంది. భగవాన్లు మధ్య మధ్య ఆమెకేసి తొంగిచూస్తున్నాడు. సత్యవతి ఎర్రటి బాంబే డైయింగ్ చీరతో ఉదయపు ఎండలో మెరిసిపోతున్న గులాబీలావుంది. భగవాన్లుకు ఆమె భార్యతో చెప్పకపోయేసరికి ధైర్యం చిక్కింది. మళ్లీ కాంక్ష మొదలయింది. సాయిమీద వేసినట్టు కుడిచెయ్యి జారి ఆమెమీద వేశాడు సత్యవతి చురుగ్గా చూసింది. భగవాన్లు సర్దుకుని కూర్చున్నాడు. అతడిదృష్టి సర్కస్‌మీద లేదు. సత్యవతి మీద వున్నది. ఆమెకు పొందడం ఎలా ? వంటింటి కుందేలయినా తను గెలవడం కష్టమేమో !

మర్నాడుదయం సత్యవతి స్నానంచేసి గదిలో బట్టలు మార్చుకుంటోంది. భగవాన్లు కూరలు తీసుకుని నిశ్శబ్దంగా మార్కెట్‌నుంచి వచ్చాడు. తడిబట్టలతో అర్ధనగ్నంగాయున్న సత్యవతిని చూసి చలించాడు. జంతువు లేచింది. అడుగులు తడబడ్డాయి. సత్యవతి వెనక్కి తిరిగింది. భగవాన్లు పరుగున వెళ్ళిపోయాడు.

సత్యవతి నిశ్శబ్దంగా కూర్చుంది బట్టలు మార్చుకుని. 'పొయ్యి మండిపోతోందే.' హైమావతి కేకపెట్టినా కదల్లేదు. మొన్నటి కథ ముగియలేదు. జరుగుతోంది. బావ వేటగాడు, పక్షి పడేదాకా వల విసురుతాడు. ఏం చేయాలి తాను ?

హైమావతి లోపలికి వస్తూ "పనిలేనిదానిలా అలా కూర్చున్నావేమిటే... మీ బావగారికి ఆఫీసుకి టైం అవుతోంది." కసురుకుంది.

రెండేళ్లయినా హైమావతికి యింకా విశ్రాంతి చాలలేదు. రెండుపూటలా సత్యవతే వంటచేస్తుంది. అమర్చినదానిలో అత్తగారు వేలెట్టినట్టు పై పెత్తనం చేస్తుంది.

సత్యవతి అయిష్టంగా లోపలికి వెళ్ళింది.

"ఎవరు లోపల ?" భానోజీ కర్ర ఆడిస్తూ వచ్చాడు. పిల్లాడికి పాలు పడుతున్న హైమావతి వులిక్కిపడింది. నవ్వు పులుముకుంటూ 'రండి మామయ్యా' అంది. సత్యవతిని కాఫీ చెయ్యమని కేకవేసింది.

"మర్యాదలు దేనికిలే అమ్మా... బాకీమాట తేల్చు ?" మడతమంచంమీద కూర్చుంటూ కోపంగా అడిగాడు.

పిల్లాడిని వుయ్యాలలో వేసి వచ్చింది హైమావతి.

"మీ బాకీ తీర్చమనుకుంటున్నారా ?" నవ్వుతూనే అడిగింది.

"అలాగేవుంది వరుస చూస్తే."

"మీ వడ్డీవ్యాపారులకి భయం ఎక్కువలెండి."

"డబ్బుతో పనమ్మా. మీకు పుచ్చుకునేటప్పుడు వున్న చొరవ యిచ్చేటప్పుడు వుండదు. రెండేళ్లనుంచి నన్ను తిప్పుతున్నావు. పైసయినా తీర్చారా?"

"కొంచెం ఓపిక పట్టండి... పూర్తిగా యిచ్చేస్తాం ఒక్కసారి."

"ఆరువేలయింది వడ్డీతో."

హైమావతి బెదిరింది.

"మీరు నిద్రపోతే అప్పు నిద్రపోదు ఏదో కావల్సినవారు కదాని యిచ్చాను. మంచి శాస్తే చేశారు. ఇలా అయితే మళ్ళీ అవసరానికి డబ్బు పుడుతుందా ?"

అందరూ యిళ్ళు కట్టేస్తున్నారని హైమావతి కూడా మొగుడిచేత లోన్ పెట్టించి ఇల్లుకట్టే ప్రయత్నం ప్రారంభించింది. లిటిగేషనులో వున్న స్థలం కావడంవల్ల కోర్టుకూడా చూడవల్సి వచ్చింది. తీర్పు అనుకూలంగా వచ్చినా శంకుస్థాపనరోజుకి డబ్బులేదు. సత్యవతి డబ్బు యింటికే వినియోగించింది. అయినా చాలలేదు. భానోజీదగ్గర అప్పు తేవల్సివచ్చింది.

"ఆయనా మీ బాకీకోసమే చూస్తున్నారు. తొందరగా జమకట్టేస్తారు లెండి. బజారుకెళ్ళారు, వచ్చేస్తారు" అన్నది నచ్చచెబుతున్నట్లు. భానోజీ బిగ్గరగా మాట్లాడటం ఆమెకి తల కొట్టేసినట్లుంది ఇరుగుపొరుగు ఎక్కడవింటారోనని.

"చెప్పేది నువ్వు చెప్పు... భగవాన్లు ఏమంటాడు ?" అతడు పుత్సవ విగ్రహమని భానోజీకి తెలియనిది కాదు. మాట్లాడుతూండగానే అతడికి దగ్గుతెర వచ్చింది. లాల్చీలోనుంచి సీసాతీసి రెండు మాత్రలు మ్రింగాడు. కాస్సేపటికి సర్దుకుంది.

'వీడు గుటుక్కుమనకూడదూ !' హైమావతి అనుకుంది అతడికి బిడ్డలు లేరని.











అప్పు యిచ్చినవాడు బాగుకోరతాడు. తీసుకున్నవాడు చెడు కోరతాడు. సత్యవతి కాఫీ పట్టుకువచ్చింది. భానోజీ ఆసక్తిగా చూశాడు. సత్యవతి డ్రాయరు మీద పెట్టి వెళ్ళిపోయింది.

"మీ చెల్లెలు కదూ ?"

అతడి కంఠం సౌమ్యంగా వుండటం హైమావతికి సంతోషంవేసింది. "అవునండి. నాన్న పోగానే తీసుకువచ్చేశాను. చల్లారిపోతోంది ముందు కాఫీ తీసుకోండి."

"సంబంధాలు చూస్తున్నారా ?"

"చూసి ఏం చెయ్యమండి డబ్బులేనప్పుడు. ముందర మీ బాకీ తీరితేగాని దాని పెళ్ళిసంగతి తలపెట్టం," అన్నది మెప్పుకోసం మధ్యతరగతి మందహాసం చేస్తూ. విధిలేక నవ్వింది, అంతే. చాలీచాలని ఆదాయం, అప్పులు, తీరని అవసరాలు, రాజీపడలేకపోవడం, మిథ్యాభ్రాంతిలో విహరించడం ఈ తరగతి లక్షణాలు. 'వాయిదాల' జీవితం. వాయిదాలు యిస్తే అమెరికానయినా కొనడానికి సిద్ధపడిపోతారు.

భానోజీ కాఫీ త్రాగి చుట్ట వెలిగించాడు. కుర్చీలో కాళ్ళుజాపుకుని మోచేతుల మీద పడుకుని "సంబంధాలు కుదరడం కష్టంగా వున్నాయమ్మా," అన్నాడు పెరటివైపుకు చూస్తూ సత్యవతి కనిపిస్తుందని.

"ఏం వండను అక్కా?" సత్యవతి గుమ్మంలోకి వచ్చి అడిగింది. ఖానోజీ దృష్టి ఆమెమీద నిలిచిపోయింది.

హైమావతిని వుద్దేశించి అన్నాడు. "ఇక్కడే భోంచేస్తానమ్మాయ్... కోర్టు పనికూడా వుంది. సాయంత్రందాకా వెళ్లడానికి కుదరదు."

హైమావతి మురిసిపోయింది. "అంత అదృష్టమా మాకు ?"

ఖానోజీ చుట్ట ఆరిపోయినా గుర్తించలేదు సత్యవతిని కళ్లతో తినేస్తున్నాడు. తలంటు పోసుకోవడంవల్ల ఆమె శిరోజాలు స్వేచ్ఛగా ఎగురుతున్నాయి. ఎరుపు ఆకుపచ్చ డిజైన్ కాటన్ చీరలో ఏవిధమైన అలంకరణ లేకపోయినా ఎంతో అందంగా కనిపించింది. షష్టిపూర్తి ఖానోజీని మేల్కొలిపింది.

వేటనుంచి విజయవంతంగా తిరిగి వస్తున్న చిరుతపులి కళ్లలో కనిపించే సవాల్‌గా వుంటుంది సత్యవతి అందం. మెత్తటి మేను, విశాలమైన కాటుకకళ్లు, ఎత్తయిన ఎద, విల్లులా వంగే నడుం, నిడుపాటి వెంట్రుకలు భాద్రపదమాసం నదిలా పొంగిపోతున్న యవ్వనంతో చూసేవారి కంటికి యింపుగా సొంపుగా కనిపిస్తోంది.

ఖానోజీలో పురుగు కుట్టసాగింది. అడగడానికి సంశయించాడు. అయినా కోరిక నిలవలేదు. వంట పూర్తయ్యాక సత్యవతి గుడికి వెళ్ళింది. భగవాన్లు భోంచేసి ఆఫీసుకెళ్ళిపోగానే హైమావతిని కదిలించాడు.

"మీరు బాకీ తీర్చక్కర్లేదు."

హైమావతిలో హేమంతసంక్రాంతి. తను పొరపాటుగా విందేమోనని ఆయన ముఖంలోకి ఆసక్తిగా తొంగిచూసింది. హైమావతిలోని మార్పు గమనించి ఖానోజీ రెట్టించాడు.

"నాకున్న ఆస్థిపాస్థులు నీకు తెలియనివా హైమా. పాతిక ఎకరాల మాగాణి వుంది. ఏడెకరాల కొబ్బరితోటవుంది. వున్న ఆస్థికి రెట్టింపు డబ్బు వడ్డీకే తిరుగుతోందనుకో."

హైమావతి గంగిరెద్దులా తలూపింది. తన ఆస్థి వివరాలు అంత వివరంగా ఎందుకు చెబుతున్నాడో ఆమెకి అర్థంకాలేదు.

"నా తర్వాత వీటిని అందుకోడానికి వారసుడు వుండాలి కదా! దత్తతపిల్లలు మనపిల్లలవుతారా ? అందరూ పెళ్ళిచేసుకోమని చంపేస్తున్నారనుకో. నా వయసెంత వుంటుందనీ నీ వూహ ?"

ఎదుటివార్ని అనుసరించి మాట్లాడటం హైమావతికి వెన్నతో పెట్టిన విద్య. "నలభైకి మించివుండదు. మళ్ళీ మీరెందుకు పెళ్ళిచేసుకోకూడదు ?"

భానోజీ సంతసంగా కదిలాడు. "అదీ... కరెక్ట్‌గా మాట్లాడావు. సత్యవతిని చూడగానే పోయిన నా భార్య ధనమ్మ జ్ఞాపకం వచ్చింది. మీకిష్టమయితే సత్యవతిని పెళ్ళిచేసుకుంటాను."

హైమావతి ఆశ్చర్యపోలేదు. మీమాంస పడలేదు. "అంత అదృష్టమా మాకు" అని పొంగిపోయింది. ఈ ఆనందానికి కారణం బాకీ పోవడమేకాదు. భానోజీ బంగారుబాతు ఉత్తరోత్రా లాభం వుండకపోదు. లాభంలేని శెట్టి వరదన పోడు.

భానోజీ తృప్తిగా భోజనంచేసి లేచాడు. కోర్టు కాగితలు అందుకుని హైమావతిని పిలిచి "సాయంత్రం వస్తాను. ఏ సంగతీ చెప్పమరి. ఆ పిల్లని కనుక్కో. ఈ కాలం పిల్లలు గాలిమేడలు కట్టుకుని కూర్చుంటారు. అవతల రెండుమూడు సంబంధాలవల్ల నా పీక నొక్కేస్తున్నారు" అని చెప్పాడు. అంగీకరించడం కేవలం మీ అదృష్టం సుమా అని హెచ్చరిక వినిపించింది కంఠంలో.

"అది నా మాట కాదనదు. మీరు సంశయపడక్కర్లేదు?" అన్నది నిండుగా.

భానోజీ పోతున్న రిక్షాని పిలిచి ఎక్కి వెళ్ళిపోయాడు.

భోజనాల దగ్గర చెప్పేసింది. సత్యవతికి ఏమనాలో తోచలేదు. హైమావతి భానోజీ సంపదని వర్ణించి చెప్పింది. "అలా ?ంగినట్లు వుంటాడుకాని నలభైకి మించిలేదు. మన తాతయ్య ఎనభయ్యోయేట పెళ్ళిచేసుకుంటే నాన్న పుట్టాడు. అంత పెద్ద సంబంధం ఏ వంకా లేకపోతే మన కాళ్లదగ్గరికి వస్తుందా ?"

"అక్కా" విహల్యంగా కేకేసింది.

"మీ బావజీతం అంతంత మాత్రమాయె. ఇప్పటికే నీ బరువు మీద పడిందని మూలుక్కుంటున్నారు. నేను మాత్రం ఏమనను ? అటు భర్త... ఇటు నువ్వు?"

తను భారమా ? సత్యవతి వితర్కించుకుంది. తను అనాధ. ఒకళ్ల పంచన చేరింది. ఈ రోజులో ఎవరి సంసారం వారికే భారంగా వుంటోంది. 'నా డబ్బు వుంది కదా' అందామనుకుంది, అనలేకపోయింది. కావల్సినవారి మధ్య వ్యాపార సరళిగా మాట్లాడటం ఆమెకి చేతకాదు.

ముందు గొయ్యి వెనక నుయ్యి. కాదని ఏం చేయడం...ఇంట్లో బావ డేగలా అవకాశంకోసం చూస్తున్నాడు. ఎన్నిసార్లు తప్పించుకుంటుంది ?

"నువ్వు కాదనవని మాట యిచ్చేశాననుకో." హైమావతి మరో అడుగు ముందుకేసింది.

రాజీవ్ గుర్తుకొచ్చాడు సత్యవతికి.

"ఏమంటాడో ?" అనుకుంది.

# 2

పడమటిదిక్కున తళుక్కుమంటున్న శుక్రతారతప్ప ఆకాశంలో యితర వెలుగేం లేదు. విదియ చంద్రవంకకొంత ఎక్కడానికి యింకా వ్యవధి వుంది.

గోదావరిపై పడవ సాగిపోతోంది. చీకట్లో దూరంగా దీపాలు మెరుస్తున్నాయి. తరంగాలు సంగీతం వినిపిస్తున్నాయి. సత్యవతి చాపలో పెట్టెమీద తల ఆన్చి మౌనంగా కూర్చుని వుంది. చుట్టపడేసి భానోజీ బల్లమీదనుంచి చాపలోకి వచ్చాడు. "భయమేస్తోందా ?... వచ్చేశాం. బస్సు సమయానికి అందకపోవడంతో మనకి ఆలస్యమయిపోయింది."

"భయమెందుకు ? నేను దేనికీ విచారించే మనిషిని కాను."

పాపాయి కూడ చాపలోకి వచ్చింది. "ఏమిట్రా... మొగుడూ పెళ్లాలు గుసగుసలాడుకుంటున్నారు ? నేను వినకూడదా ?"

భానోజీ చిరాకుపడ్డాడు. "నువ్వలా దూరంగాపోయికూర్చో."

పాపాయి నవ్వింది. "అందుకే పెళ్లాం బెల్లం అన్నారు, పెదనాన్నా... నువ్వు మళ్లీ పెళ్ళి చేసుకున్నావుకదా ! నాక్కూడా చెయ్యకూడదూ ?"

"నీ వెధవ వాగుడు మండా" భానోజీ బల్లమీదకి పోయాడు.

పాపాయి సత్యవతి ప్రక్కగా జరిగింది. "పెద్దమ్మా... నీకు మా ముసలి పెదనాన్న ఎలా నచ్చాడు" అంది మెల్లగా.

సత్యవతి ఆ పిల్ల తింగరతనం భరించడం వుదయంనుంచీ నేర్చుకుంది. తను వెళ్లేది కొత్తచోటు. కొంత సాయముండాలి తనకి. అందుకే పాపాయి అంటే తలనొప్పి కల్గలేదు. హైమావతి కూడా వస్తానంది. భానోజీ రమ్మన్నాడు.

"ఎంతో శ్రమపడి పెళ్ళిచేశావు. మళ్ళీ నీకు శ్రమ ఎందుకు. నా పాట్లు నేను పడతాలే, నువ్వు రానక్కర్లేదు."

హైమావతి ముఖం మాడిపోయింది. ఆమె స్పష్టంగా రావద్దని చెప్పడంతో ఆశాభంగం చెందింది. తన బాధని తేలుకుట్టిన దొంగలా దిగమ్రింగుకుంది. తను కోరుకున్నది అయిపోయింది. సత్యవతి కోపం ఎల్లకాలం వుండదుకదా ! అని సరిపెట్టుకుంది

సత్యవతి వెళ్లేటప్పుడు ఎవరితోనూ చెప్పలేదు. తనకెవరూ ఆప్తులు లేరన్న భావం కల్గిందామెకి. పాపాయి మాత్రం "బామ్మగారూ... మీ పనిమనిషితో కూడా చెప్పండి నేను వెళ్ళిపోయినట్లు మళ్లీ ఎప్పుడొస్తానో" అన్నది హైమావతితో.

బామ్మగారన్నందుకు హైమావతికి కోపం వచ్చినా, ఉంగరాల చేత్తో మొడితే నొప్పిలేనట్లు, భానోజీతో చెల్లెలిపెళ్ళి జరిపించడం ఘనకార్యంగా భావిస్తోంది. బాకీ ఎగనామం, కానీ ఖర్చులేకుండా చెల్లెలి పెళ్ళికావడం ఆమెకి అంతులేని తృప్తి నిస్తున్నాయి.

గాలి తిరగడంతో పడవ వేగం అందుకుంది.

"పిన్నీ... నీకు ఈత వచ్చా ?''

"రాదు" అంది సత్యవతి.

"ఆ మధ్య మా అమ్మతో సముద్ర స్నానానికి వెళ్లినపుడు ఈత నేర్చుకుంటా నన్నాను. ముందర చిన్నవాటిలో నేర్చుకోవాలని, దానివల్ల ప్రమాదముండదని చెప్పింది. సముద్రంకంటె చిన్నది నది. నదికంటె చెరువు, చెరువుకంటె నుయ్యి చిన్నది. ఇంటికిరాగానే బావిలోకి దూకేశాను. ఆ చిన్న నుయ్యిలో ఈదడం ఎలా అబ్బా... మా అమ్మకి బుర్రలేదు."

సత్యవతి నవ్వింది.

పడవ ఆగింది. రేవులో బండి సిద్ధంగావుంది. సత్యవతి, పాపాయి వెనక కూర్చున్నారు. చీకటిలో బండి బయలుదేరింది. రోడ్డుకూడా గతుకులు జనసంచారం కూడా తక్కువగానే వుంది.

తను చేస్తున్న సాహసం సత్ఫలితాన్ని యిస్తుందా ?

ఈ అన్వేషణ తప్పదు. ప్రతీ మనిషి సుఖసంతోషాలకోసం రకరకాల మార్గాలలో ఆరాటపడుతుంటాడు. ఇది తప్పు అనే కొలతబద్ద సమాజందగ్గర రెడీగా ఏం లేదు. సాంఘిక నియమాలు నాగరికతనిబట్టి మారుతూంటాయి.

మధ్యతరగతి సాంఘిక వర్గంలో పెళ్ళి ధనంతో ముడిపెట్టబడి వుంటుంది. ధర్మం ఒకవైపు, ధనం మరొకవైపు ఢీకొడతాయి. దాంతో స్త్రీ జీవితం సమస్య అవుతుంది, ప్రశ్నవుతుంది. అసమర్థులు రాజీపడిపోతారు. ప్రాప్తించినదే పంచామృతమని ఆత్మవంచన చేసుకుంటారు. పురోగమనానికి పరవశించేవారు ఛాలెంజిగా తీసుకుని కాలంతో కుస్తీ పడతారు. ఇసుకనుంచి తైలం పిండాలను కుంటారు.

ఆ రోజు రాజీవ్‌ని కల్సుకోడానికి వెళ్ళింది......

కుక్క భౌమంటూ మీదపడింది. ఇంటాయన భూలోకం వచ్చి కుక్కని పట్టుకున్నాడు. "నువ్వా... అమ్మాయ్..."

"రాజీవ్ వచ్చాడా !"

"మధ్యాన్నమే వచ్చాడు. రేపు కాలేజీలు తెరుస్తారుటకదా... బయటికి వెళ్ళాడేమో చూడలేదు మరి" అన్నాడు కుక్కని స్తంభానికి కట్టివేస్తూ.

సత్యవతి గ్యారేజీ ప్రక్కనున్న మేడమెట్లు ఎక్కి పైకి వెళ్ళింది. మేడమీద నాలుగు గదులున్నాయి. భూలోకం వాటిని కాలేజీ కుర్రాళ్ళకి అద్దెకి యిచ్చాడు.

తలుపులు దగ్గరగా వేసివున్నాయి. సత్యవతి తొంగిచూసింది.

రాజీవ్ భారంగా చూస్తూ మంచంమీద దొర్లుతున్నాడు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు వుంది అతడి ముఖం.

"డాక్టర్‌గారు కేసు గురించా ఆలోచిస్తున్నారు?"సత్యవతి లోపలికి వచ్చింది.

రాజీవ్ వులిక్కిపడి లేచాడు. సత్యవతిని చూడగానే ముఖం వికసించింది. 'రా...' కుర్చీ ఎదరకి తోసి "అప్పుడే డాక్టర్ని చేసెయ్యకు. ఇంకా సంవత్సర ముంది డాక్టర్‌ని అనిపించుకోడానికి" అన్నాడు.

"చివరి మెట్టుమీద వున్నావుకదా !"

"అందుకే ప్రమాదం ఎక్కువ. నేనిప్పుడు ఆలోచించేది జీవితాన్ని గురించి."

సత్యవతికి అర్థంకాలేదు.

రాజీవ్ లేచి అల్మారా దగ్గరకి వెళ్ళాడు. బిస్కట్టు ప్యాకెట్టు, పింగాణీ ప్లేటు తీసుకువచ్చి సత్యవతి ప్రక్కగా కూర్చున్నాడు. "జీవితం అర్థం లేకుండా అయిపోయింది సత్యా. ఏం చెయ్యాలో నాకు బోధపడటంలేదు." బిస్కట్ల ప్లేటు అమె ముందుకు తోశాడు.

నవ్వుతూ...తుళ్ళుతూ...సెలయేరులా...సంతోషమంతా తనదేనన్నట్లు ప్రవర్తించే రాజీవ్‌ని చూడగానే తన విచారం ఎగిరిపోయింది.

"నేను నీ కోసం బయలుదేరి వద్దామనుకున్నాను. రేపు ఎలాగూ ప్రయాణమే కదాని ఆగిపోయాను."

"ప్రయాణమా ? రేపు కాలేజీ తెరుస్తారు కదా !"

"నేనిక విద్యార్థిని కాదు."

సత్యవతి బిస్కట్లు ప్రక్కకి పెట్టి అతడి దగ్గరగా జరిగింది. "నాకు అర్థ మయ్యేలా చెప్పు రాజీ ? ఏమిటి నీ కొచ్చిన సమస్య ?"

"నీతో చెప్పినా వుపయోగ ముండదు సత్యా. మనం జీవితం గురించి ఎన్నో పగటికలలు కన్నాం. అవన్నీ నీటిమీద రాతలయినాయి. నేను చదువు మానేస్తున్నాను."

"రాజీవ్ !"




"ప్రస్తుతం నా జీవితం క్రాస్‌రోడ్‌లో ఆగిపోయింది. చదువు కావాలా? జీవితం కావాలా అన్న డైలమా ఎదురయింది. నాకు జీవితమే ముఖ్యమనిపించింది."

"సిద్ధాన్నాన్ని మట్టిపాలు చేస్తావా? వైద్యుడిగా ఎన్నో ఆశలు, ఆశయాలు వల్లించావు. సమస్య ఎదురయినంత మాత్రాన చదువు మానుకుంటావా!"

"ఇది నాకు మాత్రం యిష్టమా? విధి నిర్ణయం అలాగున వుంది. మామయ్య వలలో నేను పడదలుచుకోలేదు"

రాజీవ్ సిగరెట్ నోట్లో పెట్టుకుని అగ్గిపెట్టె కోసం చూశాడు క్రింద పడిన అగ్గిపెట్టెని తీసి సత్యవతి వెలిగించింది రాజీవ్ నిండుగా పొగ వదిలి వెనక్కి వాలాడు.

"ఇన్నాళ్లూ దిక్కులేని నన్ను మామయ్య అభివృద్ధిలోకి తీసుకువచ్చినందుకు కృతజ్ఞుడిగా వుండాలనుకున్నాను. మామయ్య వ్యాపారి అతడు దేన్నించయినా లాభాలే పిండుకుంటాడని నాకు అర్థమైంది. సావిత్రిని పెళ్ళిచేసుకోమన్నాడు."

సత్యవతి మందహాసం చేసింది. "ఇదన్నమాట నీ సమస్య. హాయిగా సావిత్రిని పెళ్ళిచేసుకుని మీ మామయ్య ముచ్చట తీర్చు."

అందులో ఎత్తిపొడుపు వుందాని రాజీవ్ తొంగిచూశాడు సత్యవతిముఖంలోకి.

"సావిత్రికి భర్తనే కాదు, ఆమె బిడ్డకి తండ్రిని కూడ కావాలి. నాలో అంత త్యాగబుద్ధిలేదు. సావిత్రి కోరికలకి సాంఘిక గౌరవం కల్పించడం నా తరం

కాదు. దాంతో మామయ్య మండిపడ్డాడు. నీకు విశ్వాసం లేదన్నాడు. కుక్క నీ కంటే నయమన్నాడు. సామదానభేద దండోపాయాలు ప్రయోగించాడు. నేను లొంగలేదు. అయితే యిక నీ గురించి నాకేం పూచీ లేదన్నాడు. ఇంట్లోనుంచి గెంటివేశాడు.

చెప్పు సత్యా! మామయ్య నన్ను ప్రయోజకుడ్ని చేశాడు. దానికి బదులుగా సావిత్రి పాపాన్ని నేను భరించాలా? మంచితనానికి కూడ ఖరీదు కట్టడం జరుగుతుందా?" రాజీవ్‌లో ఆవేశం పొంగి ప్రవహించింది.

సత్యవతి మౌనంగా వుండిపోయింది. రాజీవ్ మామయ్యది తండ్రి ఆరాటం. అది సహజమే కావచ్చు. "మరి సావిత్రి ఏమంది?"

"సరదా తీర్చుకున్నవాడు చల్లగా జారుకున్నాడు. ఇక నువ్వే నా మొగుడివి బావా అంటోంది మనుషుల్ని ఎర చూసుకుని వ్యాపారం చేసే వాళ్ళంటే నా కసహ్యం"

సత్యవతి తన సమస్యేం చెబుతుంది? తన సమస్య చిన్నగీతయిపోయింది అతడి సమస్య ముందు. అతడే దారి దొరక్క విలపిస్తూంటే తనేం చెబుతుంది?

సత్యవతికి అంతరంగంలో ఓ దారి కనిపించింది. దానివల్ల యిద్దరి జీవితాలూ రాజమార్గానికి వస్తాయి. కాని రిస్క్ తీసుకోవాలి.

"ఏం సత్యా మాట్లాడవ్?" ఆమె చెక్కిళ్ళని మెల్లగా రాస్తూ అడిగాడు.

తేరుకుంటూ అన్నది. "అయితే యిప్పుడేం చేద్దామనుకుంటున్నావ్?"

"ఏదయినా చిన్న వుద్యోగం చూసుకుంటాను. అంతకంటె మార్గంలేదు. ఆత్మాభిమానంతో గంజి త్రాగినా మంచిదే సత్యా!"

"అంతకంటె మార్గం లేదా?"

"డబ్బు లేకుండా చదువెలా సాగుతుంది? చదువు గురించయినా నా మాట వినడా అని మామయ్య ఎత్తు వేశాడు. కాని చదువు నాకు ముఖ్యం కాదు"

"నీ చదువు కొనసాగించు?"

"ఎలా, రేపు ఫీజులు కట్టాలి?"

సత్యవతి మెడలో నుంచి గొలుసు తీసి అతడి చేతిలో పెట్టింది. "ఇది అమ్మి ముందర ఫీజులు కట్టెయ్."

అతడు ఆర్ద్రంగా చూశాడు.

"అందం కోసం పెట్టుకున్న నగ ఆపదవేళ సాయపడుతుంది రాజీవ్. ఒకళ్ళ కోసం ఒకళ్ళం త్యాగం చెయ్యడంలో తప్పులేదు."

"అదికాదు సత్యా...ఈ గొలుసుతో పూర్తవదు కదా! తర్వాత ఏం చెయ్యడం? నీ పరిస్థితి నాకు తెలియనిదా? రూపాయిలు నువ్వు మాత్రం ఎక్కడ్నుంచి తెస్తావ్?"

"నీ చదువు ఆగకుండా చూస్తాను."

"సత్యా!" అతడిలో ఆనందం వ్యాపించసాగింది. అసంభవమన్నది, సంభవమవుతోంది. కాని సంశయం తీరలేదు. "ఎలా?"

"ఇప్పుడు చెప్పను. నా మీద నమ్మకం లేదా?"

"ఎంత మాటన్నావ్...నిన్ను నమ్మకపోవడమా? కాని నా గురించి నువ్వు శ్రమపడటం యిష్టంలేదు."

"అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే ఎలా?"

రాజీవ్ వళ్ళు విరుచుకుంటూ లేచాడు. తన కల చెదిరిపోవశంలేదు. తను డాక్టర్ అవుతాడు. మామయ్య కాదన్నా తన జీవితానికి వచ్చే లోటేం లేదు.

"ఇదంతా మనకోసం రాజీవ్...ప్రస్తుతం మనం పల్లెలో వున్నాం రోడ్డెక్కడానికి కొంచెం శ్రమపడాలి. మన దాంపత్యం కోసం ఆ మాత్రం రిస్క్ భరిద్దాం." ఆమె గొంతుక భారంగా వణికింది.

"నిన్ను చూసి కొత్త వూపిరి తెచ్చుకుంటాను సత్యా! నువ్వే నా జీవితంలో ప్రవేశించకపోతే నా దారి వేరుగా వుండేది." రాజీవ్ ముందుకు వంగి ఆమెని దగ్గరగా లాక్కున్నాడు. సత్యవతి అతడి ఒడిలో వాలిపోయింది గట్టిగా కౌగిలిలో బంధించాడు. ఆ వెచ్చదనంలో సత్యవతి కరిగిపోయింది కర్తవ్యంపై మరింత శ్రద్ధ కల్గింది.

రాజీవ్ మెడమీద, చెక్కిళ్ళమీద చుంబించాడు. "మనల్ని ఎవరూ విడదీయలేరు సత్యా...మనం దంపతులయ్యే శుభ ఘడియ కోసం ఆశగా వేచి వుందాం."

అసుర సంధ్య వ్యాపించింది సత్యవతి లేచింది

"ఈ రాత్రికి ఆగిపోకూడదనూ?"

"ఎందుకో?" కొంటెగా నవ్వింది.

"చెప్తాగా."

"దానికి మనకెంతో వ్యవధి వుంది."సత్యవతి వరండాలోకి వచ్చింది రాజీవ్ గదికి తాళంవేసి ఆమెతో క్రిందకి వచ్చాడు.

రిక్షా కనిపించలేదు. సందు చివరిదాకా నడిచారు.

"మనం వీడ్కోలుగా కాస్త కాఫీ త్రాగుదాం. మళ్ళీ రాణీగారి దర్శనం ఎప్పుడో." హోటల్‌లోకి దారితీశాడు

ఫ్యామిలీ సెక్షనులో కూర్చున్నారు. రాజీవ్ బిర్యానీ ఆర్డర్ యిచ్చాడు.

"రేపు మామయ్యకి వుత్తరం రాసిపడేస్తాను. నువ్వు కాదన్నా నా చదువేం ఆగలేదని. దాంతో కుళ్ళిచస్తాడు." రాజీవ్ సీరియస్‌గా అన్నాడు.

"కావల్సినవారి మధ్య కక్ష ఎందుకు రాజీవ్?"

"ఆ బంధుత్వం తెగిపోయింది. నా కెవరూ లేరు సత్యా నువ్వు తప్ప."

బేరర్ బిల్లు తీసుకువచ్చాడు. సత్యవతి అందుకోబోయింది. రాజీవ్ ఆమె చెయ్యిమీద చెయ్యివేసి నొక్కాడు. "ఇలా అమ్మాయిగారి చెయ్యి నొక్కే అవకాశం వచ్చింది. ఈ చిన్న బిల్లయినా నన్ను చెల్లించనీ సత్యా."

రిక్షాలో బస్ స్టాండ్‌కి వచ్చారు. సూపర్ ఎక్స్‌ప్రెస్ రెడీగా వుంది. సత్యవతి ఎక్కి విండో ప్రక్కగా కూర్చుంది. బస్సు బయలుదేరింది. రాజీవ్ రుమాలు ఎగరేస్తున్నాడు.

తుమ్మెద కనకాంబరం పువ్వుమీద వాలుతుంది. ఆ సున్నితమైన పువ్వు ఆ భారానికి నిలవలేక అటు యిటు కదిలిపోతుంది. అలాంటి కదలిక సత్యవతిలో కనిపించింది. చేరవల్సిన లక్ష్యాల తీరం సుదూరంగా కనిపిస్తోంది. రాజీవ్... దూరమైపోతున్న రాజీవ్‌ని చెమ్మగిల్లిన కళ్ళతో చూడసాగింది ... "ఇదంతా మనం దగ్గర కావడానికే రాజూ."

"లే...పిన్నీ...మనిల్లు వచ్చేసింది" పాపాయి తట్టి లేపడంతో సత్యవతి గతంనుంచి వాస్తవంలోకి వచ్చింది.

భానోజీ మర్నాడు కొత్త భార్యతో సత్యనారాయణవ్రతం చేశాడు. ఆ వూర్లోను చుట్టుప్రక్కల అతడి బంధువులు చాలామందే వున్నారు. ఎవ్వరినీ పిలవలేదు. తను ఎదగడం ప్రారంభించాక అతడు బంధువులను దూరంగా గెంటివేశాడు. తనకి ఎవరివల్లా వుపయోగంలేదు. తను స్నేహంగా వుంటే ముఖమాటంచేత ఎవరికయినా సాయం చెయ్యవల్సి వస్తుంది. భానోజీకి మిత్రులకంటె శత్రువులే ఎక్కువ.

మూడోభార్య పోయాక వంట చెయ్యడానికి బుచ్చమ్మని చేరదియ్యక తప్పలేదు. అతడి అన్నగారు కోడిపందాలలో ఆస్తి సమర్పించి, బుచ్చమ్మని, పాపాయిని వదిలేసి బైరాగుల్లో కల్సిపోయాడు. ఆదదిక్కు అవసరం కనుక బుచ్చమ్మని చేరనిచ్చాడు. పాపాయి తింగరమొద్దు. పాలేరుతో గడ్డివాము

దగ్గర శృంగారంలో చూసి, ఓసంబంధం చూసి ముడివేశాడు పాపాయి కాపురం చేసింది వారంరోజులే.

సంబంధం ఆమెని చావగొట్టేవాడు. అత్తగారు రాచి రంపాన పెట్టింది. పాపాయి పరిగెత్తుకొచ్చింది. మళ్ళీ దారి తప్పుతుందని అల్లుడికి ఓ వెయ్యి రూపాయిలు, వియ్యపురాలికి జరీచీర, ఘనంగా సారెపెట్టి పంపించాడు. సంబంధం పెళ్ళాన్ని నాలుగురోజులు మర్యాదగానే చూశాడు. తిరిగి శిక్షలు మొదలయ్యాయి. పాపాయి పుట్టింటికి లేచిపోయింది. భానోజీ మళ్ళీ ఏదో యిచ్చి పంపించాడు.

సంబంధానికి తన భార్య పుట్టింటికి వెళ్ళడం గొప్ప అవకాశంగా తోచింది. ఇది గమనించి భానోజీ యింక ఆమెని పంపలేదు.

వ్రతానికి కరణాన్ని మాత్రం పిలిచాడు. భానోజీ ఆ వూళ్లో కాస్త మాట్లాడేది అతడితోనే. పొలాలు కొనడంలో సాయపడతాడని చేరదీస్తాడు.

భోజనాలవేళకి కులపతి వచ్చాడు. "తాసిల్దారు వచ్చిపడ్డాడయ్యా...ఇళ్ళ స్థలాలుపంచుదాం నడవమన్నాడు..కలిసివచ్చే బాపతుకాదని సగంలో వదుల్చుకుని వచ్చాను...రాకపోతే నువ్వేమనుకుంటావో."

పాపాయి కాళ్ళకి నీళ్ళు యిచ్చింది. బుచ్చమ్మ వసారాలో ఆకులువేసి వడ్డించింది.

"వదినా ! అమృతపాణి పళ్ళు ముగ్గాయేమో చూడు...కరణానికి యిష్టం."

కరణం పనసకాయకూర కలుపుతూ నవ్వాడు. "నాతో ఏమన్నా పని వుందా ఏమిటి ?"

సత్యవతి నిద్రపోయి నాల్గింటికి లేచింది. కంచుగ్లాసుతో టీ, మినప సున్ని తెచ్చింది పాపాయి. "అక్కా...రాత్రి నీ శోభనంట, పువ్వులజడ కుట్టడానికి రాజ్యం వదినని రమ్మంది అమ్మ."

సత్యవతిలో కలకలం, కలవరం, వ్యధ, బాధ, సందేహం, సంకోచం.

మామిడిచెట్టు క్రింద తచ్చాడుతున్న సత్యవతిని రాత్రి వంటకి ప్రయత్నిస్తున్న బుచ్చమ్మ "అక్కడ నుంచున్నా వేమిటి ?" అనడిగింది.

"ఇంట్లోకి రాకూడదు."

"పెళ్ళికి ముందే నీళ్ళయ్యాయంది మీ అక్క."

"పొరపాటు పడివుంటుంది."

బుచ్చమ్మ మరది గదిలోకి పరుగెత్తి చెప్పింది. "పనిలో పని అయిపోతుం దనుకున్నాం రేపట్నుంచి మళ్ళీ శూన్య మాసమాయె."

ఖానోజీ సమాధానం చెప్పలేక మూల్గాడు. పరుగులుతీసే సంతోషానికి పగ్గం పడింది. నిటూర్పువిడిచి "ఏం చేస్తాం?" అన్నాడు.

పాపాయి తొందరపడుతూ ఎగురుకుంటూ వసారాలోకి వచ్చి "అక్కా! నీ శోభనం ఆగిపోయింది. నీ శోభనంతో నా శోభనం కూడ చేస్తుందేమో మా అమ్మ అనుకున్నాను," అంది.

సత్యవతికి తాత్కాలికంగా గండం గడిచినందుకు సంతోషంగా వుంది.

"నీ మొగుడ్ని రమ్మన్నా?"

"వద్దు బాబూ. రాగానే చింతజువ్వ పుచ్చుకుంటాడు."

సత్యవతికి రెండురోజులు గడిపేసరికి రెండు యుగాలు గడిపినట్లయింది. పాడుపడిన కోటలో ఒంటరిగా వున్నట్లు ఫీలయింది. ఆమెకి యింతవరకు పల్లె జీవితం అనుభవంలేదు. ఏదోలా పట్టణాలలోనే యిప్పటిదాకా గడిపి,యిప్పుడు పల్లెలో నివసించడం పానకం త్రాగాక వుప్పునీళ్ళు త్రాగినట్లుంది. పల్లె జీవితం చాల స్తబ్దంగా వుంటుంది. ఏమాత్రం వేగముండదు. పైగా ఖానోజీ యిల్లు తోటల్లో వుంది. రోడ్డు ఎక్కడానికి పదినిముషాలు పడుతుంది.

ఎటు చూసినా కొబ్బరి తోట. ముంగిటలో కొంత భాగం పేడతో అలికి వుంది. కుడివైపున సగం లేచిన ప్రహారీ. ప్రక్కగా యిటుకలు గుట్టగా పోసి వున్నాయి. ఎడమెడంగా మూడురకాల మందారచెట్లు మాత్రం వున్నాయి. పీధరుగులున్నా వాటినిండా జనప కట్టలు, చిట్టు బస్తాలు వుంటాయి. వాటిమీద కోళ్ళు, పిచికలు, ఉడుతలు విహారం చేస్తుంటాయి.

ఇల్లు విశాలమైనదైనా సామానుల పొందిక లేక యిరుకుగా వుంటుంది. ఇది మనుషులుండే కొంపేనా అని సత్యవతికి అనుమాన మొచ్చింది. సరయిన ఫర్నిచరు కూడ లేదు. ఇంటికి కరంటు కూడ లేదు. మంచాలుకూడ పాత కాలం నాటివి. వాటిని ఎక్కడానికి మోకాలి పీటలు వాడాలి. పెరటివైపు గడ్డి వాములు, పాకలతో అరణ్యం లాగుంటుంది.

ఖానోజీ, బుచ్చమ్మ ఉదయంపూట టీ త్రాగుతారు పెద్ద గ్లాసులతో. పాపాయి పాలేర్లతోబాటు చద్దన్నం లాగిస్తుంది. సత్యవతికోసం బూర్ని సీసా తెప్పించాడు. సత్యవతికి పొద్దు గడవడం సమస్యయింది. ఖానోజీ పొలం పనులతోను, వడ్డీ లెక్కలతోను యింట్లోనే వుండడు. బుచ్చమ్మ మితభాషి. ఎప్పుడూ ఏదో పనిచేస్తూనే వుంటుంది. ఎక్కడా ఆమె మాట వినిపించదు. నాల్గుగంటలకి లేచి చల్ల తిప్పడంతో ఆమె దినచర్య ప్రారంభమవుతుంది. పన్నెండు గంటలకి



ఖానోజీ భోజనం అయ్యేదాకా యింట్లో వంటకే సరిపోతుంది. తర్వాత బియ్యమో, పప్పులో బాగుచేస్తుంది. ఏ పనీ లేకపోతే చీపుళ్ళు కడుతుంది. మళ్ళీ సాయంత్రం వంట రాత్రి పదిగంటల దాకా దీపం పుచ్చుకుని తిరుగుతూ దేనికోదానికి తాపత్రయపడుతుంది. ఏదయినా పనిచేసి కాలం గడపాలనుకుంది. కాని అలవాటు లేని మోటుపనులు ఆమెకి చేతకాలేదు.

పాపాయిది ఎదిగిన వయసు, ఎదగని మనసు. ఆపిల్లతో కాలక్షేపం చెయ్యడం కష్టం. తలనొప్పి కూడ వస్తుంది. సత్యవతికి యిక్కడ భోజనం కూడ సమస్యయింది. ఆ యింట్లో అందరూ భోజనప్రియులే. రెండు మూడు కూరలు, పులుసు, పెరుగు, కమ్మటి నెయ్యితో భోజనం చెయ్యడం మొదటిరోజు సుఖంగా వున్నా తర్వాత ముఖం మొత్తింది. పైగా బుచ్చమ్మ తిండిదగ్గర బలవంతం చేసేది. పైగా మధ్యాన్నం దాదాపు అన్నమంత పరిమాణంలో రొట్టో, ఉప్పుడు పిండో, పులిహోరో !

సత్యవతి పుస్తకాల కోసం యిల్లంతా వెతికింది. ఎక్కడా చదివేది ఏం కనిపించలేదు. పాత పంచాంగాలు, క్యాలెండర్లు తప్ప ఎలాంటి పుస్తకమూ లేదు.

"నవల్లు దొరకవూ ?" పాపాయి నడిగింది.

"అవేమి టక్కా ?" పాపాయికి అన్నం చొరవే కాని అక్షరం చొరవలేదు.

"చదువుకునే పుస్తకాలు."

"అయ్యో ! అయ్యో... అత్తయ్యా... నీకు పిచ్చి ఎక్కిపోతుంది. వాటి జోలికి పోకు."

"నీ కెవరు చెప్పారు ?"

"మా అత్తయ్య చెప్పింది. ఏదో పుస్తకం చదువుతోందని మా ఆడపడుచుని కర్రతో బాదేసింది. అది ఒకటే గోలనుకో." దీర్ఘం తీస్తూ చెప్పింది.

"నీకు తగ్గ అత్తగారేలే...పుస్తకాలు తెచ్చిపెట్టు. నాకు చాలబోర్‌గా వుంది."

"సప్తగిరిని అడిగి పట్టుకురానా? అతడి దగ్గర చాలా పుస్తకాలుంటాయి. ఎప్పుడూ ఏదో చదువుతూనే వుంటాడు పెద్ద పరీక్ష కెళ్లేవాడిలా."

"సప్తగిరి ఎవరు ?"

"కరణంగారి అబ్బాయి." అంటూ కుచ్చిళ్ళు పైకి దోపి పరుగుతీసింది. అడ్రస్‌లేని వుత్తరంలా వెంటనే వచ్చేసింది "గిరి లేడు. సంతకి వెళ్లాడుట."

సత్యవతి వుదాసీనంగా హాల్లో కూర్చుంది సాయంత్రం సమయం. ఇంట్లో రేడియోకూడ లేకపోవడంతో యితర ప్రపంచంతో సంబంధం లేనట్లుగా వుంది. తినడం–నిద్రపోవడం.

భానోజీ వచ్చాడు. సంచీ, చేతి కర్రా హాల్లో వంకెకి వ్రేలాడదీసి ఉయ్యాల మీద కూర్చున్నాడు. "వదినా...మంచినీళ్ళు."

సత్యవతి తెచ్చి యిచ్చింది.

"ఏమిటి రాణీగారు అలాగున్నారు?" భానోజీ నవ్వుతూ ఆమె దగ్గరికి వంగాడు.

"నేనేదో తప్పుచేసి వుంటాను. దేముడీ అడవిలో పడేశాడు "

భానోజీ ఫక్కున నవ్వాడు. "మా వూరు అడవిలా వుందా ? మీ బస్తీ పిల్లలకి అలాగే వుంటుందిలే."

"నేను మా అక్కయ్య దగ్గరకి వెళ్ళిపోతాను. నాకీ యింట్లో భయమేస్తోంది."

"అలవాటుపడేదాకా అలాగే వుంటుంది. నీకేం కావాలో తెప్పించుకో."

"మీరు భయపడిపోతారు ఖర్చుకి."

"అదేం లేదు...నువ్వు కోరితే కాదంటానా ?"

సత్యవతిని తనకేసి తిప్పుకోడానికి ఆమె మనసు సంతృప్తపరచాలని గ్రహించాడు. సత్యవతి అందానికి దాసుడైపోయాడు.పునస్సంధానం వాయిదా పడటం ఆ ప్రేమని రెట్టింపుచేసింది అందుకే డబ్బు ఖర్చుపెట్టడానికి కూడా సిద్ధపడ్డాడు

"చూస్తాగా" గ్లాసు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది, అక్కడే వుంటే ఎక్కడ దగ్గరికి రమ్మంటాడోనని. భానోజీ లయబద్ధంగా వూగుతున్న ఆమె పృష్ఠ భాగాన్ని కాంక్షగా చూశాడు.

బానోజీ సిగ్నల్ యివ్వడంతో సత్యవతి ఛార్జు తయారుచేసింది.

పనికిరాని సామాను అటక ఎక్కించింది. వీధి అరుగులు, ముందర గదులు గచ్చు చేయించింది. పాత తలుపులు తీసి కొత్తవి పెట్టారు. కిటికీలకి, ద్వారాలకి తెరలు వచ్చాయి. ఇంటికి కరెంటు, ఫ్యానులు వచ్చాయి. పేపరువాడు అన్ని పుస్తకాలు యిస్తున్నాడు. వాకిటిలో పూలమొక్కలు వెలిశాయి. ఇంకా సోఫా సెట్లు, రేడియో, యితర అలంకరణ సామగ్రి చోటుచేసుకున్నాయి. భానోజీ ఆమెకోసం ఎన్ని రూపాయిలయినా ఖర్చుచేసే దశలో వున్నాడు.

"ఇప్పుడు యివన్నీ ఎందుకు బానూ ?" బుచ్చమ్మ మందలించింది. ఇంత మార్పు జరగడం ఆమె కిష్టంలేదు.

"సత్య చదువుకున్న పిల్ల. మనలా వుండగలదా వదినా ?"

బాను మాయలో పడిపోయాడనుకుంది.

ఇది సత్యవతి విన్నది. ఈ యింటి పెత్తనం తనకి రావాలంటే బుచ్చమ్మ తొలగిపోవాలి. ఆమె వుంటే అడ్డే. తన ఎదుగుదల అసంభవం. ఆమెని బయటికి పంపడ: ఎలా మరి ?

సత్యవతి మనస్సు చురుగ్గా ఆలోచించసాగింది.

## 3

చుక్కలు తెల్లమొహం వేస్తున్నవి. తూర్పుదిక్కు రంగస్థలంమీద తెర వెనుక వెలుగు పాత్రధారులు ముందుకు రాడానికి వుత్సాహపడుతున్నారు. చల్లటి గాలి వింజామరలా వీస్తోంది. కోడిపుంజులు ప్రభాతానికి స్వాగతం పలుకుతూ వుదయగీతం పాడుతూ జాతిని మేల్కొలుపుతున్నాయి

భానోజీ అప్పటికే పొలంవెళ్ళి తిరిగి వచ్చాడు. బుచ్చమ్మ ముంగిటలో ముగ్గు వేస్తోంది. భానోజీ పెరటిదారిన పశువుల కొట్టంలోకి వెళ్ళాడు. రంగయ్య నల్లావు పాలు పిండుతున్నాడు.

"ఏరా పెందరాడే మేతకువ రావటంలేదా ?" ఆవు ముందు పచ్చగడ్డి ముందుకుతోస్తూ కసురుకున్నాడు. అతడు పొలాన్నుంచి వచ్చేసరికి పాలు పితకడం పూర్తయిపోవాలి.

రంగయ్య నోర్మూసుకున్నాడు. పాల ధారలే వినిపిస్తున్నాయి.

"ఎల్లమందేడి ? ఆ దొరగారు యింకా రాలేదా ?"

"పెద్దమ్మగోరు ఏడకో పంపినారు" అన్నాడు పాలచెంబు బలంగా పట్టుకుని లేగదూడని వదిలేస్తూ.

ఖానోజీ అందుకున్నాడు పాలచెంబు. "గిత్త దూడ కూడానూ...ఓ చనికట్టు పూర్తిగా వదిలేస్తూండు. లేకపోతే పుష్టిగా ఎదగదు.

"సిత్తం...అలాగే సేత్తున్నానండి."

"నిన్న శెట్టితో చెప్పాను కాల్షియం బస్తాల గురించి. బండితీసుకుని అవేసుకుని పేరంటాలు పొలం దగ్గరికి వచ్చేయి. నేను స్నానంచేసి బయలుదేరి వస్తాను."

రంగయ్య గడ్డివాము దగ్గర ఆగిపోయాడు, తలూపి.

ఖానోజీ పెరటివైపున వంటింటి అరుగుమీద చెంబు పెట్టి 'వదినా' అని పిలిచాడు. బుచ్చమ్మ పాలచెంబు అందుకుంది. ఖానోజీ నూతి దగ్గర వేపకొమ్మ వంచి పుల్ల విరిచి పెరటిలోని మొక్కలు చూస్తూ దంతావధానం పూర్తిచేశాడు. బుచ్చమ్మ పెద్దగ్లాసుతో టీ యిచ్చింది. వూదుకుని త్రాగుతూ వీధిలోకి వచ్చాడు.

ఎండ కరకరలాడుతూ వచ్చేసింది. అరుగు చివర కూర్చుని పొగాకు పాయ విడదీసుకుంటూండగా దూరంగా దగ్గు విన్పించింది. కొబ్బరితోటలో అడుగులో అడుగు వేసుకుంటూ కులపతి వస్తున్నాడు. పొద్దున్నే వస్తున్నాదేమిడాని ఖానోజీ మీమాంస పడిపోయాడు.

"ఇల్లు దేవేంద్రభవనంలా మార్చేశావు. యింటిదాకా రోడ్డు వేయించేశావా మా పని హాయి, గంటకి పదిసార్లు వస్తాం."

"రోడ్లూ నూతులు వేస్తామనే కదా మీ రెడ్డినాయుడు క్రితంసారి సర్పంచ్ అవుత."

"పొడిచావూ..." కులపతి బిగ్గరగా నవ్వి ప్రక్కన కూర్చున్నాడు. ఓ చుట్ట వాసనచూసి వెలిగించే ప్రయత్నంచేశాడు. "అలాంటి పదవులకి నీలాంటి వాడుంటేనా...బంగారానికి తావి అబ్బినట్లు వుంటుంది."

"ఆ రాజకీయాలు నా కెందుకులే...ఇలా వుండనీ నన్ను, చాలు."

"రాజకీయరంగం వేడెక్కిపోయి వుంటే అలా మాట్లాడతా వేమిటయ్యా. పాపం చిన్ననాయకులకి పెద్దనాయకులకి తెగడంలేదు, కాంగ్రేసులో వుండాలా? జనతాలోకి దూకెయ్యాలా అని"

"ఎందులో వున్నా ఒకటేలెద్దూ? ఎవరి కుపకారం. ఏరు దాటేదాకానే... ప్రజలు కూడా గొర్రెలు. ఏ పాటకి ఆ తాళం వేస్తుంటారు."

"అవునుస్మీ."

"ఏమిటి ప్రొద్దుటే యిటు వేంచేశావ్?"

కరణం చుట్ట విసిరిపడేసి, పంచె పైకిలాక్కొని గొంతుకూర్చున్నాడు. అన్నమయ్యగారి సీతప్ప తండ్రి గుటుక్కుమనడంతోనే పొలం బేరం పెట్టేశాడు. పార్వతీశం ఎప్పటినుంచో పీక్కుతింటున్నాడు నన్ను ఆ పొలం కొనిపెట్టమని. బంగారపు నేల కదటయ్యా..."

"ఆ పొలం సంగతి నాకు తెల్సులే."

"నేను పార్వతీశానికి..."కులపతి నీళ్ళు నమిలి భానోజీ ముఖంలో కనిపించే మార్పుకోసం తొంగిచూశాడు కళ్ళు పెద్దవిచేసి.

భానోజీకి తిక్కరేగింది. ముఖ్యమైన విషయం దగ్గర కరణం యిలాగే తతంగం చేస్తూంటాడు. సీతప్ప పొలం తనకి కలుస్తుంది. పైగా ఆకుమడికి సదుపాయంగా ఉంటుంది. తను ఒక కన్నువేసి వుంచాడు, అది అమ్మకానికి వచ్చే పొలమే కదాని

"వూరికి కరణమూ, భాషకి వ్యాకరణమూ శత్రువులయ్యా!"

"నువ్వు చెప్పాక కాదంటానేమిటి?" అన్నాడు కులపతి మరో చుట్ట వెలిగిస్తూ.

"సగం చెప్పి వూరిస్తావేమయ్యా? అసలు సంగతి వేగిరం చెప్పు."

"వస్తున్నా, వస్తున్నా...పార్వతీశం రెండు వేలు యిస్తామంటున్నాడు."

"ఎకరానికా?"

"బాగుందయ్యా విట్టు...పొలానికి కాదు. నాకు. నేనింకా మాట ఇవ్వలేదు." ఎక్కువ యిస్తే నీ కన్నట్లు చూశాడు.

భానోజీకి వ్యవహారం కరణం లేకుండా అవదని తెల్సు. "అలా రేటు పెంచేస్తే ఎలాగయ్యా. మంచికీ చెడ్డకీ నేను చూడటం లేదూ. నీకు ఎప్పటి కప్పుడే పరగడుపు."

"కల్పవృక్షం దగ్గర సంకోచపడితే ఎలా...ఇంతకీ ఆ పొలం ఎలా కొన వచ్చునంటావ్. అది చెప్పు ముందర."

"పదివేనుకి పోటీలేదు."

"పన్నెండుకి చేయిస్తాను. పైది నాకు వదిలెయ్. నీ పేరుమీద కొత్త యింటికి శంకుస్థాపన చేసేస్తాను." కులపతి వుత్సాహం చూపాడు.

"గృహప్రవేశందాకా నన్నే రుద్దేస్తావేమిటి?"

"అలా భయపడకు...మరి సీతప్పని లాక్కొచ్చెయ్యనా?"

భానోజీ లేచాడు. "మధ్యాన్నం తీసుకురా...ఈ రోజు ఏకాదశి కూడాను!"

ఎల్లమంద పొలాన్నుంచి కూరలు తెచ్చి వీధి గుమ్మంలో పెట్టాడు.

"రెండు ఆనపకాయలు, పచ్చిమిర్చి కరణంగారి యింటిదగ్గర యిచ్చిరా!" ఖానోజీ తనే చొరవగా అన్నాడు. కులపతి తట్ట దగ్గరకి వస్తే అంతకంటే ఎక్కువకే పనిచెబుతాడు.

"మరి నేను వెళ్ళిరానా. మధ్యాన్నం యింటిదగ్గరే వుండుస్మీ." కులపతి పెద్ద పెద్ద అంగలేస్తూ బయలుదేరాడు.

ఖానోజీ స్నానం, పూజ పరాకుగానే కానిచ్చాడు. సీతప్ప పొలానికి తను ఎక్కువ పెట్టాడా? కులపతి దొంగముండాకొడుకు ఏమరుపాటుగా వుంటే మనిషినే నమిలేస్తాడు. తను రెండు మూడుసార్లు సీతప్ప పొలం కొనాలని వుందన్నాడు. అది పట్టుకుని విజృంభించాడు. అయినా యిందులో తనకి నష్టం ఏముంది నిన్నగాక మొన్న అవతలి చెక్క లక్ష్మీనారాయణ యిరవైకి కొన్నాడు. సీతప్ప గట్టున నాలుగు తాడిచెట్లు కూడా ఉన్నాయి. ఆ సొమ్ముకి తనకి వట్టంకాదు. ఖానోజీకి ధైర్యం హెచ్చింది. కిర్రు చెప్పులు వేసుకుని వూళ్లోకి బయలుదేరాడు. గుమ్మాలు దిగుతుంటే సప్తగిరి ఎదురయ్యాడు.

"మీ నాన్న పంపించాడా ?"

"లేదండీ...చిన్నమ్మగారు పుస్తకాలు తెచ్చిపెట్టమన్నారు."

సత్యవతి అప్పుడే కాఫీ ముగించి రేడియో వింటోంది. సప్తగిరిని చూడగానే తగ్గించి "రండి..." అంది.

సప్తగిరి కూర్చుంటూ రెండు యువలు, ఇలస్ట్రేటెడ్ వీక్లీ బల్లమీద పెట్టాడు.

"రెండురోజులనుంచి డైలీ రావడం లేదండీ!" అన్నది సత్యవతి.

"అప్పలనాయుడు న్యూస్ ఏజన్సీ అలాగే వుంటుందిలెండి. డబ్బు తిన్నగా కట్టడు. వాళ్ళు పేపరు ఆపేస్తుంటారు."

పాపాయిని కాఫీ పట్టుకురమ్మని కేకేసింది.

"వద్దండీ, నే నిప్పుడే త్రాగివచ్చాను."

"ఫర్వాలేదు. ఉద్యోగానికి ప్రయత్నించడంలేదా?"

"మనం ప్రయత్నిస్తే వస్తుందేమిటండీ. ఇది ఉత్తరాల దక్షిణాల కాలం. మా నాన్నది లిటిగెంటు బుర్ర. నాకు ఉద్యోగం వెతికిపెట్టే తెలివితేటలు లేవు."

"చదువులకి-ఉద్యోగానికి సాపత్యం లేకపోవడమే దీనికి ప్రధాన కారణం. మన దొరతనం వారి విషయాన్ని గుర్తించడంలేదు."

"మీలాంటివారు చెబితే కమిటీ వేస్తారు." సప్తగిరి నవ్వాడు.




ఈ యేడు యిక్కడ బొత్తిగా పంటల్లేవు సార్!!
ఇచ్చిన గింజల్ని చల్లమంటే శుభ్రంగా తినేశారండీ వీళ్లు!!!

పాపాయి కాఫీ పట్టుకువచ్చింది. "నేనే పెట్టానండోయ్. మా అమ్మ చెరువు కెళ్ళింది. ఎలావుందో చెప్పాలి."

సప్తగిరి కాఫీ గ్లాసు అందుకుని "కాఫీలో ఏం వేశావు పాపాయీ?" అనడిగాడు.

"ముందర నీళ్ల పెట్టాను. అందులో కాఫీపొడుం, పంచదార, పాలు పోశాను. బస్...కాఫీ తయారు. చాల సులువండీ కాఫీ పెట్టడం. నాలాంటి తెలుసున్న దానికి మరీ సులువు."

సప్తగిరి ఓ గుక్క త్రాగి క్రింద పెట్టేశాడు.

"ఏమండీ...పంచదార చాలలేదా?" సత్యవతి అడిగింది.

"మామిడికాయ ముక్కలు కారంలో అద్దుకుని తిన్నట్లుంది."

పాపాయి కాఫీపొడుం అనుకొని ప్రక్కనున్న కారం డబ్బా తీసి వేసింది. అదీ కారణం. ఇది సత్యవతి తెల్సుకుని నొచ్చుకుంది. పాపాయి పరుగెత్తుకు పోయింది.

రోజులు గడుస్తున్నాయి. సప్తగిరి వస్తూండటంవల్ల సత్యవతికి బోర్‌గా వుండటంలేదు. ఇన్నాళ్లూ మాట్లాడడానికి మనిషి దొరకక ముఖం వాచిపోయింది.

సప్తగిరి యం. ఏ. ప్యాసయ్యాడు. రెండేళ్లనుంచి ఉద్యోగంకోసం వల వేస్తూ నిరాశ పొందుతున్నాడు. విసుగొచ్చి ప్రయత్నించడం మానేశాడు.

ఏ విషయం మీదయినా అనర్గళంగా మాట్లాడేవాడు. సత్యవతి శ్రోతగా కూర్చునేది. పుస్తకాలకంటే అతడి వాదన మంచి రిలీఫ్‌గా వుండేది.

"ఇద్దరు నిరుద్యోగులు, యిద్దరు కొత్త రచయితలు వుంటే ఆ ప్రాంతంలో ఒక పోస్టాఫీసు ఓపెన్ చెయ్యవచ్చు" అన్నాడోరోజు సప్తగిరి.

"కొత్త ప్రభుత్వం వచ్చిందిగా, మీ ఆశలు నెరవేరతాయి."

"సత్యవతిగారూ ... ప్రభుత్వం పాతదే. అది మారదు. పార్టీ కొత్తది. ఎవరయినా ఆ కుర్చీ ఎక్కగానే 'దేశంకోసం త్యాగాలు చెయ్యాలి ప్రజలు' అని ఉద్బోధిస్తూంటారు."

"పాలకులు మంది న్యాయం చూస్తారు. ప్రజలు తమ స్వార్థం చూసుకుంటారు. మీకు న్యాయం జరగనంత మాత్రాన వ్యవస్థని నిందిస్తారా?"

"సామాన్యుడికి కావల్సింది పార్టీలు. ప్రభుత్వాలుకాదు. ప్రాథమిక అవసరాలు. దానికోసమే అతడి ఆరాటం. అది తీరనినాడు పోరాటంలోకి దిగుతాడు. అది వర్గాల మధ్య సంఘర్షణకి దారితీస్తుంది. అలాంటప్పుడు చరిత్ర పునరావృతం అవుతుంది."

సప్తగిరి వారంరోజులపాటు కనిపించలేదు. హఠాత్తుగా ఓ సాయంత్రం ప్రత్యక్షమయ్యాడు. సత్యవతి వాకిటిలో ఈజీఛైర్‌లో కూర్చుని చదివిన పుస్తకమే తిరగేస్తూంది

"మా ఫ్రెండ్ ట్రావిలింగ్ ఏజన్సీ పెట్టాడు. సంపూర్ణ వుత్తర భారతదేశ యాత్రలు ప్రారంభించాడు. కమీషన్‌మీద నాకు పాతిక టిక్కెట్లు అంట గట్టాడు. వారం తిరిగినా యింకా ఒకటి మిగిలిపోయింది," అన్నాడు రుమాలుతో ముఖం తుడుచుకుంటూ.

"పోనీ నా కివ్వండి."

"హనీమూనా ?"

"నాకు కాదులెండి." సత్యవతికి అంతరంగంలో ఓ దారి స్పష్టంగా కనిపించింది. లోపలికి వెళ్ళింది. బుచ్చమ్మ గోంగూర బాగుచేస్తోంది.

"మీకు యిరవై నాలుగు గంటలూ వంటింట్లోనే సరిపోతుంది." సత్యవతి అంది.

"అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠం. ఏం చెయ్యను చెప్పు తిండికే ఒకరిపై ఆధారపడి వుంటే, యిక ముచ్చట్లు కూడానా?"

"మూడు నెలలపాటు యాత్ర చేసిరండి. రైలు వెళుతూందట."

"మరిది మండిపడతాడు. వద్దులే. అడిగి లేదనిపించుకోవాలి."

"మీ కిష్టమైతే నేను పంపిస్తాను. మీ మరిదికి నచ్చజెప్పే భారం నాది."

బుచ్చమ్మలో సంతోషరేఖలు వెలశాయి. "అంతకంటేనా అమ్మాయీ." అంది.

భానోజీ రాత్రి భోజనమై, బఠానీలు కరకర లాడిస్తున్నప్పుడు, దగ్గరగా కూర్చుని సత్యవతి యాత్రల విషయం చెప్పింది

"మూడువేలు" భానోజీ మూలుక్కున్నాడు. సత్యవతిముందు లెక్కలు చూడటం ఒకవిధంగా చిన్నతనంగానూ వుంది.

"కావల్సినవారికి ఆ మాత్రం చేసుకోపోతే యిక డబ్బు ఎందుకూ? వుంటేనేం? లేకపోతేనేం?" సత్యవతి చిరుకోపంగా అంది.

భానోజీ కాదనలేకపోయాడు. సత్యవతి సమక్షంలో అతడు కొత్త ప్రపంచంలో వున్నట్లు అనుభూతి చెందుతున్నాడు. వ్యక్తిత్వం కూడ మారిపోతున్నది. ఆమె కోసం ఏదయినా చెయ్యాలన్న జిగీష ఏర్పడింది.

బుచ్చమ్మ ఆనందం అపరిమితం. అర్ధ శతాబ్దం వయస్సు వంటింటిలోనే గడిచింది. భర్త, తింగర కూతురు ఆమెకి శాంతిలేకుండా చేశారు. నిన్న ఎలా వెళ్ళిందో నేడూ అలాగే వెళుతోంది. ఏ మార్పూలేనివేళ నాలుగు క్షేత్రాలు తిరిగి రావడం, సత్యవతి దయవల్ల అనుభవంలోకి వచ్చింది. సత్యవతిమీద యింత దాకా లేని ఆత్మీయభావం కల్గింది యిన్నాళ్ళూ మరిదిగారి పెళ్ళాంలాగే ముభావంగా చూసింది. తను చాకిరీకోసం వున్న మనిషి. వరుసలూ, బంధుత్వాలూ తన కెందుకు ? ఏం లాభం కనుక ?

"ఈ తింగరదాన్ని కనిపెట్టుకునుండు తల్లీ" బుచ్చమ్మ వెళ్ళేముందు అన్నది.

"పాపాయి గురించి మీరు బెంగపడకండి."

"నాన్న కాశీలో ఉంటాడే. వెతికి తీసుకురా వచ్చేటప్పుడు ఇలా లేచిపోవడం నా కెంత తలవంపుగా వుంది ?" పాపాయి చెప్పింది.

బుచ్చమ్మ మందలించింది. "సర్లే పిచ్చి వాగుడు. ఏం చిన్న పిల్లాడా కొట్టి తీసుకురాడానికి ? నేను వచ్చేదాకా దొడ్డ చెప్పినట్లు విను. తెల్సిందా ?"

బుచ్చమ్మ మర్నాడే యాత్రకి వెళ్ళిపోయింది

"అక్కా ! కాశీలో చచ్చిపోతే పుణ్యంట కదా !" పాపాయి ఎగురుకుంటూ వచ్చింది సాయంత్రం సత్యవతి టిఫిన్ చూస్తుండగా.

"అంటారు మరి."

"మా అమ్మపోతే బాగుండును. యించక్కా పుణ్యం వస్తుంది."

"ష్...వెర్రివాగుడు"

సప్తగిరి నేరుగా లోపలికి వచ్చేశాడు. "ఏమిటండోయ్ పుణ్యమంటున్నారు ? మీకు కూడా యాత్రలమీద మనసుపోయిందా ?"

"యాత్రలవల్ల పుణ్యం వస్తుందంటారా ?" కలియబెడుతూ అడిగింది.

"అందరికీ అదే భ్రమ కదా. పాపం యదేచ్ఛగా చెయ్యవచ్చు. ఎందుకంటే పుణ్యం సంపాదించి దాన్ని తుడిచివేసుకోవచ్చును. అసలు మన శాస్త్రకారులు పుణ్యమంటే పాపం చెయ్యకపోవడమని అర్థం రాయవల్సింది."

సత్యవతి మైసూర్‌పాక్ కోసి పళ్లెంలోపెట్టి పాపాయి కిచ్చింది "గిరిగారి కియ్యి" నిఅ,

అందుకుంటూ అడిగాడు "ఈవేళ విశేషం ఏమిటి ?"

"పాపాయి పుట్టినరోజు."

"నా పుట్టినరోజు యివాళేంకాదు. ఫిబ్రవరిలో వస్తుందని చెప్పింది మా అమ్మ."

సప్తగిరి "తారీఖు చెపలేదూ ?" అనడిగాడు.

"30 న."

సత్యవతి...సప్తగిరి నవ్వారు. పాపాయికి కోపం వచ్చింది. మైసూర్‌పాకం మరింత వేగంగా నమిలెయ్యసాగింది.

బుచ్చమ్మ వెళ్ళడం సంతోషంగావున్నా యింటిబాధ్యత మీద పడటంతో సత్యవతి వుక్కిరిబిక్కిరయిపోయింది. ఆ పల్లెటూరి పనులు తనకి వంట పడతాయా అని బెంగ పడింది. సాయంత్రం వంటకే నిట్టూర్పులు విడిచింది. పొయ్యి వెలిగించడమే చేతకాలేదు. పుల్లలతో పిడకలతో మండించడం ఆమెకి శేతకాలేదు. పాపాయి యింత కిర్సనాయిలు పోసి వెలిగించింది.

రంగయ్య, ఎల్లమంది యిక్కడే భోంచేస్తారు. బుచ్చమ్మ వాళ్లకి ఆవకాయ వేసి యింత పులుసు పోసేది సత్యవతి తాము తినేదే వేపుడు పచ్చడి, సాంబారు వేసింది వాళ్లకి. వాళ్ళు ఉబ్బితబ్బిబ్బలయ్యారు. పెరుగు కూడా పోసింది. కొంచెం కొంచెం వెయ్యడం మాత్రం వాళ్ళకి నచ్చలేదు. 'ఏపుడు కొంత ఎయ్యండమ్మగారూ" అన్నాడు ఎల్లమంద.

'అరే...లేదే...రేపు చేస్తాలే" అంది నొచ్చుకుంటూ

పాపాయి యింట్లోకి వచ్చి "అక్కా ! వాళ్లకి అన్నీ వెయ్యకూడదు. దయ్యంలా తినేస్తారు. మా అమ్మ పులుసే వేస్తుంది'' ఏం చెయ్యాలో చెప్పింది.

"చాకిరీ చేసేవాళ్లకి పెట్టవద్దూ..."

ఆ పూటకి పనయిందనిపించేసరికి తొమ్మిదయింది. పదిమైళ్ళు పరుగెత్తి నంత అలసట వచ్చింది. సోఫాలో అచేతనంగా కూర్చుంది.

భానోజీ తాంబూలం నములుతూ రేడియో వింటున్నాడు. ఆమెని చూసి "ఒక్క పూటకే తోటకూర కాడవయిపోయావు" అన్నాడు.

"ఫర్వాలేదులెండి అలవాటయితే సరి."

"అంత బాధపడట మెందుకు సత్యా?...వదినని అనవసరంగా పంపించావు.

"అలవాటయితే శ్రమేముంటుంది. మీరు ముందర గ్యాసుపొయ్యి తేవలసిందే. లేకపోతే మధ్యాహ్నం భోజనం మూడుగంటలకే."

భానోజీ నవ్వాడు. "ఇంక రాత్రి తినక్కరలేదు."

మర్నాడు దేవాలయంలో ఏదో ఉత్సవం జరుగుతోందని పాపాయి రమ్మన డంతో మొదటిసారి సత్యవతి ఊర్లోకి బయలుదేరింది ఊరంతా చాలామటుకు మట్టిరోడ్లే. అక్కడక్కడ కంకర రోడ్లు. పెంకుటిళ్ళ మధ్య పూరిగుడిసెల మధ్య మేడలు తొంగిచూస్తున్నాయి. మబ్బు పట్టిన ప్రకృతిలో ఊరు నిద్రపోతున్న ఎలుగుబంటిలా వుంది.

గ్రామస్థులు సత్యవతికేసి ప్రశ్నార్థకంగా చూశారు

"మా పెదనాన్నగారి భార్యండి...నాకు వదినవుతుంది" పాపాయి చెప్పేసింది నలుగురితో. సత్యవతి మందలించింది.

గుడినుంచి తిరిగి వస్తూండగా కాలువగట్టున చాలామంది జనం పోగయి వున్నారు. పాపాయికి ఆ వింతేదో తెలుసుకోవాలనిపించింది.

గత రాత్రి ఆ ఇంట్లో దొంగతనం జరిగింది. విచారణకి పోలీసు వచ్చాడు. "నువ్వు ఇంటికి మట్టిగోడ ఎందుకు పెట్టుకున్నావు...సిమెంటు గోడవుతే దొంగ వచ్చేవాడా ? నా కి శ్రమ వుండేదా దొంగల్ని పట్టుకోవడమే డిపార్టుమెంటు పని అనుకుంటున్నావా ఇంతకీ నీ కెవరిమీద అనుమానముందా? చెప్పు..." అన్నాడు గంతులేస్తూ పోలీసు

"ఎవరని చెప్పని బాబూ...చూడనిదే..." ఇంటి ఆసామీ చెప్పాడు.

"నువ్వు చెప్పకపోయినా పట్టేస్తాను నేను. పోలీసు పుల్లయ్య అంటే దొంగలకు హడల్" గట్టిగా నవ్వుతూ బల్లమీద కూర్చున్నాడు.

"పద !" పాపాయిని లాక్కుపోయింది సత్యవతి.

"మనింట్లో కూడ దొంగలుపడితే బాగుండును పిన్నీ. మనింటికి కూడ పోలీసు వస్తాడు."

సత్యవతి కళ్ళతో గద్దించింది.

# 4

చెరకు ఫ్యాక్టరీ నుంచి డబ్బు తీసుకుని భానోజీ బయటికి వచ్చాడు. చీకటి పడింది. పట్టణంలో దీపాలు వెలుగుతున్నాయి. భానోజీ రిక్షాకోసం చూశాడు. చుట్టుప్రక్కల ఒక్క రిక్షా కూడ లేదు. వేగంగా నడవడం ప్రారంభించాడు. మరో పావుగంటలో వుంది ఆఖరి బస్సు. అది దాటితే ఎక్కడయినా ఆ గాలి. ఇంత డబ్బుతో ఎక్కడో వుండటం భానోజీకి యిష్టంలేదు. సెంటర్లోకి వచ్చేసరికి కిళ్ళీబడ్డీ నుంచి వినాయక చప్పట్లు కొట్టి దగ్గరికి వచ్చాడు "మీ ఊరు వెళ్ళి వచ్చాను నీకోసం. అమ్మాయి కనిపించిందిలే శుభలేఖ ఇచ్చాను. గృహ ప్రవేశానికి తప్పకరావాలి సుమా ! అమ్మాయిని కూడ తీసుకురా.''

భానోజీ తలూపాడు.

ప్రయాణం మాట వినగానే భోజనం వడ్డిస్తున్న సత్యవతి వులిక్కిపడింది. భర్తతో వెళ్ళడం ఆమె కిష్టంలేదు. "మీరు వెళ్ళిరండి" అంది.

"వాడన్నిసార్లు చెప్పినప్పుడు బాగుంటుందీ. ఈ మధ్య నువ్వు ఎక్కడికి కదల్లేదు కదా ! మీ అక్కయ్య దగ్గరికి వెళ్ళమన్నా వద్దన్నావాయె. రాత్రికి వచ్చేద్దాములే."

సత్యవతి కాదనలేకపోయింది, గృహప్రవేశానికి భానోజీతో వెళ్ళింది, అక్కడ 'నా భార్య' అంటూ నలుగురికీ చెప్పుకోవడ సత్యవతికి తలకొట్టేసి నట్లయింది. 'పడుచు పెళ్ళాం-ముసలి మొగుడూ' అని కొంతమంది సాగదీయడం ఆమె విన్నది.

భోంచెయ్యేసరికి పొద్దుపోయింది. వినాయకం ఆ రోజుకి ఉండమని గట్టిగా పట్టుపట్టాడు. భానోజీ కాదనలేకపోయాడు. సత్యవతి ఒప్పుకోలేదు. వెంటనే బయలుదేరినా బస్సు అందలేదు తీరా స్టేషన్‌కి వచ్చేసరికి రైలు దాటిపోయింది. మరో రైలు అర్ధరాత్రి దాటితేగాని లేదు. ఇద్దరు వెయిటింగ్ రూంలో కూర్చున్నారు.

సత్యవతి హిగిన్ బాదమ్స్ కేసి నడిచింది.

"అయ్ సత్యా !"

సత్యవతి వెనక్కి తిరిగింది. ఎర్రపట్టుచీరలో ఊర్మిళ. గుర్తుపట్టడం కొంచెం కష్టమే అయింది సత్యవతికి.

"ఏమిటి ఇక్కడ దొరికావు నాకు ? సత్యవతి నవ్వుతూ అడిగింది.

"ఏమిటా తెలివితక్కువ ప్రశ్న‚ మా వా రిక్కడే పనిచేస్తున్నారు. అవున్లే

నీ కెలా తెలుస్తుంది. చెప్పాపెట్టాకుండ పెళ్ళిచేసుకుని చెక్కేసావు మీ ఇంటికి పిలవడానికి వచ్చాను."

సత్యవతి విషాదంగా నవ్వింది.

"రిజర్వేషన్ గురించి మా డ్రయివర్‌ని పంపిద్దా మనుకున్నాను. బోర్ కొడుతుందని నేనే బయలుదేరాను గుడ్‌లక్. మిత్ర దర్శనముంది... నడు పోదాం."

సత్యవతి రానంది. అర్జంటుగా ఇంటికి వెళ్ళిపోవాలంది. ఏదోలా ఊర్మిళని వదల్చుకుందామనుకుంది. భానోజీని, భర్తగా పరిచయంచేసే ధైర్యం లేదామెకి. ఊర్మిళ వినలేదు. ప్రాణస్నేహితురాలయినా పెద్ద శత్రువులా కనిపించింది సత్యవతికి. అయిష్టంగా భానోజీతో కారు ఎక్కింది ఊర్మిళ ఇంటికి.

వదినిముషాల్లో రోడ్డుకి రెండువైపులా చిన్నా పెద్దా మేడలుగల వీధిలో ఆకుపచ్చని డాబాముందు కారు ఆగింది. కుక్క బొయ్‌మంటూ మీదకి దూకింది. 'సోములూ దీన్ని కట్టెయ్యి' ఊర్మిళ కేకవేసింది. వాడు పరుగెత్తుకువచ్చాడు.

బంగళా విశాలంగా ఆకర్షణీయంగా ఉంది. అంతటా రూపాయలుచేసే నగిషీలు కనిపిస్తున్నాయి భానోజీ డ్రాయింగ్ రూంలో కూర్చున్నాడు. ఊర్మిళ బిస్కట్లు, టీ పట్టుకువచ్చి ఇచ్చింది. స్టేషన్‌లో పడిగాపులు పడకుండా ఇలా రావడం అతడికి చాలా బాగుంది.

సత్యవతి టీ సాసర్లో పోసుకుని త్రాగుతోంది. "మీ శ్రీవారు కనిపించరేం?"

"క్లబ్‌కి వెళ్ళారు. వచ్చేస్తారు. నేను వంట ప్రారంభిస్తాను. ఆయన వచ్చారంటే ఒక్క నిముషం ఆగరు ఆకలో అంటూ గోల పెట్టేస్తారు."

తన భర్త గురించి నిండుగా చెప్పుకోవడం సత్యవతికి అదోలా అనిపించింది. సుదర్శనంని చూడగానే 'అందమైన జంట' అనుకుంది. మనసు ఈర్ష్యకి లోనయింది. ఊర్మిళది వడ్డించిన విస్తరి. లక్షరూపాయలు కట్నమిచ్చి ఆమె అన్నగారు టి.ఏ.ఎస్ మొగుడ్ని తెచ్చాడు. తన బాధ ఆమెకేం తెలుస్తుంది?

సుదర్శనం సరదా మనిషి. భోజనాల దగ్గర ఎన్నోసార్లు నవ్వించాడు. "ఇది ఎక్సర్‌సైజన్న మాట...మా ఆవిడ వంట అజీర్ణం చెయ్యకుండా!"

"అందుకేనేమో గుత్తివంకాయకూర అరకిలో తిన్నారు" ఊర్మిళ ఓరగా చూసి నవ్వింది.

భోజనా లవగానే భానోజీ సుదర్శనం లాన్‌లో కూర్చున్నారు. సత్యవతి ఊర్మిళ లోపల కూర్చున్నారు. రాత్రి వెళ్ళిపోతామన్నా ఊర్మిళ ఒప్పుకోలేదు.

"ఏమే ముసలి మొగుణ్ని కట్టుకున్నావు...ఏమిటి కథ ? డిక్టేటర్ అయిపోదామనా ?"

సత్యవతి ఏదో నసిగింది. కాస్సేపు ఏదో మాట్లాడి "నాకు నిద్ర వస్తోంది ...రాత్రి కూడ నిద్రలేదు" అన్నది లేస్తూ.

"గుడ్‌నైట్..."

ఆ గదిలో ఒకటే మంచం ఉంది. అప్పటిదాకా కలుగని వింతభయం రేగింది సత్యవతిలో - ఖానోజీ కూడ అందులోనే పడుకుంటాడని. ఇంటి దగ్గరయితే పాపాయి రక్షణగా ఉండేది శూన్యమాసం తనకి బాగా కలిసి వచ్చింది. సత్యవతి కేం చెయ్యాలో తోచలేదు. మరో మంచం యిమ్మంటే... ఊర్మిళ వేళాకోళం చేస్తుందేమో. కాగా ఖానోజీ వచ్చేసరికి తను నిద్ర నటించినా ఉపయోగముండదు.

ఊర్మిళ కనిపించడం గురించి పళ్లు పీక్కుంది. 'డర్టీ హెల్' బయటకి వచ్చి పిట్టగోడమీదనుంచి చూసింది. లాన్‌లో నలుగురైదుగురు మనుష్యులున్నారు. నవ్వుకుంటున్నారు నిలబడి...తన భర్త వచ్చేయవచ్చు.

ఊర్మిళ గదిలోకి వెళ్ళింది. ఊర్మిళ అద్దంముందు కూర్చుని పూలు సరిచేసుకుంటోంది. స్టాండులో ఆగరువత్తులు వెలుగుతున్నాయి.

"సిక్వెల్ కాని కాంపోజ్ కాని ఉందా ?"

ఊర్మిళ వెనక్కి తిరిగింది. "ఇందాకనే నిద్రవచ్చేస్తుందన్నావు మరి."

"ఆయనకోసం"

ఊర్మిళ నవ్వుతూ అల్మారా దగ్గర కెళ్ళింది. ఆ నవ్వులో అనేక అర్థాలు కనిపించాయి సత్యవతికి 'ఛీ తను రావడం ఎంత పొరపాటయిపోయింది "

"సిక్వెల్ వుంది."

సత్యవతి ఏం మాట్లాడకుండా పుచ్చుకుని పైకి వచ్చింది. ఖానోజీ బాత్ రూంలోకి వెళ్ళాడు. సత్యవతి పొడుంచేసి నీళ్లలో కలిపింది.

సత్యవతి పేపరు చూస్తున్నట్లు నటిస్తోంది. ఖానోజీ వచ్చి మంచంమీద పడుకున్నాడు. "సుదర్శనంగారు మంచి మనిషి సత్యా. అసలు గర్వంలేదు."

"మరే..."

"ఇలారా...నన్ను చూసి అంత దూరానికి పోతావేం ? నువ్వు దగ్గర్లోనే వుండి అందడంలేదు." అసంతృప్తిగా నిట్టూర్పు విడిచాడు

"మంచినీళ్ళు యివ్వనా ?"



"నా మీద యింత దయ కలిగిందేమిటి?...ఇయ్యి" అన్నాడు లేచి. సత్యవతి గాజు గ్లాసు యిచ్చింది. బాత్‌రూంకి వెళ్ళాలని బయటికి వచ్చి, పది నిముషాలు పోయాక వెళ్ళింది.

భానోజీ గుర్రుపట్టి నిద్రపోతున్నాడు. సత్యవతికి గండం గడిచినట్లయింది. దిండు తీసుకుని సోఫాలో పడుకుంది. వెంటనే నిద్ర పట్టేసింది.

భానోజీకి అలవాటుగానే నాల్గు గంటలకి మెలకువ వచ్చింది. లైటు వేశాడు. సత్యవతి సోఫాలో వరిగి పడుకుంది. ఫ్యాన్‌కి పమిట క్రింద పడింది. భానోజీ తడబడుతూ దగ్గరకి వచ్చాడు. సోఫా క్రింద కూర్చున్నాడు. సత్యవతి అందం సవాల్ చేస్తోంది. బ్లవుజ్‌కి చీరకి మధ్య ప్రదేశం ఉదయపు ఎండలోని లేత అరిటాకులా దీపం కాంతిలో మెరిసిపోతోంది. భానోజీ కాంక్షగా మీదకి వంగాడు. సత్యవతి వులిక్కిపడి లేచింది.

ఇద్దరూ అలజడిగానే వున్నారు. ఒకర్ని ఒకరు బెదురుగా చూసుకున్నారు.

"రైలు టైం అవుతోంది...నడు..." భానోజీ చొక్కా వేసుకుంటూ అన్నాడు.

ఊర్మిళ కారులో స్టేషన్‌కి తీసుకువచ్చింది. రైలు సమయానికే వచ్చింది. "మా వూరు రండోసారి." భానోజీ ఆహ్వానించాడు ఊర్మిళని.

సత్యవతి ముభావంగా నవ్వింది.

రైలు కూతవేసి బయలుదేరింది.

భానోజీకి ఆశ్చర్యంగా వుంది. సత్యవతిని రాత్రి పొందాలనుకుని గదిలోకి వచ్చాడు. అంతలోనే నిద్ర ముంచుకువచ్చిందేమిటి ?"

ఊర్లోకి రాగానే ఇంటి పురోహితుడి దగ్గరకి వెళ్ళాడు. అతడు ఈ రాత్రికే ముహూర్తం పెట్టాడు. భానోజీకి కొండంత బరువు దిగినట్లయింది.

మధ్యాహ్నం భోజనమయ్యాక తాంబూలం తెచ్చిన సత్యవతిని చెయ్యి పుచ్చుకొని లాగాడు. సత్యవతి విడిపించుకుంటూ "బాగుంది...అవతల నాకు చాలా పనుంది" అంది.

"ఇప్పుడు తప్పించుకున్నా రాత్రికి తప్పదు సత్యా..."

సత్యవతి కంపించింది.

*　　　*　　　*

జీవితమంటే వసంతానికీ, శిశిరానికీ మధ్యగల నిష్పత్తి. సామాన్యులు జీవితం అంచున పడిపోతారు. సాహసవంతులు జీవితాన్ని తమకేసి తిప్పుకుంటారు. సాహసవంతుల ప్రయాణం నల్లేరుమీద బండి నడకలా వుండదు. ఎదురుగాలిలో పడవ ప్రయాణంలా వుంటుంది. వారి జీవితం రెడీమేడ్ సరుకుకాదు. దాని తయారీకి వ్యవధి పడుతుంది. దానివల్ల వారికి ప్రారంభంలో అమృత ధారల కంటే అపశృతులే వినిపిస్తాయి.

సత్యవతి శూన్యంలోకి చూస్తూ కూర్చుంది కిటికీ దగ్గర. దీపాలవేళ కొబ్బరి తోట చీకటిలో దాగుడుమూతలాడుతోంది. ఆమె వంటకి లేవకపోవడంతో పాపాయి వచ్చి చెప్పింది. సత్యవతి విసుగ్గా మూల్గింది. చీకటి పడేకొద్దీ ఆమెలో భయం విజృంభించింది.

"నేను చేసెయ్యనా వదినా?"

సత్యవతి తలూపింది. పాపాయి దబదబా అడుగులేస్తూ వంటింటిలోకి వెళ్ళిపోయింది. తను చెయ్యబోయే వంటగురించి పాలు తెచ్చిన ఎల్లమందతో చెప్పింది.

"అగ్గి ఎలిగించండి మరి. నా కిపాటికే నీరసం వత్తున్నాది." ఎల్లమంద బుర్ర గోక్కున్నాడు.

భానోజీ పనివాడిచేత బుట్ట లోపలికి తెప్పించాడు. 'సత్యా' అంటూ కేక పెట్టాడు సత్యవతి పలకలేదు. లోపలి గదిలోకి వస్తూ "అలా వున్నావేం... వంట్లో బాగాలేదా ?" ఆదుర్దాగా అడిగాడు.

సత్యవతి సమాధానం చెప్పేలోపుగా బుట్ట తానే లోపలికి తెచ్చాడు. అందులో నుంచి చిన్న అట్టపెట్టె తీసి తెల్లటి జరీచీర తీశాడు. 'బాగుందా' అనడిగాడు. సత్యవతి తలూపింది. 'దానికోసం నాలుగు కొట్లు తిరిగాను' అంటూ పువ్వులూ, స్వీట్లూ బయటికి తీశాడు.

పాపాయి 'వంట సిద్ధం' అంటూ వచ్చింది. 'అబ్బో ... చాలా తెచ్చావే. ఇవన్నీ ఎందుకు నాన్నా? మా ఆయన వస్తున్నాడా?'

భానోజీ కసురుకున్నాడు. "అవతలికి ఫో... వెధవర్థంలేని సొద నిన్నుకూడా మీ అమ్మ లాక్కుపోతే పీడ వదిలేది "

పాపాయి బావురుమంది. సత్యవతి ఓదార్చింది.

"సత్యా... తయారవు... శాస్త్రులు వచ్చేస్తాడు మళ్ళా. భానోజీ స్నానానికి వెళ్ళిపోయాడు.

సత్యవతి దిష్టిబొమ్మలా నిలబడిపోయింది. భానోజీ పక్కా వ్యాపారిలా కనిపించాడు. తను అతడి ఆస్థి అనుభవించడానికి, అందుకోడానికి, అధిగమించ డానికి తహ తహ ! అందుకే ఎరవేసినట్లు తనకోసం రూపాయలు వెదజల్లాడు. తోబుట్టువు ద్రోహం చెయ్యడంతో తను ఎదురీత ప్రారంభించింది. ఇప్పుడు తనేం చెయ్యాలి ? లొంగిపోతే ఓటమే.

"అయ్యో...!" పెరట్లోంచి కేక.

పాపాయి, సత్యవతి పరుగెత్తారు. వంటింటి గుమ్మం క్రింద భానోజీ పడి వున్నాడు. "ఏమైంది?" సత్యవతి ఆదుర్దాగా తొంగిచూసింది.

మూల్గుతూనే చెప్పాడు. "జారి పడ్డాను."

క్రింద నాపరాళ్ళేమో నుదుటికి గాయమైంది. సత్యవతి, పాపాయి లేవదీసినా భానోజీ లేవలేకపోయాడు. నడుము పట్టేసింది. సత్యవతి పాలేళ్లని పిలిచింది. వాళ్ళు మంచంమీద పడేశారు. ఎల్లమంద పోయి పెరుమాళ్ళ అనే నాటు వైద్యుడ్ని తీసుకువచ్చాడు. అతడు కట్టుకట్టి వెళ్ళిపోయాడు. భానోజీ లేచి పాలు కూడా త్రాగలేకపోయాడు. సత్యవతే చెంచాతో పోసింది.

"నువ్వెళ్ళి భోంచెయ్యి సత్యా... పదవుతోంది." భానోజీ నెమ్మదిగా గొణిగాడు.

"తింటాలెండి... మీ రిలా వుండగా..."

"మీరు అన్నం మానేస్తే తగ్గిపోతుందా? వెళ్ళండి. మీరు వచ్చేదాకా ఎల్లమంద వుంటాడు." తను ఎంతో ఆశపడిన ఈ రోజున యిలా అభావం జరగడం అతడికేదోలా వుంది.

సత్యవతిలో అలజడి తగ్గింది. ఎవరు కాపాడారు తనని? దేముడా? ఎప్పటి కప్పుడు తను యిలా అవస్థపడవల్సిందేనా? ఏమిటి తన లక్ష్యం? ఈ క్షణ మయినా నిష్క్రమిస్తే బాగుండును. కాని అది తన పరాజయం. రాజీవ్ చదువు ఎలా సాగుతుంది. ఇప్పుడు తను బయటికిపోతే భానోజీ భార్య అంటారు. సంఘం వేటాడుతుంది. నీడలేనిదవుతుంది. మొదట స్థానం వుండాలి. ఆధారం వుండాలి అప్పుడు తక్కినవన్నీ.

తెల్లవారింది. సత్యవతి టీ కలుపుకు వచ్చింది. భానోజీ మూల్గుతూ పడు కున్నాడు. "ఎలా వుంది....తగ్గిందా?" మంచం దగ్గరకుపోయి అడిగింది.

భానోజీ కళ్ళుతెరిచి కొనస్వరంతో ''అలాగే వుంది'' అన్నాడు.

"బోన్స్ స్పెషలిస్టుని రప్పిద్దాం. ఈ నాటువైద్యానికి తగ్గుతుందా?"

భానోజీ ఒప్పుకోలేదు. "పెరుమాళ్ళు తక్కువవాడు కాదు సత్యా. ఓసారి మా నాన్న కొబ్బరిచెట్టు మీదనుంచి తలక్రిందులుగా పడ్డాడు. మేం ఆశవదులు కున్నాం. పెరుమాళ్ళే బ్రతికించాడు."

పల్లె మనస్తత్వాలు నమ్మకాలమీద ఆధారపడి వుంటాయి. సత్యవతి యిక బలవంతం చెయ్యలేదు. పెరుమాళ్ళు పదిగంటలకి వచ్చి కట్టు కట్టి వెళ్ళాడు. తగ్గిపోతుందని హామీ యిచ్చాడు.

భానోజీ మంచం ఎక్కడంతో యింటిపనులతో బాటు భానోజీ పనులు కూడా సత్యవతి మీద పడ్డాయి. భానోజీ మంచం ఎక్కినా తన తాకట్టు వ్యాపారం మానలేదు. శాల్తీ చూసి ఎంతివ్వాలో చెప్పి, తాళాలు సత్యవతికిచ్చాడు. అతడి జీవితకాలంలో తాళాలు ఒకరికివ్వటం యిదే ప్రథమం. ఇంతకాలం మనుషులను నమ్మకుండానే కాలక్షేపం చేశాడు. ఈనాడు మనుషులను విశ్వసించవల్సి వస్తోంది.

"నా కెందుకండీ...మీకు తగ్గాక రమ్మనండి." సత్యవతి అతడి పద్ధతి తెల్సి అన్నది.

"ఇదంతా నీదేనే పిచ్చిదానా? నీ ఆస్తిని యిక నువ్వే నిర్వహించుకోవాలి. తీసుకో తాళాలు. ఇక అవి నీ దగ్గరే వుంటాయి."

సత్యవతి ఆ యింటికి అధికారిణి అయింది.

మధ్యాహ్నం సప్తగిరిని పిలిపించింది. "టౌన్‌కి వెళతారా?"

"మీ కేదయినా పనివుంటే వెళతాను."

"డి. డి. కట్టి రికార్డు డెలివరీలో పంపించండి." మూడువేల రూపాయలు రాజీవ్ కోసం యిచ్చింది. ఖర్చులకి మరో పాతిక రూపాయలు యిచ్చింది.

సప్తగిరి ఎవరికని అడుగుతాడనుకుంది. అతడేం అడగలేదు. డబ్బు తీసుకుని మౌనంగా వెళ్ళిపోవడంతో సత్యవతి సంతోషించింది. 'గిరిలో సంస్కారముంది.'

రాజీవ్ కోసం తను ఏదో చెయ్యటం సత్యవతికి తృప్తిగావుంది. ఇప్పటిదాకా తను డబ్బుపంపే వీలులేకపోయింది. రాజీవ్ ఏం అవస్థపడుతున్నాడో! ఈ డబ్బు అందగానే అతడి భావాలు ఎలావుంటాయ్? తనని గురించి ఏమను కుంటాడు? సత్య అన్నమాట నిలబెట్టుకుందనుకుంటాడు. సత్యవతికి ఈ క్షణంలో అమిత ధైర్యం వచ్చింది. తనమీద తనకి విశ్వాసం ఏర్పడింది. ఇక తను ఓడిపోదు.

పాపాయి కేకలకి మెలకువ వచ్చింది. పాపాయి పరుగుమీద వచ్చి తన మంచం మీద కూర్చుంది. "ఏమైంది?" సత్యవతి అడిగింది.

"నా మొగుడుగాడు వచ్చేశాడు అత్తయ్యా!"

"ఇదిగో పాపాయ్! నువ్వు వరుసలు పెట్టి పిలవకు. పేరుపెట్టి పిలు. మన యిద్దరం ఒక వయస్సు వాళ్ళమే తెల్సిందా?"

పాపాయిలో భయంపోలేదు. "నా మొగుడు..."

"నువ్వు ముందర మాట్లాడ్డం నేర్చుకో. మా వారనాలి గౌరవంగా. వస్తే మాత్రం భయమెందుకు? నిన్ను వదిలి వుండలేక పరుగెత్తుకుని వచ్చేశాడు." గడ్డం పుణికి లేపి హాల్లోకి వెళ్ళింది.

సంబంధం భానోజీ మంచం దగ్గర కూర్చొని మాట్లాడుతున్నాడు. సత్యవతిని చూసి వినయంగా 'నమస్కారం అత్తయ్యగారూ!' అని పలకరించాడు.

"ఏవయ్యా...ఇన్నాళ్ళు మా పాపాయి గుర్తురాలేదా!" సత్యవతి నవ్వుతూ అడిగింది.

"మీ రేమనుకుంటారోనని రాలేదండి."

"నీ భార్యను తీసుకువెళ్ళడానికి మే మేమంటాం?"

సంబంధం ముసిముసిగా నవ్వాడు. తన అత్తగారు లేకపోవడం, భానోజీ మంచం ఎక్కడం శుభశకునాలుగానే కనిపించాయి.

మర్యాదకి కాఫీ త్రాగగానే "ఇక మేం వెళ్ళిపోతాం" అన్నాడు.

"సాయంత్రం పడి ఎందుకు? రేపు వెళుదువుగానిలెండి" అన్నది సత్యవతి.
ఆ రాత్రి సత్యవతి పాపాయిని ప్రత్యేకంగా అలంకరించింది. పాపాయికి చీర కట్టుకోవడం రాదు ఎగుడు దిగుడుగా కట్టుకుంది. సత్యవతి దగ్గరుండి ముస్తాబు చేసింది.
పాపాయి తింగరగా నవ్వింది. "నా శోభనం ఏమిటి పిన్నీ?"
"అలా నవ్వకూడదు అస్తమానూ. నువ్వు మాట్లాడటం తగ్గిస్తే చాలా మంచిది."
పాపాయి లక్కి తీసి "మీగడలా వుంది అత్తయ్యా" అన్నది తినబోతూ.
గంటనుంచి పైగా శ్రమపడుతున్న సత్యవతికి ఓర్పు నశించిపోతోంది. "నీలాగే అవలక్షణాల వాడికి అక్షింతలు యిస్తే అవతలికిపోయి నోట్లో వేసుకున్నాడట. నువ్వు బుద్ధిగా కూర్చుంటేనే జడవేస్తాను. లేకపోతే- యిలాగే పంపేస్తాను."
"అమ్మ పెట్టేవి నాలుగూ పెడితే ఎందుకు విననూ?"
"ఏం పెట్టేది మీ అమ్మ?"
"ముందర మొట్టికాయ, తర్వాత జెల్లకాయ, తర్వాత టెంకి జెల్ల. ఆఖర్ని బెత్తం."
సత్యవతి నవ్వింది.
సంబంధం భార్య అలంకరణ చూసి రిచ్చబడ్డాడు. 'పాపాయి అందమైనదే' అనుకున్నాడు. దగ్గరగా తీసుకుని "మీ పిన్ని ఎలాంటిది?" అనడిగాడు.
"చాలా మంచిది."
సంబంధానికి ధైర్యమొచ్చింది. అతడు పెళ్ళాంమీద ప్రేమతో ఏం రాలేదు. పాపాయిని పంపకపోవడంతో తనే వచ్చాడు, ఏమైనా కానుకలు అందక పోతాయా అని.
తెల్లవారగానే ప్రయాణమయ్యాడు. పాపాయి వెళ్ళనని కూర్చుంది. సత్యవతి నచ్చజెప్పి పంపించింది.
ఎల్లమందని బండి కట్టమంది.
"వెళ్ళిరామా అత్తయ్యగారూ?"
సత్యవతి తలూపింది. ఎల్లమంద బండి గుమ్మంలోకి తీసుకొచ్చాడు
"మీ అమ్మాయికి సారె వగైరా ఏమీ పెట్టరా?" వుత్తగా వస్తున్న పాపాయిని చూసి నిరాశగా అడిగాడు.




"అవి పెట్టడానికి ప్రత్యేకమైన సందర్భం ఏం లేదు."

"మరి నా బహుమతి అయినా..." సంబంధం సిగ్గు విడిచి అడిగేశాడు.

సత్యవతికి అతడి ఉద్దేశ్యం తెల్సింది. ఏదైనా యిస్తే పెళ్లాన్ని తీసుకెళ్ళి నాలుగురోజులు వుంచుకుంటాడు. మళ్ళీ తన్ని పంపిస్తాడు తర్వాత. "బహుమతి అడిగితే వచ్చేదికాదు...అది లంచం."

సంబంధం బండిలోనుంచి తన సంచి తీసుకుని ఈ ముష్టిముండని "తీసుకెళ్ల డానికి వచ్చానా ?" విసురుగా నడిచి వెళ్ళిపోయాడు.

"పోవుచున్నావా ?" పాపాయి పాటపాడింది.

## 5

"అందరికీ శకునం చెప్పే బల్లి కుడితి తొట్లో పడ్డట్టు నువ్వు మంచం ఎక్కడ మేమిటయ్యా, నాకు చాలా విచిత్రంగా వుంది సుమా ?" అంటూ వచ్చాడు కులపతి లోపలికి.

"కూర్చో కర్మ తప్పుతుందా మరి ?"

"ఎలావుంది ? ఏమన్నా నయమా ?"

"కొద్దిగా ప్రయత్నంమీద లేచి కూర్చోగలుగుతున్నాను."

కులపతి చుట్ట వెలిగించి కుర్చీ మంచం దగ్గరిదాకా జరుపుకున్నాడు. అతడి రాకపోకలు ఈ మధ్య ఎక్కువయ్యాయి. పూర్వం ఖానోజీని వాకిటిలోనో, పొలం దగ్గరో ఏదయినా పని వచ్చేటప్పుడు కల్సుకునేవాడు. ఖానోజీ మంచం ఎక్కాక తరచుగా వస్తున్నాడు. దానికి కారణం సత్యవతి. ఆమెని చూశాక

మనసు రొదపెట్టసాగింది. పరిస్థితులు అనుకూలంగా వచ్చేసరికి అతడి కోరిక మరింత ఎక్కువయింది. భానోజీవల్ల భయంలేదు. సత్యవతి ఒంటరిది. ఇక తనకి అడ్డేమిటి ?

కులపతి ఎండిన బూరుగు చెట్టులా వుంటాడు. రంగు నలుపు. బుద్ధులు నలుపు. తెలుపు తల మాత్రమే. వయస్సు మీదపడుతున్నా సరదాలు చావలేదు. మొన్నటిదాకా ముతక ఖద్దరు కట్టేవాడు. కాంగ్రేసు ... బాపూ ... స్వరాజ్యం అంటూ కలవరించేవాడు. యదాలాపంగా స్వరాజ్యం సమయంలో జైలుకెళ్ళి అయిదెకరాలు సంపాదించాడు. అవి యిద్దరాడపిల్లల పెళ్ళికి ఖర్చయిపోయాయి.

సప్తగిరికి రెట్టింపు కట్నం పుచ్చుకోవాలని వచ్చిన సంబంధమల్లా తిరగ గొట్టేస్తున్నాడు.

"సత్యా! కాస్త మజ్జిగ యిస్తావూ ?" లోపలికి తొంగి చూస్తూ కేకపెట్టాడు.

తొమ్మిదిగంటల ఎండ తొలివలపులా కాల్చేస్తుంది.

"కులపతీ! మా పొలాలు ఎలా వున్నాయి ?" భానోజీ అడిగాడు.

"వాటికేమిటయ్యా బంగారం."

పాపాయి మజ్జిగ తీసుకురావడంతో కరణం నిరాశపడ్డాడు. "నువ్వు తెచ్చా వేమిటి పిల్లా?"

"మా పిన్ని వంట చేస్తోంది. ఎవరు తెస్తేయేం తాగడానికి."

కులపతి నవ్వాడు. "నిన్ను వంచడానికి నీ మొగుడే వుండాలి పిల్లా."

పాపాయి వెనకవైపునుంచివచ్చి కులపతి మెడ పట్టుకుని "నువ్వే నా మొగుడివి. వంచు చూద్దాం." కసిగా అంది. ఎగతాళి చేస్తే ఆమెకి శివం ఎక్కుతుంది.

కులపతి ఏమరుపాటుగా వుండడంతో కుర్చీలోనుంచి క్రిందపడ్డాడు భానోజీ కేకలువేసినా పాపాయి ఆగలేదు. కులపతి గుండెలపై కాలుపెట్టింది. కులపతి లబో దిబో మన్నాడు. సత్యవతి వచ్చి పాపాయిని లాగింది.

"దీనికి పిచ్చివుంది సత్యా...విశాఖ పంపించెయ్యండి." ఒళ్ళు దులుపుకుంటూ ఆక్రోశించాడు.

తనని పేరుపెట్టి చనువుగా పిలవడం సత్యవతికి యిష్టంలేదు. "దాన్ని రెచ్చ గొట్టడ మెందుకు? ఎవరి స్థానంలో వారుంటే తిప్పలెందుకు వస్తాయి ?"

పాపాయి కొట్టినా బాధగాలేదు. సత్యవతి ఈసడింపుతో కులపతికి చివుక్కు మంది. సత్యవతి పాపాయిని లోపలికి తీసుకువెళ్ళిపోయింది.

"పాపాయి మరీ మూర్ఖంగా తయారవుతోంది." భానోజీ కులపతిని ఓదారుస్తూ అన్నాడు, ఏదైనా అనుకుంటాడని.

"తెలియనితనం...ఆ పిల్లతో ఏమిటి ?" కులపతి కుర్చీలో ఆసీనుడయ్యాడు. సత్యవతిమీద క్రోధం విజృంభించింది.

కాసేపు మౌనంగా కూర్చున్నాడు చేతులు విరుచుకుంటూ.

"నా యింటికి నేనే పెద్దను పిల్లికి పెట్టరా పంగనామాలు అన్నాడు వెనక్కి ఒకడు. ఆడదాని పెత్తనం ఎలావుంటుందయ్యా."

భానోజీకి అర్థంకాలేదు. ''సరిగ్గా చెప్పు...నీ వాక్యం నాకు అర్థంకాదు.''

"మా వాడు మొన్న బ్యాంకులో కనిపించాడు. మీ ఆవిడ మూడువేలు పంపమన్నదట ఎవరికో. వాడో సన్యాసి ఎవరికో చెప్పమంటే చెప్పలేదు." భానోజీకి గాయం కంటే బాధ ఎక్కువయింది. మూడువేలు...ఎవరికి పంపింది? ఇన్నాళ్ళు తను గుణించాడు, ఇప్పుడు భాగహారం జరుగుతోంది.

భానోజీకి కోపం చప్పన కరిగిపోయింది. ఇన్నాళ్ళూ సంపాదనకోసంమనుషుల్ని దూరం చేసుకున్నాడు. సంపాదించాడు. అంతస్థు పెరిగింది. ఆస్థి పెరిగింది. కాని అది పరిపూర్ణమైన తృప్తి నివ్వడంలేదు. మనిషి ఏకాకిగా బ్రతకలేడు. తన విజయాలు చెప్పుకుని గర్వించడానికి, తన బాధని చెప్పి ఓదార్పు పొందడానికి మరో మనిషి కావాలి స్నేహితుడో, భార్యో ఈ స్థానం పొందుతారు.

సత్యవతి తన భార్య. తనకి వారసురాలు. ఆమెను తనదిగా చేసుకోవాలి. ఎందుకో ఆమె తనని బాగా ఆకర్షించింది. ఆమెకోసం ఏదయినా చేస్తాడు. ఎంత ఖర్చయినా ఫర్వాలేదు. డబ్బుతోనైనా ఆమె తనవైపుకి వస్తే చాలు. ఇదంతా ఆమెకోసమే కదా! ఖర్చుపెట్టడానికి ఆమెకి స్వతంత్రం వుంది.

"నాతో చెప్పే పంపిందిలే."

కురుక్షేత్రం చూద్దామనుకున్న కరణం డీలాపడిపోయాడు. "ముగ్గురు భార్యలూ నువ్వు చెప్పినట్లే విన్నారు. నాలుగో భార్య నిన్ను డ్రయివ్ చేస్తోంది ... సరే వస్తా మరి...పొద్దుపోయింది "

"శకుని" బానోజీ కిటికీనుంచి—పోతున్న కరణాన్ని చూసి గొణిగాడు.

వంట చేస్తున్న సత్యవతి ఈ సంభాషణం వింటోంది. ఆమెకి అదురుగానే వుంది బానోజీ తనకు తెల్సుననడంతో ఆశ్చర్యం పొందింది. భానోజీని చూడ టానికి ముఖం చెల్లలేదు. జావ పాపాయిచేత పంపుదామనుకుంది. పాపాయి మామిడికొమ్మకి ఉయ్యాలవేసి వూగుతోంది. పిలిచినా రాదనుకుని తనే తడబడుతూ పట్టుకెళ్ళింది.

"మీతో చెబుదామనుకున్నాను." సంజాయిషీ యిస్తూ జావ గ్లాసులో పోసింది.

"నాతో చెప్పక్కర్లే సత్యా! నీకు తోచినది నువ్వుచేసుకో. నువ్వు ఎవరికీ భయపడక్కర్లేదు. ఆ కరణం తంతులమారి. ఎలా అంటిద్దామా అని చూస్తాడు. వాడ్ని నమ్మితే గొంతుక కోసేస్తాడు."

సత్యవతితో మనసువిప్పి మాట్లాడుకోవడం అతడికి తృప్తిగా వుంది. భార్య స్నేహంలోని మధురిమ తొలిసారి అనుభవమయింది.

ఖానోజీ జావత్రాగడం పూర్తయింది. సత్యవతి స్టూలుమీద కూర్చుని బత్తాయికాయ వలవసాగింది.

"నువ్వు అన్నం తినిరా...పొద్దుపోతోంది. ఇప్పుడేగా జావ త్రాగుత."

"ఫర్వాలేదు. పన్నెండు దాటితేగాని సయించదు నాకు."

ఖానోజీ తదేకంగా ఆమెకేసి చూడసాగాడు. చిక్కినట్లు కనిపించింది. ఎండ వేళ మందారంలా కాంతి తగ్గినట్లు వుంది.

"చూశావా! నీకు పని ఎక్కువై పోయింది అన్నివిధాల. వదినకూడా లేకుండా పోయింది." తొనలు చప్పరిస్తూ నొచ్చుకున్నాడు.

"మనిషికి విపరీతమైన పనివుండాలి. అప్పుడే ఆరోగ్యంగా వుంటుంది."

"ఇవాళ కొబ్బరితోట దింపుకురమ్మన్నాను. గిరిని పంపిస్తావా ?"

"దగ్గరేనా ?"

"చెరువుకి అవతల."

"పాపాయిని తీసుకుని నేను వెళతాను."

"నువ్వా!" రిచ్చపడి అడిగాడు.

"నాకు ప్రత్యేకంగా పనిఏముంది ? ఎల్లమంద వుంటాడు. అజమాయిషీయేగా. మనపని మనం చేసుకోడానికి నామోషీ ఎందుకు ?"

చొరవగా ఆమె ముందుకు రావడం ఖానోజీకి వుత్సాహమొచ్చింది. ఇల్లు దాటలేని ఆడవాళ్ళని గురించే యిప్పటిదాకా తెల్సు అతడికి. బయట పనులకు కూడా సత్యవతి నాయకత్వం వహించగలదని తెలియగానే తను మంచం ఎక్కిన దిగులుపోయింది.

"అయితే తొందరగా భోంచేసి వెళ్ళుమరి. వచ్చేసరికి సాయంత్రం అవుతుంది."

సత్యవతి, పాపాయి తొందరగా భోజనం చేశారు. ముందుగా కూర్చున్నా ఎల్లమంద యింకా లేవలేదు. 'కూంత పులుసు వేయండి' అంటున్నాడు. పాపాయి మజ్జిగ పులుసు తెచ్చిపోస్తూ! 'త్వరగాలే...దింపుకి వెళ్ళాలి,' కసురుకుంది.

"మెతుకులు దిగాలా? ఏంటాకంగారు ... దింపోళ్లు ఏడకిపోతారు. మనం ఎళ్లేదాకా ఆడ పడివుంటారు." ఎల్లమంద ఈ మధ్య భోజనం సుష్టుగా చేస్తున్నాడు. సత్యవతి నాలుగు రకాలు వెయ్యడంతో తిండియావ పెరిగింది. రంగయ్య జబ్బుపడటంవల్ల పని మానేశాడు. అన్ని పనులు యింటిదగ్గర ఎల్లమందమీదే పడ్డాయి. ఖానోజీ కాలు విరగడంతో అన్ని పనులకి వాడే దిక్కు అయ్యాడు.

ఎల్లమంద వెనుక సత్యవతి, పాపాయి తోటలోకి నడిచారు. కాలు దగ్గర "మీరు యిక్కడ కూర్చోండమ్మా ... దింపోళ్లని పిలుచుకువస్తాను" అని ఎల్లమంద ముందుకు వెళ్ళాడు.

మామిడితోపులో తోటకాపలాకాసే అమావాస్య దిబ్బమీద కూర్చుని వున్నాడు.

"ఏం తాతా...వీళ్ళు రాలేదా?"

"వన్నాలు భోంచేసి బేగి వచ్చియ్యమని సెప్పా. తత్తుకొడుకులు యింకా అయిపులేరు. కామందుగోరు వచ్చినారా?"

"ఆయనెలా వస్తాడెహె! ఆయన పెళ్ళాం వచ్చినాది." ఎల్లమంద కూడా దిబ్బఎక్కి కూర్చున్నాడు. జేబులోనుంచి డక్కన్ సిగరెట్ పెట్టితీసి సుతారంగా వెలిగించి పొగవదిలాడు. అమావాస్య ఆశగా చూస్తూండటంవల్ల ఓ సిగరెట్ విసిరేసాడు.

"బీడీలు కాల్చినవాడవు గదరా కుర్రాడా?"

ఎల్లమంద గర్వంగా నవ్వినాడు. తన హోదా పెరిగిందని చెప్పలేదు. చిట్టు, తవుడు, ఉలవలు వగైరాలు యిప్పుడు ఎల్లమందే కొనుక్కువస్తున్నాడు. బుచ్చమ్మ, ఖానోజీ వెయ్యి కళ్ళతో చూసేవారుగనుక కక్కుర్తి పడడానికి అవకాశం లేకుండాపోయింది. ఇపుడు సత్యవతి పెత్తనం...యిక్కడ పద్ధతులేం ఆమెకి తెలియవు. ఎల్లమందకి మేతకి అవకాశం దొరికింది.

ఆరుగురు దింపులవాళ్ళు నిచ్చెనలతో వచ్చారు.

అమావాస్యతో రహస్యంగా చెప్పాడు ఎల్లమంద లేస్తూ. అమావాస్య భయపడ్డాడు. "కామందుగారికి తెలిస్తే..."

"ఓరి ముసిలాడా ... బయపడి చావకురా ... అన్నీ నేను చూసుకుంటాను గదా. నాను చెప్పినట్టు చెయ్యి. నాలుగురాళ్ళు ఎనకేసుకో. నీతిగావుంటే బొచ్చె ఏందిరా వచ్చేది. ఎప్పుడూ గొర్రెకు బెత్తెడే తోక."

దింపు ప్రారంభమైంది. పొడుగుపాటి కొబ్బరిచెట్లని అవలీలగా ఎక్కేవాళ్ళని

వింతగా చూడసాగింది సత్యవతి. పాపాయి అమావాస్య అవుదూడని విప్పి కేరింతాలు కొడుతోంది. ఎల్లమంద కాస్సేపటికి బొండాలు చెరిగి పట్టుకువచ్చాడు.

సత్యవతి సగంకంటే త్రాగలేకపోయింది. పాపాయి రెండు త్రాగేసింది.

"చిన్నమ్మగారి పట్టు పెద్దదే." ఎల్లమంద నవ్వాడు.

"నువ్వు కంచెడు తినడంలా ?"

సత్యవతి గద్దించింది.

"ఎండలో మీరెందుకమ్మా. సింతసెట్టుకాడ కూకోండి నీడపట్టున. నేనున్నాగా దగ్గర," అన్నాడు ఎల్లమంద.

సత్యవతి కూర్చోలేదు. అటు ఇటు తిరుగుతూనే ఉంది. రాశిగా పోసిన కొబ్బరికాయలు ఆకుపచ్చ దిబ్బగా మెరుస్తున్నాయి.

ఎల్లమంద వెయ్యి కాయలు తప్పించాడు అక్కడక్కడ దొంకల్లోదాచి. సత్యవతి గమనించలేదు. దింపు పూర్తయ్యేసరికి సాయంత్రమైంది. కాయలు లెక్కపెట్టించుకని స త్య వ తి, పా పా యి వూళ్లోకి బయలుదేరారు. పొలాలు దాటుకుని వూరి శివారులోకి వచ్చేసరికి దీపాలు వెల్గుతున్నాయి.

బజారు వీధిలో దింపులవాడు కనిపించాడు. 'అమ్మగారూ' అంటూ దగ్గరకి వచ్చాడు. "ఎల్లమంద కాయలు దాచాడమ్మగారూ. ఆడ సెబితే నా మీద పడి ఏడుస్తాడని సెప్పలేదు."

"సర్లే." సత్యవతి తలూపింది.

అన్నివిధాల ఎల్లమందని తను చూస్తోంది. ఇదివరకు లేని సదుపాయాలు కల్పించింది. రోజుకో రూపాయి యిస్తోంది పశువుల కొట్టంలో ఎదరవైపు గదిగా చేయించి ఓ మడత మంచం యిచ్చింది. ఇన్ని చేసినా వాడు కక్కుర్తి మానలేదు. వీడ్ని జాగ్రత్తగా కనిపెట్టి చూడాలి. మంచితనాన్ని అసమర్థత అనుకుంటే తను భరించలేదు. తగిన గుణపాఠం చెప్పాలి.

మర్నాడు సాయంత్రం ఎల్లమంద "తవుడు బస్తా అయిపోయిందమ్మగారూ" అన్నాడు.

సత్యవతి నిశితంగా చూసింది. ఎల్లమంద ఆ చూపులు భరించలేకపోయాడు.

"ఇవాళ బుధవారం. తవుడు బస్తా సోమవారం తెచ్చావు..." ఆగి ముఖం లోకి చూసింది.

ఇది గుడ్డి ప్రభుత్వం కాదని, తను కళ్ళు మూసుకుని చేస్తే సుఖం లేదని ఎల్లమందకి అర్థమైపోయింది. కాని సమర్థించుకుంటూ "నాలుగున్నాయి కదా




తినడానికి...లేకపోతే నే నేమయిన బొక్కేస్తున్నా ననుకున్నారా?" విసురుగా అన్నాడు.

"నవ్వు అన్నంతింటున్నావని నాకు జ్ఞాపకం వుంది." సత్యవతి కటువుగా అన్నది.

"అదికాదమ్మగారూ." ఎల్లమంద తగ్గిపోయాడు.

"బస్తా తవుడు రెండురోజులు వచ్చిందన్నమాట. ఇలాగయితే మన వ్యవసాయం గట్టు ఎక్కినట్లే. కొంచెం బాధ్యతగా చెయ్యి మరి."

ఎల్లమంద తలూపాడు. పాపాయి వచ్చి సప్తగిరి వచ్చాడని చెప్పింది. "ఇలా పెరట్లోకి రమ్మను, మంచి గాలి వీస్తోంది."

సప్తగిరి వచ్చి పడిమీద కూర్చున్నాడు.

"ఏం మహానుభావా...ఎక్కడా అయిపులేరు."

"ఇంటర్వ్యూకి వెళ్ళాను."

తనపని వదిలేసి సప్తగిరితో మాటల్లో పడటం నచ్చలేదు, ఎల్లమందకి. "అమ్మగారూ, అన్నాడు గట్టిగా. బేగా యివ్వండి...దుకాణం ఒగ్గేసారు !"

"నేను రేపు తెప్పిస్తాలే...వెళ్ళి నీపని చూసుకో."

ఎల్లమంద ముఖంమాడ్చుకుని వెళ్ళిపోయాడు. పాపాయి వేరుశనక్కాయలు తెచ్చి గుమ్మంలో పోసింది. "ఎవరెక్కువ తింటారో...పదెం" అన్నది.

"ప్రయిజు నీదేలే, కంగారుపడకు" సప్తగిరి నవ్వాడు.

"రౌతుని బట్టే నడుస్తుందేమో గుర్రం," అన్నది దూరంగా గడ్డివామునుంచి జనపకట్టెలు తీస్తున్న ఎల్లమందని చూస్తూ.

"అ...తప్పకుండా మంచితనం అన్నివేళలా పనికిరాదు. ఇంతకీ ఏమొచ్చింది."

"చెబుతాలెండి ఏమైంది మీ యింటర్వ్యూ ?"

"సున్నా. అడ్వర్టైజుమెంటులో హెచ్చు విద్యార్హతలు గలవారికి ప్రాధాన్య మిస్తానన్నాడు. తీరా వెళ్ళేసరికి మాకు మెట్రిక్ వాళ్ళు చాలు, నువ్వెందు కొచ్చావన్నాడు మనకి వుద్యోగం ఎలాగూరాదని మానేజ్ మెంటు వారిని కడిగి పడేశాను. దానివల్ల వుపయోగం లేదనుకోండి."

"ఇలా యింటర్వ్యూలకి తిరగడం మీ యం ఏ. చదవడంకంటె ఎక్కు వవుతుంది లెక్కచూసుకుంటే అంతకంటె స్వయంకృషి మంచిది కాదూ ?"

నిజమే. మా నాన్న ఒప్పుకోడు. డబ్బివ్వడు. ఏం చెయ్యను ? నా దగ్గర ప్రాజెక్టు వుంది కోళ్ళ ఫారానికి. కనీసం పదివేలుండాలి. అందుకే గోళ్ళు గిల్లు కుంటున్నాను."

"నేనిస్తాను ప్రారంభించండి."

"సత్యవతిగారూ!" విస్మయంగా చూశాడు.

"ఫర్వాలేదు. మీ మీద నమ్మకం వుంది నాకు."

"భానోజీగారు ఒప్పుకుంటారా ?"

"నాకు విలువలేదంటారా ?" సత్యవతి నవ్వింది.

సప్తగిరి మాట్లాడలేకపోయాడు.

"కృషితో నాస్తి దుర్భిక్షం ప్రారంభించండి. మొదట అశాంతి ఎదురయినా ధైర్యం విడువకండి. మీ మీద మీకు నమ్మకం ఏర్పడితే ఎందులోనైనా రాణిస్తారు."

"థాంక్యూ మేడం...ఇన్నాళ్లు ధైర్యం చెప్పేవాళ్లు లేక ఆగిపోయాను. రేపట్నుంచే పని ప్రారంభిస్తాను." చీకటిపడటంతో సప్తగిరి లేచాడు.

దీపాలు సంధ్యాదేవికి వీడ్కోలు చేస్తున్నాయి.

రోజులు గడుస్తున్నాయి భానోజీకి కొంచెం సులువుగా వుంది. అయినా యింకా మంచం దిగలేకపోతున్నాడు. సత్యవతి అష్టావధానం చేస్తోంది. మొదట వుక్కిరి బిక్కిరయినా తర్వాత ప్రవాహంలో ఈదడం నేర్చుకుంది. సమర్థ వంతంగా అన్నీ నడిపిస్తున్న ఆమెని చూసి భానోజీ గర్వించాడు. "సత్య చూసి గ్రహిస్తుంది."

ఎల్లమందకి వూపిరి తిరగడంలేదు. అన్ని పనులూ సత్యవతి టైం ప్రకారం జరిగిపోవాలంటుంది. పైగా ఎల్లమందకి సరుకులు తెచ్చేపని తప్పిపోయింది. సప్తగిరి తేవడం వాడికి వుక్రోషంగా వుంది. రాజభరణాలు రద్దుచేసిన మహా రాజుల్లా విలపించాడు. తినమరిగినవాడ్ని కట్టేస్తే ఎలా వుంటుంది? ఆ అసంతృప్తి మరోదారి వెతుకుతుంది. ఎల్లమంద అదే చేశాడు.

పనివాళ్లకి ధాన్యం యివ్వాల్సి వచ్చింది. ధాన్యంకొట్టు తీసి సత్యవతి బయట కూర్చుంది. ఎల్లమంద కొలుస్తున్నాడు ఇంతలో పెరుమాళ్లు పిలవడంతో ఆమె వెళ్ళవల్సి వచ్చింది ఈ లోగా ఎల్లమంద రెండు బస్తాలు తప్పించివేశాడు.

ఇది మర్నాడు మధ్యాహ్నం సత్యవతికి తెల్సింది. షావుకారు రంగనాయకులు పెరట్లోకి వచ్చి ఎల్లమందని కేకవేశాడు. ఎల్లమంద అరటితోటలో వున్నాడు.

"ఏం షావుకారూ ?" సత్యవతి అడిగింది.

"ఎల్లమందకి డబ్బివ్వాలండి. నిన్న రెండు బస్తాలు దాన్యం అమ్మాడు."

ఎల్లమంద అరటిగెలల్తో వస్తూ రంగనాయకులుని చూడగానే ద్రమాన్పడి పోయాడు. అలజడి సత్యవతి గమనించింది. ఏం మాట్లాడలేదు. ధాన్యం పద్దు చూసింది. ఉన్న బస్తాలకి ఖర్చయిన బస్తాలకీ, రెండు తేడా వస్తోంది.

ఎంత ధైర్యం? తన కళ్ళ ముందే దొంగతనం చేశాడన్నమాట. అంటే ఏం చేస్తుంది అన్న ధీమా ఏర్పడిపోయిందన్నమాట. ఆ రకం వైఖరిని క్షమించ కూడదు. ఇప్పుడు తను అడిగినా వుపయోగముండదు నాకేం తెలియదంటాడు. ఇలాంటివాడికి అంకుశమే వుండాలి.

రాత్రి భోజనాలైపోయాయి. పాపాయి కూరలు, పచ్చడి ఎల్లమందకి వడ్డించడానికి తీసుకువెళ్లతోంది సత్యవతి ఆపుచేసింది. "ఆవకాయ, కాస్త మజ్జిగ పొయ్యి చాలు."

మర్నాడూ అలాగే వడ్డించబడింది.

"ఏటమ్మా... పూటా ఆ కారం మెతుకులే." పాపాయి మీద ఎగిరాడు.

పాపాయి నవ్వింది. "ఇవి లేనివాళ్ళున్నారు."

"నాకేం ధర్మంగా పెట్టడంలేదు. కష్టపడి పనిచేస్తున్నాను" కోపంగా అన్నాడు.

సత్యవతి వసారా గుమ్మంనుంచి అందుకుని "పిండివంటలు వడ్డించమంటావా ?" అనడిగింది తీవ్రంగా.

ఎల్లమంద దిక్కులు చూశాడు.

"త్వరగా లే... పనుంది." సత్యవతి హూంకరించింది.

## 6

సప్తగిరి కోళ్లఫారం నిరాడంబరంగా ప్రారంభమైంది. షెడ్లు వెయ్యడానికి స్థలం కూడ సత్యవతి యిచ్చింది భానోజీతో చెప్పి. కులపతి తన స్థలంలో అలాంటివేం పెట్టడానికి వేల్లేదని పేచీ పెట్టాడు. ప్రారంభోత్సవం సత్యవతి చేతుల మీదుగా జరగాలని కోరాడు.

"దానికోసం ఎదురుచూసే సచివులున్నారు. ఇతర చోటానాయకు లున్నారు. వాళ్లని పిలిస్తే గ్లామర్. నన్ను ఇబ్బంది పెట్టకండి" సత్యవతి నవ్వుతూ అంది. "మీరు కాదంటే రేలే నిరాహారదీక్ష చేస్తాను మీ ఇంటిముందు."

"శుభ్రంగా తినా?"

"ప్లీజ్. దీనికి కారణం మీరు ఈ పనికూడ మీరే కానివ్వాలి."

"తప్పుతుందా మంత్రసాని పనికి ఒప్పుకున్నాక."

"థాంక్యూ."

ఆవరణంతా మామిడి తోరణాల జండాలు అలంకరించారు. మైక్ పెడితే గాని పల్లెలో తెలియదని తెల్లవారుఝామునుంచీ రికార్డులు వెయ్యసాగేరు. సప్తగిరి తనకు తెలిసిన రైతాంగాన్ని, స్నేహితులను పిలిచాడు. కులపతితో మాత్రం చెప్పలేదు.

రక్తం ముద్దలాంటి ఎర్రటి జలతారు చీరతో, రెడ్‌మాచ్‌తో ఉదయిస్తున్న సూర్యబింబంలా సత్యవతి వచ్చింది. ప్రారంభోత్సవం జరిపి శుభాకాంక్షలు తెలిపింది.

కులపతి హడావిడిగా గుర్రయ్య చౌదర్ని తీసుకుని అక్కడికి వచ్చాడు. పిలవకపోయినా తండ్రి రావడం సప్తగిరికి ఆనందంవేసి సాదరంగా ఆహ్వానించాడు.

"నాతో మాటమాత్రం చెబితే చీఫ్ మినిష్టర్ని రప్పించనురా? పోన్లే... నువ్వు చెప్పకపోయినా అంతకంటె ఎక్కువయిన గుర్రయ్యగార్ని తీసుకు వచ్చాను. గుర్రయ్యగారు ఇప్పటికి వెయ్యి ప్రారంభోత్సవాలు చేశారు. ఆయన కత్తిరించినవన్నీ వెనకచూపు చూడవు" అన్నాడు కొడుకుతో కులపతి.

గుర్రయ్య వామనుడు. మూర్తికొంచెమయినా కీర్తి ఘనమైనదే. పైజామా మీద పొడుగుపాటి నల్లటి కోటు వేస్తాడు. చెవిలో మందార పువ్వు, చేతికి తిరగని వాచీ ఉంటాయి. బొద్దింక మీసాలు. ఉబ్బిపోయిన ముఖంతో విట్టీగా కనపడతాడు. ఓసారి చిన్న మంత్రి చేశాడు నెలపాటు. దాంతో రాజకీయ

నిషా అందుకుంది. ప్రస్తుతం పదవేం లేకపోయినా 'ప్రారంభోత్సవాల నాయకుడిగా' అందరికీ పరిచయం.

గుర్రయ్య సకిలించాడు. డ్రాయరు పాకి ఎక్కి కంఠం సవరించుకున్నాడు. వంగి 'ఇదేం సభా ?' కరణాన్ని అడిగాడు.

"కోళ్లఫారం"

గుర్రయ్య ఎంపరర్ ఆశోక్‌లా దూసుకుపోయాడు. "నా ప్రియమైన స్నేహితులారా ! కోళ్ళు పవిత్రమైనవి. తెల్లవారిందో లేదో తెలుసుకోడానికి కోడికూత కావాలి. విస్తరిలోకి కోడికూర ఉండాలి. బలానికి కోడిగుడ్డు ఉండాలి. వినోదానికి కోడి పందేలు ఉండాలి. కోడి ఇలా మానవజీవితంలో పెనవేసుకుపోయింది. మంచికోళ్ళు కావాలంటే ఇలాంటి ఫారాలు ఊరూరా విరివిగా వెలయాలి. కోడి లేనిదే మనం లేం. మనం లేనిదే కోళ్ళు లేవు. మనది కోడి జాతి. కోడికూతలోని సంగీతం ఎం.ఎస్. సుబ్బలక్ష్మి సంగీతం కంటె గొప్పదని నేను బల్లగుద్ది చెప్పగలను..."

గుర్రయ్య ముందుకు వంగాడు. ఎదర బల్లలేకపోవడంతో ముందరకి పడ్డాడు. అందరూ ఘొల్లున నవ్వి లేవదీశారు. గుర్రయ్యకి ఉపన్యాసం నిషాలో ఏం తెలియదు. బట్టలు దులుపుకుంటూ మళ్ళీ ప్రారంభించాడు. 'కోడి ఉపయోగాలు...'

కులపతి వారించాడు చెయ్యి పుచ్చుకుని లాగి. "ఇంక చాల్లే. మిగతా కార్యక్రమం జరగనీ. నువ్వు మళ్లా అరవపాలెం విఘ్నేశ్వర ఆంజనేయ గంగా హెయిర్ కటింగ్ సెలూన్‌కి ప్రారంభోత్సవం చెయ్యాలి. ఈ కోళ్ల గురించి అక్కడ చెప్పు. నలుగురికీ తెలుస్తుంది."

పాపం గుర్రయ్య దేనికీ చిన్నబుచ్చుకోడు. ప్రక్కనున్న బల్లమీద కూర్చుని "ఇక పార్టీ కానిద్దాం...గిరీ...అయిటమ్స్ ఏమిటి ?"

"బిస్కట్లు, జీడిపప్పు, గోల్డ్‌స్పాట్."

"అదేమిటోయ్...ఏది ప్రారంభిస్తే దాని చిహ్నాలు ఉండొద్దూ తందూరి చికెన్, ఎగ్ ఫ్రై, చిల్లీస్ చికెన్ ఉంటే పార్టీ ఏం మజాగా ఉంటుంది."

సప్తగిరి నవ్వి ముందుకు వెళ్ళిపోయాడు పార్టీ ఏర్పాట్లు చూడడానికి.

"అయితే గుర్రయ్యగారూ! మొన్న పాలెంలో ఎలుకల నిర్మూలన పథకం ఓపెన్ చేశారు కదా. భోజనాల్లో ఎలక లేమైనా వేశారా ?" ఓ కొంటె కోణంగి అడిగాడు.

గుర్రయ్య వెర్రిగా నవ్వాడు ఫలహారం ప్లేటు అందుకుంటూ.

పదిన్నరకి అతిథులు జారుకున్నారు, గేటుదగ్గర నిలబడి సప్తగిరి వచ్చిన వారందరికీ ధన్యవాదాలు చెబుతున్నాడు. ప్రారంభోత్సవం సరదాగా గడవడం అతడికి సంతోషంగా వుంది. సత్యవతి షెడ్డువెనకాల మిగిలిన టిఫిన్ ప్యాక్ చేయిస్తోంది. పాపాయి సాయం చేస్తోంది.

బయట ఇదంతా తన ప్రతిభ అన్నట్లు చెబుతున్నాడు కరణం ఎవరితోనో. దారేపోతున్న అప్పయ్యదీక్షితులు ఈ హడావిడి చూసి లోపలికి వచ్చాడు శాలువా సర్దుకుంటూ...కుండలాలు తడుముకుంటూ. సప్తగిరి ఆయనకి ఫారం చూపించాడు.

"బ్రాహ్మడివి...కోళ్ళఫారం పెట్టట మేమిటోయ్?" వ్యంగ్యంగా అడిగాడు. చెయ్యివూపుతూ, నాకేం నచ్చలేదుసుమీ...కులాన్ని భ్రష్టు చేసేస్తున్నావు." ఈసడించాడు.

"మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు !"

"బాటాలో పెద్ద ఉద్యోగం. లెదర్ టెక్నాలజీ ప్యాసయ్యాడు."

"మాదిగ చంద్రయ్యచేసే పనీ అదే. మీ బ్రాహ్మణీకం ఏమయింది ? మీ రెండో కొడుకు ఇంట్లోంచి పారిపోయి మిలటరీ హోటల్లో సర్వర్‌గా ఉన్నప్పుడు కులం జ్ఞాపకం రాలేదా మీకు ? వరాలుతో మీకున్న సంబంధం..."

అప్పయ్యదీక్షితులు రెండుచేతులూ ఎత్తి నమస్కరించాడు. 'ఊరుకో బాబూ' అన్నట్లు సంజ్ఞచేసి, గట్టిగా నవ్వి 'మీ నియోగులతో మాట్లాడలేమయ్యా బాబూ.' పరుగులాంటి నడకతో బయటపడ్డాడు.

సత్యవతి వెనకనుంచి వచ్చింది. "భలే చెప్పారు. ఎదురు దెబ్బలకి తట్టుకునే చొరవ ఏర్పడింది మీలో. రాటిస్తారు."

"ఇది మీ చలువే."

పాపాయి దూరాన్నుంచే "గిరిగారూ" అని అరచుకుంటూ వచ్చింది. ఆమె చేతిలో సగంత్రాగిన గోల్డ్‌స్పాట్ వుంది. "మీరు రోజూ ఓ కోడిగుడ్డు ఇవ్వాలి నాకు."

"రెండిస్తాను. బాగా వస్తాదులా కండపెంచి మీ ఆయన్ని చిత్తు చేసేయి."

"మొగుణ్ని కొట్టవచ్చా."

"నిన్ను కొడుతున్నాడుగా."

"అయితే ఈసారి మా ఆయన రానివ్వండి చెబుతాను."

ఎవరి పని యిది!
ఓయ్ ?!



"మీరు సరదాగా అంటే నిజంగా చేస్తుంది," అన్నది సత్యవతి.

బయటనుంచి ఎవరో కేకవెయ్యడంతో సప్తగిరి వెళ్ళాడు. ఎండ బాగా వచ్చేసింది సత్యవతి వెళ్ళడానికి సిద్ధమవుతూంటే కులపతి వెళ్ళేవాడు తిరిగి వెనక్కి వచ్చాడు.

"మా వాడు చవటనుకున్నాను కాని ప్రయోజకుడే."

"..............."

"దానికి డబ్బు ఎవరిచ్చారంటారు ?"

"అడగలేకపోయారా ?"

కులపతి వరుస ఆమెకేం నచ్చలేదు. సత్యవతిని నమిలేసేలా చూస్తున్నాడు. ఆమెని తాకాలని దగ్గరగా వచ్చాడు సైకిల్ తప్పించుకుని.

ఛీ... వెకిలిమనిషి. ఎక్కడా సంస్కారంలేదు. ఎందుకు ఏళ్లు ఏటికెదురు ? గిరి ఎంత రిజర్వుడుగా వుంటాడు. కాగడా వేసి వెతికినా చెడ్డలక్షణాలు అతడిలో కనిపించవు. ఆడదనగానే కులపతిలాంటి వాళ్ళకి సెక్సే జ్ఞాపకం వస్తుందికాబోలు !

"నాతో చెబుతాడూ ?"

"మరి నాకు చెబుతాడా ?"

"సన్నిహితుడని." కళ్లు ఎగరేస్తూ గుంభనంగా నవ్వాడు.

"కులపతిగారూ !" గర్జించింది.

"అదే స్నేహితుడని." మాట మార్చారు.

"ఒకరి విషయాల్లో నేను తలదూర్చను. తెలుసుకోండి."

"అంత కోపమెందుకమ్మాయ్! మావాడుత్త రోగ్. కలిసివచ్చే పనులు ఛస్తే చెయ్యడు. కుక్కలూ, నక్కలూ, కోళ్ళూ, మనకెందుకురా అన్నాను. విన్నాడా.. లేదు... ఆ విశాఖ సంబంధం చేసుకోరా యాభై వేలు వచ్చిపడతాయి అన్నాను. వినిపించుకోడే!"

"ఇష్టంలేకపోతే ఏం ఒప్పుకుంటాడు." సత్యవతి ముందుకు నడిచింది. కులపతితో మాట్లాడటం ఆమెకేం యిష్టంలాలేదు. నదిగట్లు బురదగా వుంటాయని ఆమెకి తెలియనిదికాదు.

పాపాయి ముందుకువెళ్ళి, సత్యవతి రాకపోవడంతో ఆగి చప్పట్లు కొడుతోంది.

"సత్యా!" కులపతి వెనకనుంచి పిలిచాడు.

సత్యవతి ఎర్రబడ్డ ముఖంలో వెనక్కి తిరిగింది. "మీకు మర్యాదగా మాట్లాడటం రాదా?" కళ్లతో నిప్పులు కురిసిస్తూ అడిగింది.

కరణం తెల్లబోయాడు. "ఇప్పుడేమన్నానూ?"

"గౌరవంగా పిలవండి. సత్యా ఏమిటి? బయటవాళ్ళు లేని చనువుపయోగిస్తే నేను అంగీకరించను."

కులపతి నవ్వాడు "చనువైనవాళ్ళు పిలవచ్చా ఏమిటి?"

"దటీజ్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్." ఈసడిస్తూ ముందడుగు వేసింది. కులపతి రాతిగోడలాంటివాడు. దానిమీద ఎంత వాన కురిసినా ఒకటే.

తనని పురుగులా తీసెయ్యడం కులపతికి అభిమానం పొడుచుకువచ్చింది. "నీ వేషాలన్నీ నాకు తెలుస్తూనే వున్నాయిలే. పతివ్రతలా కబుర్లు చెబితే నమ్మే వెర్రివెధవగాడు ఈ కరణం. గుర్తుంచుకో," అన్నాడు గట్టిగా.

సత్యవతి నిలబడిపోయింది. ఇంతలో కులపతి దగ్గరగా వచ్చాడు.

"నా వేషం ఏం చూశారు మీరు చెప్పండి." శాంతము తెచ్చుకుంటూ వుగ్రంగా అడిగింది.

కులపతి చుట్ట వెలిగించాడు ఓరగా చూస్తూ. పొగ నిండుగా వదిలాడు. "బొమ్మవేసి పేరు రాయాలా? మావాడ్ని పిచ్చివెధవని చేశావు. నీ ఆకర్షణలో పడే కదా వాడు పెళ్ళి వద్దని గంతులేస్తున్నాడు? పెళ్ళిచేసుకుంటే ఈ చాటు భాగోతాలు కుదరవుగా."

సత్యవతేం మాట్లాడలేదు. 'నాన్నా' గర్జిస్తూ షెడ్డులోంచి సప్తగిరి వచ్చాడు. "నోటికివచ్చినట్లు మాట్లాడకు. ఆవిడ్ని అవమానిస్తే నేను సహించను."

"అవున్రా నువ్వెందుకు సహిస్తావు? చాటుమాటు భాగోతాలు సాగితే పెళ్ళి ఎందుకు చేసుకుంటావ్? నువ్వింత సన్యాసిగా తయారవుతావనుకోలేదు."

సప్తగిరికి నిప్పుల్లో నడుస్తున్నట్లు వుంది. తనని తిట్టినా బాధపడడు. సత్యవతిని అవమానించడంతో భరించలేకపోయాడు. తండ్రిని ముందుకు గెంటాడు. "దయచేసి వెళ్ళిపో...ఇలాంటిదేదో చేస్తావనే నిన్ను పిలవలేదు. నువ్వు వూహించే నీచ సంబంధం మా మధ్య ఏం లేదు. ఆవిడ మంచి స్నేహితురాలు. ఆడది, మాగాడు మాట్లాడుకుంటే తాటాకులుకట్టే నీ సంస్కారం గురించి నేనేం మాట్లాడను. అదే సిగ్గు నాకే చర్చించడానికి."

"ఆ రాణీగార్ని మాటంటేనే పౌరుషం వచ్చేసింది, నన్ను కొట్టడానికే సిద్ధమయ్యావు... ప్రయోజకుడి వయ్యావురా... మరి కొట్టవూ?"

"నువ్వన్నమాట బాగుందా? ఆవిడకి క్షమార్పణ చెప్పు."

"ఇంటికిరా చెప్తాను... నీ సంగతి."

"ఇక ఆ గుమ్మం ఎక్కను. నువ్వు భయపడక్కర్లేదు."

"నీకూ రెక్కలు వచ్చాయికదా మరి! ఇక నా లెక్కేముంది. ఏరు దాటించాకా తెప్ప తగలేసే రకంరా నువ్వు... నీకెలా బుద్ధిచెప్పాలో నాకు తెల్సులే."

"ఇక్కడ్నుంచి ముందర పో... నీ యిష్టం వచ్చినట్లు చేసుకో."

కులపతి బూతులు తిడుతూ వెళ్ళిపోయాడు. ఆ యిద్దర్నీ చూస్తూ బొమ్మలా నిలబడిపోయింది సత్యవతి.

"మీకు జరిగిన అవమానానికి నేను చాలా బాధపడుతున్నాను. మా నాన్నకి బదులు నేను క్షమార్పణ చెప్పుకుంటున్నాను.

"..............."

"మీరు నాకు వెలుగు చూపించారు. మీ మీద నాకెలాంటి భావమూ లేదు. ప్లీజ్ నన్ను నమ్మండి." సప్తగిరి ప్రాధేయపడ్డాడు.

"దట్స్ మై ఫేట్." సత్యవతి భారంగా నడిచింది. సప్తగిరి మ్రాన్పడి పోయాడు, తనవల్ల ఆమెకి అవమానం జరిగినందుకు.

*　　*　　*

సత్యవతి ఎంగిలిపడి తన గదిలోకి పోయి కూర్చుంది. రాత్రి సగం చదివిన

పుస్తకం తెరిచింది. ఏం బుర్రకెక్కలేదు. విసుగ్గావుంది. పుస్తకం టేబిల్‌మీద పడేసి కళ్ళుమూసుకుంది. కులపతి... సప్తగిరి కనిపిస్తున్నారు. సప్తగిరికి సాయంచేసి తను పొరపాటు చేసిందా? తను చేసిన సాయానికి కరణం వక్రభాష్యం చెప్పాడు. బుద్ధులుబట్టే ఆలోచనలు వుంటాయి కాబోలు కులపతి కాలనాగు. తనని కబళించాలని చూస్తున్నాడు. అది కుదరక యిలా ఎదురు తిరిగాడు. చాప చిరిగినా చదరంతయినా రాదా అని ఎదురుచూస్తున్నాడు ఇది తను ఛాలంజీగానే తీసుకుంటుంది. రోట్లో తల దూర్చాక రోకటిపోటుకి వెరవడం ఎందుకు? పాపం... గిరి మంచివాడు. కల్మషం లేనివాడు. అసలు స్త్రీ పురుషుల మధ్య స్నేహానికి తావులేదా? లేక కులపతిలాంటి జడపదార్థాలు మార్పు చెందకా? తండ్రి చేసిన పనికి అతడు కూడ చాలా బాధపడుతున్నాడు. తన కోసం తిరగబాటు కూడా చేశాడు. కరణం తెలిసిన మూర్ఖుడు. తల్లిగండం, పిల్లగడం వున్నాయి కాని మంత్రసానికి గండం ఏమిటి?

అద్దంమీద ఆవగింజల్లా ఆలోచనలు జారిపోతున్నాయి.

"అత్తయ్యా!" పాపాయి పిలుస్తూ వచ్చింది. "నాకు అన్నం తినినా ఆకలివేస్తోంది... మళ్ళా ఎవరయినా క్రోళ్లఫారం పెడితే బాగుండును"

"నీకు పార్టీగురించా?"

పాపాయి మాట్లాడకుండా ట్రాన్సిస్టర్ ఆన్‌చేసింది. రంగవల్లి వస్తోంది.

"సౌండు తగ్గించు." భరించలేక సత్యవతి అరచింది.

పాపాయి కట్టేసింది మొత్తానికి. దగ్గరగా జరిగి "పిన్నీ! మా ఆయన అస్తమానూ కొట్టేవాడు. భానోజీ బాబయ్య నిన్ను ఎప్పుడూ కొట్టడేం?"

"నువ్వు మొద్దువు గనుక. చపట ప్రశ్నలు వెయ్యక కాస్సేపు నన్ను వదులు." అంటూ మంచంమీద ఒరిగింది నిద్రపోవడానికి.

"జోలపాట పాడనా?"

"రేపు నీ బిడ్డలకి పాడుకుందువుగానిలే ... పెరట్లో ఏదో చప్పుడవుతోంది చూడు."

పాపాయి ఒంటికాలిమీద కుంటుతూ వెళ్ళిపోయింది

ఆకాశం మేఘాలతో నల్లగావుంది. వర్షం కురవకపోయినా చీదరగా వుంది. ఈదరవీస్తోంది. గది చీకటి కావడంతో సత్యవతి కిటికీ తెరిచింది. కొద్దిగా వెలుగు వచ్చింది. కొబ్బరిచెట్లు ఏడవడానికి సిద్ధంగా వున్నట్లు గలగలమంటున్నాయి.

"సత్యవతీ." హాల్లోనుంచి భానోజీ పిలిచాడు.

సత్యవతి గుమ్మంలో నించుంది.

"పడుకున్నావా ?"

"లేదు."

"ఏ చందమామయినా చదవకూడదూ, తోచడంలేదు."

సత్యవతి పుస్తకం తేవడానికి వెళ్లింది. వీధిలోవున్న పాపాయి వచ్చి "ఏడు భూతాలకథ చెప్పనా పెదనాన్నా" అనడిగింది.

"అవతలికి పో." ఖానోజీ పెద్దగా అరిచాడు

సత్యవతి చందమామ చదవసాగింది.

ఇంతలో బయట మాటలు వినిపించాయి. "ఇదేనండి ఖానోజీగారిల్లు. నన్ను పాపాయి అంటారు. కొంతమంది పాపా అంటారు... రండి లోపలికి" అంటోంది పాపాయి.

సత్యవతి కొంచెం జరిగి చూసింది... ఎవరోనని.

భగవాన్లు

కంట్లో నలక పడ్డట్లయింది. సత్యవతి లేచింది. భగవాన్లు సూట్‌కేస్‌తో వచ్చాడు. "సత్యా... ఎలావున్నావ్... ఏమిటి మీరలా పడుకున్నారు ? జ్వరమా ?"

సత్యవతి లోపలికి వెళ్ళిపోయింది.

"ఉత్తరాలు రాయదండీ సత్య. వాళ్లక్క బెంగపెట్టుకుని ఏడుస్తోంది. తనే బయలుదేరి వస్తానని కూర్చుంది. పిల్లలతో రాలేక నన్ను పంపింది. మీకింత జరిగినా ఒక్క కార్డుముక్కయినా రాసిందేమో చూడండి."

టీ పెడుతున్న సత్యవతికి మాటలు వినిపిస్తున్నాయి. 'ఉత్తది అంత ప్రేమ ఏడుస్తోందేమిటి మీకు !' అనుకుంది కసిగా.

తర్వాత ఆమె భగవాన్లుకి కనిపించే ప్రయత్నం చెయ్యలేదు. తప్పించుకుని తిరిగింది. రాత్రి భోజనం కూడా పాపాయినే వడ్డించమంది.

పాపాయి వంట్లో బాగాలేదని భోంచెయ్యలేదు. సత్యవతి భోంచేస్తుండగా పిల్లిలా వచ్చాడు భగవాన్లు. చూసినా చూడనట్లే తినసాగింది.

భగవాన్లు గడపమీద కూర్చున్నాడు. "మమ్మల్ని మరచిపోయావు సత్యా!"

"నిన్ను మరచిపోలేదు." కటువుగా అంది.

"నాకు తెల్సు సత్యా, నా మీద ప్రేముందని. అందుకే బయలుదేరి వచ్చేశాను."

"ఎందుకు ?"

"పూర్వం నన్ను కాదన్నావంటే అర్థముంది. పెళ్ళికాలేదు కనుక. ముసలాడో ముతకాడో మొగుడన్న వాడున్నాడు యిప్పుడు. ఏం చేసినా ఫర్వాలేదు కదా !"

"ఇదే నీతి నీ భార్యకి కూడ వర్తిస్తే.''

భగవాన్లు రోషంగా చూశాడు.

"నీ దగ్గరకి వచ్చేసరికి భుజాలు తడుముకుంటావేం ? నువ్విలాంటి వెధవాలోచనతో వచ్చావనే దూరంగా వుంచాను."

"నన్ను కాదన్నావంటే ఏం జరుగుతుందో తెల్సా ?"

"నువ్వో గడ్డిపరక. నన్నేం చెయ్యలేవు."

అతడు సత్యవతి కోసమే వచ్చాడు. ఏమన్నా భరించి లొంగదీసుకుందామనుకున్నాడు. రెండో పెళ్ళి భార్యలందరూ యితర మగాళ్లంటే పడి చచ్చిపోతారని చచ్చురకం సెక్స్ పత్రికల్లో చదివి, యిలా వచ్చాడు. సత్యవతి కొరకరాని కొయ్య అయింది. పైగా రెచ్చకొడుతోంది. గడ్డిపోచలా ఛీత్కరించడంతో పురుషాహంకారం లేచింది ?

''నేను తలుచుకుంటే మీ అక్కజీవితం రోడ్డెక్కుతుంది. ఆమె సుఖంగా వుండాలనుకుంటే నాకు ఎదురు చెప్పక."

సత్యవతి వెటకారంగా నవ్వింది. "అందరికీ నేను లోకువ, నాకు నంచి రామాయలోకువ అన్నాట్ట నీలాంటి అసమర్థుడు. సినిమాల్లోలా అక్కయ్య కోసం నేనేం త్యాగాలు చేసెయ్యను. అది నీ భార్య. వదులుకుంటావో నరుక్కుంటావో నా కనవసరం. నీకు తోచింది చేసుకో.''

"చెల్లో అంటూ అది పడిఛస్తుంది. నువ్వ యిలా ?..."

"నటించడం నాకు చేతకాదు."

సత్యవతి భోజనం పూర్తిచేసి లేచింది. పెరటి తలుపు తీసి ఎల్లమ్మందని కంచం తెచ్చుకోమని కేకేసింది. భగవాన్లు యింకా అక్కడే కూర్చున్నాడు. సత్యవతిని నిశితంగా పరిశీలిస్తున్నాడు. ఖరీదైన చీర, యితర నగలలో కొత్త అంతస్థులో కనిపిస్తోంది.' నన్ను తప్పించుకుంటావా ?' అన్నట్లు చూసి లేచాడు. సత్యవతిని ఎలాగయినా పొందాలన్న కాంక్ష కళ్ళలో కనిపించింది.

రాత్రికి పథకం వేసుకున్నాడు. కాని తలుపులు తెరిచి లేవు. సత్యవతి తలుపు లోపల గడియపెట్టింది. భగవాన్లుకి నిద్రపట్టలేదు. 'పాము' అంటూ




బిగ్గరగా కేకలు పెట్టాడు. పాపాయి, ఎల్లమంద వచ్చారు గాని సత్యవతి రాలేదు. ఆమె గడియ తీసుకుని వస్తుందనుకున్నాడు. ఇక విసిగి పడుకున్నాడు.

"తాతయ్యగారూ లేవండి" ఉదయం పాపాయి కాఫీ తెచ్చిస్తేగాని మెలకువ రాలేదు.

తను వచ్చిన అసలు పని గుర్తుకు వచ్చింది. మొదట దాన్ని సాధించవల్సింది. ఇప్పుడేమంటుందో సత్యవతి. ఛీ...తను పొరపాటు చేశాడు... అయినా తన తప్పేముంది. ఆమెని చూడగానే మతిపోయింది. సత్యవతి అందం శృంగార ప్రభాతానికి కోడికూత.

భగవాన్లు స్నానంచేసి బట్టలు వేసుకుని సత్యవతి కోసం తచ్చాడాడు. ఆమెని కల్సుకోడానికి గంటన్నర ఆగవల్సి వచ్చింది. 'నీ సాయం కోరి వచ్చాను' అంటూ దీనంగా మొదలుపెట్టాడు.

సత్యవతి కూర తరుగుతూంది. మాట్లాడలేదు. కుచ్చిళ్ళు పైకి దోపుకోవడం వల్ల మోకాళ్ళు నగ్నంగా కవిపిస్తున్నాయి. భగవాన్లు చూపు నిలిచిపోయింది. ఊదారంగు లంగా, పచ్చటి చీరపై ఎండలోని బంతిపువ్వులా మెరుస్తోంది. భగవాన్లు మాట్లాడకపోవడంతో తల ఎత్తి చూసింది.

భగవాన్లు దృష్టి మార్చాడు. "మా ఆఫీసరు వుత్త వెధవ సత్యవతీ. ఆరువేలూ తను తినేసి నా మీదకి గెంటేశాడు. డబ్బు కట్టకపోతే నేను జైలుకి పోవాలి."

"అనుభవించు." ఆమెకేం సానుభూతి కలుగలేదు. ఇదో కొత్తనాటకంలా కనిపించింది.

"నీ మీద కొండంత ఆశతో వచ్చాను. నా కుటుంబం నీ చేతిలో వుంది. నువ్వు కాదంటే నీ అక్కయ్య, పిల్లలు రోడ్డు ఎక్కాలి." విషాదంగా పలికాడు.

"దానికి తోచిందేదో అది చేస్తుంది. అయినా పరిస్థితి అక్కడిదాకా ఎందుకు వస్తుంది. ఇల్లుందిగా, అమ్మి బాకీ తీర్చు. ఇక్కడ్నుంచయినా జాగ్రత్తగా వుండు."

"ఇల్లు అమ్మి ఎక్కడ వుంటాం?" ఆశాభంగంగా అడిగాడు.

"అద్దె యింట్లో వుంటావు. ఆ మాత్రం తెలియదూ." వెటకారపు నవ్వుతో అంది.

"ఉన్నపళంగా యిల్లు ఎక్కడ అమ్ముడవుతుంది?"

"తనఖా పెడితే నేనే యిస్తాను."

భగవాన్లు దగ్గరగా వచ్చాడు. "మాతో...కావల్సినవారితో వడ్డీ వ్యాపారం చేస్తావా? మీ నాన్న పోయాక తీసుకువచ్చినందుకు, చూసినందుకు కృతజ్ఞత వుందా?"

సత్యవతి విసురుగా అంది. "ఎందుకుండాలి? నా డబ్బు కోసం తీసుకు వచ్చింది. మోసం చేసి కాజేశారు. చివరకి నా గొంతు కోశారు. ఇన్ని మర్యాదలు చేసినందుకు సన్మానం చెయ్యమంటావా? నేను గుమ్మం దాటాక మీతో సంబంధాలు రద్దుచేసుకున్నాను."

"గొప్పదాని వయిపోయావు...నీ వైభోగమెంతకాలమో చూస్తాలే. తిరిగి నా గుమ్మం ఎక్కక పోనవు. ఆ రోజు కుక్కని తరిమినట్లు విసిరికొడతాను."

ఉక్రోషంగా కదిలాడు. సాక్షిని బ్రతిమాలేకంటె వాది కాళ్ళు పట్టుకుంటే మంచిదన్నట్లు భానోజీని కల్సుకున్నాడు. ఏడ్చాడు. ఎలాగయినా సాయం చెయ్యమని కోరాడు.

భానోజీ కరిగిపోయాడు. సత్యవతిని పిలిపించాడు. "బాధల్లో వున్నాట్ట..." అన్నాడు.

"ఇవ్వడం నా కిష్టం లేదు. మీ యిష్టం మరి." స్పష్టంగా అన్నది.

సత్యవతిని కాదని ఆయనకు ఏమీ చెయ్యడానికి మనసు రాలేదు. 'మరోచోట ప్రయత్నించుకో...లాభంలేదు.' అని చెప్పేశాడు.

భగవాన్లు అక్కసుగా తిడుతూ ప్రయాణమయ్యాడు.

*　　　*　　　*

బుచ్చమ్మ యాత్రలనుంచి తిరిగి వచ్చింది. సత్యవతి ఆమె చేత కాశీ సమారాధన చేయించింది. ఖానోజీ కర్రసాయంతో యింట్లో తిరగ గలుగుతున్నాడు. బుచ్చమ్మ యింట్లో వచ్చిన మార్పు గుర్తించింది. అన్నీ సత్యవతి చేతి మీదుగా జరుగుతున్నాయి. దీనికి ఆమె అసూయపడలేదు తను చాకిరీ కున్న మనిషినని తెల్సు. ఆమె అధికారం కోసం ప్రాకులాడే మనిషీ కాదూ. సత్యవతి వచ్చాక ఆమె ప్రతిపత్తి పెరిగింది. అందుకని అభిమానించసాగింది. వచ్చే పోయేవారితో యాత్రల గురించి ముచ్చటించడంతోనే సరిపోతోంది. ఆమె వచ్చిన నాలుగురోజులకి వియ్యంకుడు పోయినట్లు పుత్తరం వచ్చింది. ఖానోజీ యింకా ప్రయాణం చేసేలా లేడు. పాపాయిని తీసుకుని బుచ్చమ్మ వెళ్ళింది వెంటనే. పదోరోజున సత్యవతి వెళ్ళింది.

ఇల్లంతా తేనెటీగల్లా జనం. ఇల్లు యిరుకు కావడంవల్ల బిల బిల మంటూ కనిపిస్తున్నారు జనం. బుచ్చమ్మ వియ్యపురాలిని పలకరించింది. ఆమె బిడి బిడి రాగం తీసి 'ఇంకా ఎన్నాళ్ళంటాడు. యిప్పటికే మమ్మల్ని చంపాడు' అన్నది. సంబంధం ఏడుగురి అన్నదమ్ముల్లో చివరివాడు. పెద్దకొడుకు తప్ప అందరూ వచ్చారు. పెద్దకొడుకు దెబ్బలాడి ఆ వూర్లోనే వేరే వుంటున్నాడు. తండ్రి పోయినా రాలేదుట. మనిషి పోయిన విచారం ఎక్కడా కనిపించలేదు ఆ యింట్లో.

దున్నే వేళలో దూరదేశం పోయి, కోతల రోజుల్లో కొడవలి పట్టుకుని వచ్చాడుట, పెద్దకొడుకు. ఆ సాయంత్రం అప్పులు-ఆస్తులు గొడవ జరుగుతూండగా వచ్చాడు. వాగ్యుద్ధాలు చేతులు కలిపేదాకా వచ్చింది. పెద్దమనుషులు విడదీశారు.

మర్నాడు ప్రయాణమయ్యారు బుచ్చమ్మ వియ్యపురాలితో "అమ్మాయిని వుంచుతాను పనీ పాటకి వుంటుంది" అంది.

"తీసుకెళ్ళండి. ఆ తింగరమొద్దు యిక్కడెందుకు ? ఉన్నవాళ్ళే కొట్టుకు చస్తున్నారు." పాపాయి తల్లి వెనకాలే వుంది. "అత్తమ్మగారూ మళ్ళీ మీరు పోయినప్పుడే రావడం."

బుచ్చమ్మ కూతుర్ని లాక్కుని వచ్చి బండి ఎక్కించింది.

తమతో బాటు రైలు ఎక్కిన అల్లుడ్ని చూసి బుచ్చమ్మ ఆశ్చర్యపోయింది చాటుగా సత్యవతిని అడిగింది, సంబంధం విజయవాడలో కాఫీకి దిగినప్పుడు.

"ఉద్యోగం పోయిందట అప్పు తప్ప వచ్చే ఆస్తేం లేదుట. అన్నదమ్ములు ఎవరి పొయ్యి వాళ్ళు పెట్టుకుంటారుట. సంబంధం గురించి ఎవరూ పట్టించుకోలేదు. నా దగ్గరకి వచ్చి బాధపడ్డాడు. మనతో రమ్మన్నాను."

సంబంధంచేత పూర్లోమందుల కొట్టు పెట్టించింది–పాపాయి పేరు మీదుగా. కాపురం కూడ వేరే పెట్టించింది.

"మీ ఋణం..." సంబంధం ఆమె చేసిన సాయానికి పులకరించిపోయాడు.

"పాపాయిని జాగ్రత్తగా చూసుకో. నెమ్మదిగా తెలియచెబితే అన్నీ చేస్తుంది. ఈ అవకాశాన్ని కూడ దుర్వినియోగపరచుకున్నావంటే జీవితంలో పైకి రాలేవు. మీకు ఏం కావల్సినా చెయ్యడానికి నేనున్నాను" సత్యవతి హామీ యిచ్చింది.

బుచ్చమ్మకి స్వర్గం అందుకున్నట్లే వుంది. కూతురు కాపురం కుదుటబడింది. ఇక తనకేం కావాలి? రోజులు ఎలాగయినా వెళ్ళమారుస్తుంది.

''ఇదంతా నీ చలువమ్మా.'' సత్యవతి చేతులు పట్టుకుంది.

## 7

పూర్వదిశలో నిండుగా వెలిగిపోతున్నాడు పున్నమి చందమామ. దగ్గరలోని పెద్దతార కళ్లు విశాలంచేసుకుని చందమామ సొంపుసోయగాల్ని పరిశీలిస్తోంది. తెల్లటి మబ్బులు అప్పుడప్పుడు ఐరావతాల్లో సంచారం చేస్తున్నాయి చిన్న చిన్న తారలు నీలిరంగు ఆకాశపు వాకిళ్ళు వెన్నెలతో అలికి చిరునవ్వుల దివ్వెలు వెలిగించుకుని చంద్రుడి రాకకోసం నిరీక్షిస్తున్నవి. పండువెన్నెల పాలవెల్లి పరమ శోభయమానంగా వెలుగుతూ చూసేవారికి ఆనందాన్ని కలుగజేస్తోంది.

సమయం ఎనిమిది కావస్తోంది. సత్యవతి వరండాలో నిరీక్షణగా తిరుగుతోంది. పల్లె అప్పటికే మాటు మణిగింది. నిశ్శబ్దం మంత్రినీడలా వ్యాపించింది.

ఉండి వుండి లేగదూడలు అరుస్తున్నాయి.

ఛీ...వీడికి బొత్తిగా లక్ష్యం పోయింది. పదకొండు గటలకి వెళ్ళినవాడు ఇప్పటిదాకా ఏంచేస్తున్నాడు సిటీలో! పాలుకోసం లేగదూడలు అరుస్తున్నవి. ఎక్కడిపని అక్కడే నిలిచిపోయింది. వాడికి తోచినట్లు చేస్తున్నాడు ఎల్లమంద. తాము చెప్పినట్లు వినడంలేదు. గర్వం బలిసింది. తాము వాడిమీద ఆధారపడి ఉన్నందుకేమో!

"సత్యా ! పీడింకా రాలేదా ?" ఖానోజీ గుమ్మంలోకి వచ్చాడు.

రాలేదని తలూపింది.

ఆయన సణుక్కుంటూ వెళ్ళిపోయాడు. పశువుల విషయంలో ఆయన అమిత శ్రద్ధగా ఉంటాడు అన్నీ టైం ప్రకారం జరిగిపోవాలంటాడు. అవి నోరులేని జీవాలు... కావాలని అడగలేవు కదా అని ఆయన ఉద్దేశ్యం.

టైలర్ బట్టలు తీసుకు వచ్చాడు. సత్యవతి వాటిని చూసి పరిశీలించి 'రంగయ్యని ఒకసారి కనపడమను' అని చెప్పింది.

మరో అరగంటలో ఎల్లమంద వచ్చాడు.

"ఇంతసేపయిందేరా ?" సత్యవతి వేడిగా అడిగింది.

"రేడియోకాడ ఆలీసమైపోయిందండి..." ఎల్లమంద సంచీలోనుంచి రేడియో, స్నో, పౌడరు, ఆగరవత్తులు- పుస్తకాలు బల్లమీద పెట్టాడు.

సత్యవతికి నమ్మబుద్ధి కాలేదు. అయినా ఏమనాలో తెలియక ఊరుకుంది. "ముందర పాలు పిండు...అయ్యగారు తిడుతున్నారు."

డి.డి. తిరగేస్తూ కూర్చుంది. అది రాజీవ్‌కి అయిదువేలు పంపినది. రేపు పోస్టు చెయ్యాలి. దీనితో రాజీవ్ చదువయిపోతుంది. తన బాధ్యత తీరిపోతుంది. అతడి వ్యధ కరిగిపోతుంది. ఇద్దరి కల నెరవేరుతుంది.

దూరంగా వున్న రాజీవ్‌ని గురించి ఆలోచించడం థ్రిల్లింగ్‌గా ఉంది.

తెల్లవారింది. సత్యవతి కాఫీ త్రాగాక మందార పువ్వులు కోస్తోంది. 'దండాలమ్మగారూ !" రంగయ్య ఆయాసపడుతూ వచ్చాడు. నిలబడలేక ఇటుకల గుట్ట దగ్గర కూర్చున్నాడు – నల్లటి దుప్పటి నిండుగా కప్పుకుని

"ఎలా వుందయ్యా ?"

"ఏం సెప్పనమ్మా...ఎంత వయిజ్యం చేసినా అలాగే ఉన్నది నా కూతురేమో యిజీనగరం రమ్మంటోంది. నా కొడుకు ఏడకీ వద్దంటాడు. యిలాగే రోజులు ఎల్లిపోతున్నాయి."

డబ్బులున్నవారు, పదవులున్నవారు 'జలుబు' చేసినా అమెరికా స్పెషలిస్టుల కోసం వెళ్ళగలరు. రంగయ్యలాంటి సామాన్యులకి ఏలాంటి జబ్బుచేసినా సరయిన వైద్యమే అందదు వైద్యం డబ్బులకు లోబడి ఉంటుంది. ధర్మాసుపత్రులు నేతిబీరకాయలు !

సత్యవతి సానుభూతి చూపుతూ "నువ్వు మళ్ళీ వచ్చేదాకా మనకో పనివాడు కావాలి రంగయ్యా ! ఎవర్నయినా చూస్తావని రమ్మన్నాను" అంది.

"ఎల్లమంద సరిగ్గా సెయ్యడంలేదా ?''

"వాడున్నా మరొకడు ఉండాలికదా !"

రంగయ్య మాసిపోయిన నల్లటి గడ్డం రాసుకుంటూ కొద్దిసేపు ఆలోచించి అన్నాడు. "మా దాసుని పంపుతానమ్మా. మా సిన్నాన్న కొడుకు. మొన్నటి దాకా బొంబాయిలో ఉండి వచ్చేసినాడు. ఒళ్లు దాచుకోకుండా సేస్తాడు."

"మనకి అదే కావాలి. నీకు ఇచ్చినట్టే ఇస్తాం."

"మంచిదమ్మా. నానే మీ కాడకు రావాలనుకుంటున్నా ఆడ్ని గురించి. నవుకిరీ లేక అటు ఇటు తిరుగుతున్నాడు. నడిసిరాలేక ఊరుకున్నాను.

"ఈ పూట పంపించు.''

"ఇంటికాడే ఉన్నాడు. ఎల్లగానే పంపిస్తాను."

సత్యవతి లోపలి కెళ్ళి యాభై రూపాయలు తెచ్చియిచ్చింది. రంగయ్య తీసుకోడానికి ముఖమాట పడ్డాడు.

"ఉంచుకో రంగయ్యా ! అవసరముంటే రా. ఇన్నేళ్ళుగా ఈ కొంపకి చాకిరీ చేశావే. నువ్వు మూలబడితే మాకు బాధ్యత లేదంటావా ?''

రంగయ్య కళ్ళు ఆనందంతో మిలమిలలాడాయి. డబ్బుచూసి కాదు. సత్యవతి మంచి మనస్సు చూసి. తనకి కొండంత అండ దొరికినందుకు. దండాలు పెడుతూ సెలవు తీసుకున్నాడు.

"అల్ప సంతోషులు.'' సత్యవతి నిట్టూర్చింది.

దాసు మరోగంటలో పనిలో ప్రవేశించాడు. కాకీనిక్కరు - నీలంచొక్కా, లావుగా పొడగ్గా ఉన్నాడు. పట్నంలో ఉండి వచ్చాడేమో శుభ్రంగానే ఉన్నాడు.

రెండురోజులపాటు దాసుకి పనులు కొత్తగానే ఉన్నాయి. అయినా శారీరక బలంమీద ఆధారపడిన పనులే గనుక చొచ్చుకుపోయాడు. రంగయ్యలాగే నెమ్మదయినవాడు. సత్యవతి వారంరోజులు వాడ్ని పరిశీలించింది. దాసుకి చుట్ట అలవాటుకూడ లేదు. ఎంతపని చెప్పినా విసుక్కునేవాడు కాదు. పాపాయి మాట్లాడుతూంటే వాడికి తెగ నవ్వుగా ఉండేది.

దాసుకూడ ఇన్నాళ్ళు పనులకోసం బొంబాయిదాకా పోయి ఎక్కడా నిలబాటు చెందలేక విసిగి వచ్చాడు ఇక్కడ నిర్మలంగా ఉంది. జీవితం కుదుటపడింది.

ఎల్లమంద పని కట్టయింది. దాసుని పనిలో పెట్టుకోవడం వాడికి అసలు యిష్టం లేదు దాసు కుటుంబానికీ, అతడి కుటుంబానికీ మధ్య వైరముంది ఓ రోజున సత్యవతి పెరట్లో కూర్చుని పుస్తకం చదువుతూండగా విసురుగా వచ్చాడు ఎల్లమంద.

"దాసుని ఎందుకు పెట్టారు ? దండగ...ఆడికే పనీ రాదు. పిల్లిపెసర కోసుకురమ్మంటే జనపచేను తగలేసుకువచ్చాడు. అయ్యగారు నన్ను తిట్టారు.

"తెలియక చేసి‌ఉంటాడు. నీకు అన్ని పనులూ ఒక్కసారి వచ్చేసాయా ?''

తనని నిలదీయటం ఎల్లమందకి నచ్చలేదు. దాసుని బయటికి పంపే మార్గాలకోసం చూస్తున్నాడు. సత్యవతి దాసుని సమర్థించడంతో చిరాకు ఎక్కువైంది.

"అసలు ఆడ్ని ఎందుకు పెట్టుకున్నారు ?"

"నీకు సాయం చేయడానికి."

''నాతో సెబితే నేనే ఎవడ్నో తెద్దును కదా !"

సత్యవతికి వాడి తల విసురు కోపం తెప్పించింది. "అన్నీ నీతో సంప్రదించి చెయ్యాలంటావా ?...మాకు తోచింది మేం చేస్తాం.''

"దాసు పైకి అలా వున్నాడు కాని ఉత్త లుచ్చా ఎదవ. ఆడికీ మాకూ అసలు పడదు."

"విరోధమా ?"

తలూపాడు. ఆడి అన్న మా అప్పని సేసుకుని సంపేశాడు."

"దానికి దాసేం చేస్తాడు ?"

ఎల్లమంద మాట్లాడలేకపోయాడు. కాలితో నేలరాస్తూ నించున్నాడు.

"మీ విరోధాలు బయట. ఇక్కడ కలసి పనిచెయ్యవలసిందే. ఇలా ఒకరి మీద ఒకరు నేరాలు చెప్పుకుంటే నేను సహించను. వెళ్లు..." సత్యవతి పుస్తకంలో మునిగిపోయింది.

ఎల్లమంద పరాభవంతో కదిలాడు. సత్యవతి తనని చెత్తలా తీసిపడెయ్యడం వాడి హృదయం భగ్గుమంది 'చూపిస్తా. నా తడాఖా' అనుకున్నాడు.

తెల్లవారేసరికి పెరట్లో పెద్దగేదె కనిపించలేదు. దాసు వచ్చి చెప్పాడు. ఖానోజీ తల్లడిల్లిపోతూ పశువులశాల దగ్గరికి వచ్చాడు ఆ గేదెని కొని ఏడాదయింది. మంచిగేదని మూడువేలుపోసి పోటీమీద కొన్నాడు.

సత్యవతి కూడ వచ్చింది.

"నువ్వు రేతిరి తిన్నగా కట్టేసినావురా ?" ఎల్లమంద కోపంగా గద్దించాడు.

"సగం రేతిరికాడ గడ్డికూడ ఏశాను." దాసు మామూలుగా చెప్పాడు.

ఎల్లమంద ఆవేశంగా ''తరువాత ఏమైంది మరి...తప్పించుకుపోయిందా! అంత గట్టిగా కట్టావన్నమాట." దాసుమీదకి వెళ్లాడు.

సత్యవతి అంది. "వాడు చూడకపోతే నువ్వేం చేశావు ? నీకు బాధ్యత లేదా ?''

"ఆడేం చేశాడో ఎనకాల సూడ్డమేనా నా పని."

ఖానోజీ ఇద్దర్నీ తిట్టాడు. "ముందర వెతుక్కురండి, ఆనక తీరికగా వాదించుకుందురుగాని."

మధ్యాహ్నానికి ఖాళీగా వచ్చారు.

మర్నాడూ దొరకలేదు ఖానోజీ నిరాశ చేసుకున్నాడు.

ఇరవై రోజులు గడిచాయి. దాసు ఓ మధ్యాన్నం హడావిడిగా సత్యవతి దగ్గరికి వచ్చాడు తనకు తెలిసింది చెప్పాడు.

అప్పుడే ఎల్లమంద పొలంనుంచి పచ్చగడ్డిమోపు తీసుకువచ్చాడు. శాలలో పడేసి నుయ్యిదగ్గర ముఖం కడుక్కుని పెరటి గుమ్మంలోకి వచ్చాడు.

సత్యవతి టీ పెడుతోంది.

"ఓ రూపాయి యివ్వండమ్మా. పొగాకు తెచ్చుకోవాలి."

"మరి గెదెని అమ్మిన పద్దెనిమిదివందలూ ఏమిచేశావు ?"

నల్లటి ఎల్లమంద ఇంకా నల్లబడిపోయాడు.

"ఈ క్షణంనుంచి నువ్వు మా పాలేరువి కాదు. పో. దానితో నువ్వేం బాగుపడవు మేం చెడిపోం. ఇలాంటి దొంగబుద్ధి ఉంటే కష్టం."

ఎల్లమంద నిశ్శబ్దంగా వెళ్ళియాడు.

*　　　*　　　*

ఈ ప్రపంచంలో అన్నీ తెల్సినవాడూ లేడు. ఏమీ తెలియనివాడూ లేడు. కులపతి మాత్రం తనకు తెలియనిదేమీ లేదనుకుంటాడు. లౌక్యంవల్ల ధనం సంపాదించడంతో అతడి అహం పెరిగిపోయింది. ఈ దశలో కొడుకు తిరగ బాటు చెయ్యడం...ఇంటికి రాకుండా నీ తెక్కిమిటని ప్రవర్తించడం ఊర్లో తలవంపులుగా ఉంది. దీనికంతా కారణం సత్యవతి. ఆమెని లొంగదీసుకుంటే చెప్పుకింద తేలులా ఉంచుకుంటే తన పగ చల్లారుతుంది.

ఒకనాడు ఉదయం పదిగంటల వేళలో ఖానోజీ ఇంటికి వెళ్ళాడు. సత్యవతి ఈజీచైర్‌లో ఆలోచిస్తూ కూర్చుంది. కరణాన్ని చూసి ముఖం చిట్లించింది. ఇంటికి వచ్చినా తనని పలకరించకపోవడం కులపతికి కుతకుతలాడింది.

"ఖానోజీ లేడా ?"

"పొలంలో వున్నారు."




---

"మళ్ళీ నడక వచ్చిందన్నమాట.. వుద్దండుడు... ఇదంతా నీ చలవేలే... అరె సమయానికి లేకుండా పోయాడే?" ఓ వంద చేబదులు కావాలి. సాయంత్రం పంపేస్తాను.''

"........."

"నువ్వు కాదనవనే వచ్చాను."

"పొలం వెళ్ళి చీటీ రాయించుకుని రండి. అప్పుడిస్తాను."

"అంటే నామీద నమ్మకంలేదా ? లేక నీ మొగుడికి తెలియకుండా ఏమీ చెయ్యవా ?" అడిగాడు వెటకారం చూపు విసిరి.

"కరణం !" గర్జించింది ముందుకువచ్చి.

"ఏం అంత పతివ్రతవా ?" హేళనగా అన్నాడు.

"నా పాతివ్రత్యాన్ని నీలాంటి చవటముందు రుజువుచేసుకోనక్కర్లేదు. ఈ ఇంటికి పదే పదే ఎందుకు వస్తున్నావో నాకు తెలియకపోదు. కుక్కని ఈ గుమ్మాన కొడితే మరో గుమ్మాన వస్తుంది. అలాంటి రకం నువ్వు...ఛీ..." విసురుగా తలుపేసేసింది

కులపతిని అవమానం అగ్నిలా దహించివేస్తున్నది. వడిగా తోటదాటి రోడ్డు ఎక్కాడు. ఇంతటి అవమానం ఎప్పుడూ ఎక్కడా పొందలేదు.

గుణపాఠం చెప్పవల్సిందే !

సత్రవు దగ్గర మొక్కజొన్నలు కాలుస్తూ ఎల్లమంద కనిపించాడు. "ఈ అవతార మేమిట్రా ?" కులపతి అడిగాడు.

"ఆ యమ్మ నవుకిరీ లాగేసింది కదా ! ఇవి కాల్చి యిస్కూలు పిల్లలకి అమ్ముతున్నా."

"అది నీకూ చెయ్యి పెట్టిందా ?"

"ఎంతకయినా తగింది కర్షంగోరూ."

"ఆనక నాకోసారి కనిపించు...దాని యవ్వారం తేల్చేద్దాం."

ఎల్లమంద తలూపాడు.

* * *

"రా...వదినా!" పాపాయి బియ్యం చేటలో పోసుకుని ఏరుతూ చేట ప్రక్కకి పెట్టి లేచింది సత్యవతిని చూసి. సంబంధం ఫలహారం చేస్తున్నాడు మంచం మీద కూర్చుని.

"ఎప్పటికప్పుడే అయిపోతోంది రావడానికి ?" సత్యవతి లోపలికి వస్తూ అన్నది.

పాపాయి లోపలికి వెళ్ళింది.

"కొట్టు తియ్యలేదా ?"

"ఏలూరునుంచి యిప్పుడే వచ్చాను మందులు తీసుకుని. వెళ్ళబోతున్నాను. వచ్చారు."

పాపాయి పెద్ద స్టీలుపళ్ళెంతో పులిహార, మంచినీళ్ళచెంబు తీసుకువచ్చింది. "అంతే...మూడొంతులు తీసెయ్...ఇప్పుడే టీ త్రాగాను "

"తీసుకో అక్కా! చాలా బాగా చేశాను జీడిపప్పువేసి "

"బిర్యానీ చెయ్యమంటే పులిహార చేసింది" అన్నాడు సంబంధం.

"ఇరి చేసేసరికే తాడుతెగింది." పాపాయి ఆయాసపడుతూ కూర్చుంది.

సత్యవతి చాలభాగం మరోప్లేటులోకి తీసివేసి స్పూన్‌తో తినసాగింది.

సంబంధం అన్నాడు. "వండలేని అమ్మకు నొప్పులు మెండు తేలేని అయ్యకు తిండి మెండు."

"ఇలా అంటే మా అమ్మదగ్గరకి వెళ్ళిపోతాను."

"ఎందుకూ? తోచీతోచనమ్మ తోటికోడలి పుట్టింటికి వెళ్ళిందట."

పాపాయి సత్యవతికేసి తిరిగింది. "ఎలావుందో నువ్వుచెప్పు వదినా ?"

సంబంధం చెయ్యకడుక్కుందుకు లేచాడు. వంటింటి తలుపు తీసివుంది. కుక్క నాలుక తెరచుకొని రావానికి చూస్తోంది

"పాపాయ్! ఆ తలుపులుతీసి యిక్కడ కబుర్లు చెబుతున్నావు. బాత్‌రూం మాత్రం తాళంవేసి బంధించావు. నీ లాంటివాడే నేతికుండ నేలమీదపెట్టి వుత్తకుండ వుట్టిమీద పెట్టాడుట." అన్నాడు తలుపు వేసి వస్తూ.

సంబంధం మారాడు. వేరు కాపురం పెట్టగానే శాంతమొచ్చింది. పాపాయిని ఓదార్పుతో భరించడం నేర్చుకున్నాడు. ఆమెవల్ల ఉద్యోగం పోయినా ఒకరిమీద ఆధారపడ నక్కర్లేకపోయింది. ఏలూరు వెళ్ళినప్పుడు అతడి రెండో అన్నయ్య కనిపించాడు. సంబంధం పలకరించలేదు. వాళ్లంతా తనకేదో ద్రోహం చేసినట్లు భావించాడు. తనకెవరూ బంధువులు లేరనుకున్నాడు. అందుకే ఆలివంకవారు ఆత్మబంధువులు, తల్లివైపువారు తగినవారు, తండ్రివైపువారు దాయాదులు.

కాస్సేపు మాట్లాడి సంబంధం వెళ్ళిపోయాడు. సత్యవతి సాయంత్రందాకా వుంది. పాపాయి బుద్ధిగా సంసారం చేసుకోవడం ఆమెకి సంతోషంగా వుంది.

సత్యవతి ఇంటికి వచ్చేసరికి సంధ్య వాలుతోంది. అరుగుమీద భానోజీ, పౌరోహిత్యుడు కూర్చుని ఉన్నారు. సత్యవతి పెరటి గుమ్మంద్వారా యింట్లోకి వచ్చింది.

"ఈ రాత్రికే దివ్యమైన ముహూర్తం వుంది...కానిచ్చేద్దాం," అంటున్నాడు పురోహితుడు.

సత్యవతిలో సెలయేటి గలగల.

"అలాగే...మీరు పెందరాళే వచ్చెయ్యండి."

భానోజీ గదిలోకివచ్చి తెలియజేశాడు. సత్యవతి మాట్లాడలేదు. బుగ్గమీద చిటికవేసి వెళ్ళిపోయాడు

ఇంకా యిక్కడ తన నాటకం కొనసాగించలేదు. ఈ రోజుయినా భానోజీతో నిజం చెప్పివేయాలి. రాజీవ్ చదువయిపోయింది. తనకిక సమస్యలేదు భానోజీ అర్థంచేసుకుంటే సరి లేకపోతే తనదారి తనకు ఎలాగూ వుంది. ఏం చెయ్యాలో అప్పుడు చూసుకోవచ్చు.

"అమ్మాయ్ తలంటు పోసుకుందువుగాని రా!" బుచ్చమ్మ పిలిచింది.

భానోజీ భోజనం ముగించి హాల్లోకి వచ్చాడు. అవతలిగదిలో ముత్తయిదువుల సంభరం వినిపిస్తోంది. నిషేకాన్నికి గదిని అలంకరిస్తున్నారు. భానోజీకి పూల

రథంమీద వూరేగుతున్నట్లు వుంది. వెచ్చటి కోరికలు పరవశింపచేస్తున్నాయి. చుట్ట వెలిగిస్తూ వీధిలోకి వచ్చాడు

దాసు పరుగుమీద వచ్చాడు.

"అయ్యగారూ! మన కుప్ప దోచేస్తున్నారు."

ఖానోజీ చుట్ట విసిరేసి "ఎవరికొచ్చింది పొయ్యేకాలం ?" అడిగాడు.

"ఆళ్ళెవరో తెలియలేదయ్యా!"

ఖానోజీ బ్యాటరీ లైటు తీసుకుని కర్రతో బయలుదేరాడు. దారిలో పల్లెగూడెం నుంచి మరో నల్గుర్ని తీసుకెళ్ళాడు. దూరంగా కుప్ప దగ్గర చిన్నదీపం వెలుగు, మనుషుల అలికిడి వినిపించింది. ఖానోజీ పరుగుతీశాడు చేలుకడ్డంపడి.

"ఎవర్రా?" దూరాన్నుంచి అరుస్తూ దూసుకెళ్ళాడు.

వాళ్లు భయపడలేదు. తమపని కానిస్తున్నారు. ఖానోజీ మనుషులు యింతలో వచ్చి కలిసారు. కర్రలు ఎగిరినై. మాటలు చేతుల్లోకి దిగాయి.

ఎవరో ఖానోజీని త్రోశారు సైడుకాలువకి అడ్డంగా పడ్డాడు. బల్లెం వచ్చి గుండెల్లో దిగింది. ఖానోజి వెర్రికేక పెట్టాడు.

ఊళ్లోకి తీసుకువస్తుంటే ఖానోజీ కన్నుమూశాడు. ఈ వార్త తక్షణం వూరంతా వ్యాపించిపోయింది అందరూ ఖానోజీ యింటికి రాసాగారు.

ఇప్పటిదాకా సత్యవతి ఒకరకంగా భయపడుతూన్నది. ఖానోజీ మరణ వార్తకి చలించిపోయింది. ఇద్దరి మధ్యా ఏలాంటి అనుబంధం లేకపోయినా, భౌతికమయిన స్నేహంవల్ల, జరిగిన దారుణానికి విలపించింది.

పోలీసులకి కబురు వెళ్ళింది తెల్లవారుతుండగా వచ్చారు. స్టేట్‌మెంట్ తీసుకుని మధ్యాహ్నం కదిలారు. సంబంధం, సప్తగిరి అన్నివిధాల సాయపడ్డారు.

సాయంత్రం కులపతి వచ్చాడు. సత్యవతి మాట్లాడలేదు.

"ఖానోజీకి అప్పుడే నూరేళ్ళు నిండిపోవడం, నాకు చాలా విచారంగా వుందమ్మాయ్. ఏమయినా దౌర్జన్యం పెరిగిపోతోంది.

" ... ... ... ... ... "

"పోలీసు రిపోర్ట్ యిచ్చి మంచిపని చేశావ్. ఈ విషయంలో నేనుకూడా సాయపడతాను నీకు." కులపతి వెళ్లబోతూ అన్నాడు.

"ఎవరు చేశారో...చేయించారో నాకు తెలుసు. నెమ్మదిగా అన్నీ బయట పడతాయి. నీ సాయం నాకు అనవసరం. ఈసారి గుమ్మం ఎక్కితే మర్యాద దక్కదు."

కరణం చిన్నముఖం చేసుకుని వెళ్ళిపోయాడు.

ప్రయాణం సిద్ధంచేసుకున్న సత్యవతి దీనితో ఆగిపోవాల్సి వచ్చింది. ఈ పరిస్థితిలో ఎక్కడికీ వెళ్ళడం కుదరదు.

వ్యక్తిజనితమైన జీవితం దాని దిశల ప్రగతి కాలానికి విలోమానుపాతంలో వున్నప్పుడు తిమిరంతో సమరం తప్పదు. ఇట్స్ రేసింగ్ ఎగినెస్ట్ టైం.

## 8

ఆరాత్రిసత్యవతికి ఎంతకీనిద్రపట్టలేదు.మనసు నిండాఆలోచనలు,సందేహాలు. పరిస్థితులు చక్రబంధంగా వున్నాయి. భయపడిన అవాంతరం...ఖానోజీ కథ విషాదవంతంగా ముగిసింది. ఆ మార్పుని తను వూహించలేదు. నిజం ఖానోజీతో చెప్పి వెళ్ళిపోదామనుకుంది. ఆ అవకాశం లేకుండాపోయింది. ఖానోజీతో తన కేంసంబంధం లేకపోవచ్చు. కాని ఆ స్నేహాన్ని కాదనడానికి వీల్లేదు. తన కోసం ఎంతో చేశాడు. ఎంతగానో మారాడు. తను చెప్పినట్లే విన్నాడు. ఇక తన కీ యింటితో పూర్తిగా సంబంధం తీరిపోయింది. తను రాజీవ్‌ని కల్సుకునే మంచిరోజు అతి దగ్గరలోనే వుంది.

రాజీవ్ గుర్తుకాగానే మనసు తీయగా మూల్గింది. దూది బస్తాలమీద పరుగు తీస్తున్నట్లుంది. ఎన్నో కలలు...కలవరింతలు! తనూ, రాజీవ్ కల్సుకునే 'రేపు' పై తీయ తీయని ఆశలు.

గాలి శూన్యంకేసి పయనిస్తుంది. నీరు పల్లానికి పరుగుతీస్తుంది. మనస్సు సుఖాల కోసం ఆరాటపడుతుంది. ఇవి ప్రకృతి ధర్మాలు.

సత్యవతికి నిద్ర పట్టలేదు. బెడ్‌లైట్ కాంతిలో గడియారం చూసింది. పన్నెండుంపావు. సత్యవతి బాత్‌రూం కేసి నడిచింది. ఇంతలో కరంటు ఫెయిలయింది. చీకటి ... నల్లటి చీకటి ... ఆకాశంలో చుక్కలు మాత్రం రెపరెప లాడుతున్నాయి. చలిగాలి వీస్తోంది. ఎడ్ల మువ్వల ధ్వని లయబద్ధంగా వినిపిస్తుదిం. ఇంతలో మాటలు వినపడటంతో ఆగిపోయింది.

"ఏ గదిలో వుందో చూడండి. ఎక్కడికి పోతుంది...ఉత్తగా వెళితే కర్ణం చంపేస్తాడు. సత్యవతమ్మ కోసం పడి ఛస్తున్నాడు."

అది ఎల్లమంద కంఠమని గుర్తించింది. వీళ్లని కర్ణం పంపాడన్న మాట. వీళ్ల రాక్షసత్వం ముందు తను నిలబడలేదు. పోరాడలేదు. తను బాత్‌రూంలోకి రావడం మంచిదే అయింది. కాస్సేపట్లో వాళ్లు యిలా రాకపోరు. ఈ లోగా తప్పించుకోవాలి.

సత్యవతి చీకటిలో కల్సిపోయింది. గడ్డివాము ప్రక్కనుంచి అవతలి తోటలోకి వెళ్ళింది. చీకటికి ఆమె భయపడటంలేదు. ఆ రాక్షసులను తప్పించుకోవాలి. దారి కనిపించడంలేదు. బురదలో జారిపడింది కూడానూ! ఎటు పోతోందో, ముందు ఏముందో తెలియడంలేదు భయం పీడించివేస్తోంది. తను గదిలోనే వుంటే ఏమయ్యేది?

సత్యవతి కాలువగట్టు మీదకి వచ్చింది వంతెన దగ్గర దీపం వెలుగుతోంది. మనుషులు మాత్రం లేరు. వంతెన దాటి వూర్లోకి వచ్చింది.

తన కోసం వాళ్లు అంతా గాలిస్తూంటారు ఇప్పట్లో వెళ్లడం తనకి క్షేమం కూడా కాదు సత్యవతి దేవాలయం దగ్గరవున్న సత్రవు అరుగుమీద నించుంది.

వాన ప్రారంభమైంది. వురుములూ, మెరపులూ! ఆ ప్రకృతి బీభత్సం ఆమెని కలవరపెట్టడంలేదు. గండం గడిచినా వణకుపోలేదు

సత్రవు అరుగులపై ముష్టాళ్ళు, సాధువులు పడుకుని వున్నారు. వానకి అందరూ లేచి పోయారు. పై కప్పు చిల్లుది కావడంవల్ల వాన పడుతోంది. సత్యవతి మీద పడింది వారి దృష్టి. ఎవరు? ఏ వూరు? ఎందుకొచ్చావు? అన్న ప్రశ్నలతో విసిగించారు. సత్యవతి తన అంతస్థు గుర్తు తెచ్చుకుంది. మరొకప్పుడయితే వాళ్లని ఛీదరించుకునేదే? నోర్మూయించేదే? తను ఆపదలో వుంది. వీరితో యిప్పుడు విరోధపడితే తనకే నష్టం. ఎల్లమంద మనుషులు యిటువైపు వస్తే వీళ్ళు తన గురించి చెప్పవచ్చు.

పొరుగూరని చెప్పింది. నమ్మేలా నాలుగయిదు కబుర్లు చెప్పింది. వాన మరీ ఎక్కువవడంతో అందరూ నోర్మూసుకున్నారు. ప్రచండమైన గాలి...దాం మంటూ వురుములు సత్యవతి మూడుగంటల సేపు అక్కడే వుండిపోయింది.

తెల్లవారబోతోంది. కోళ్ళు కూస్తున్నాయి. వర్షం పూర్తిగా వెలిసింది. ఇక అక్కడ వుండటం అనవసరమని సత్యవతి యింటికి నడిచింది.

ప్రమాదం జరగనందుకు బుచ్చమ్మ సంతోషించింది. వెంటనే సత్యవతికి వేడి వేడి కాఫీ యిచ్చింది. "ఎవరో పిలిచారని తలుపు తీసానమ్మాయ్...అంతే వాళ్ళు నన్నూ పాపాయిని పిది గదిలో పెట్టి తాళం వేసారు...ప్రొద్దుట దాసు తీసేదాకా తెలియలేదు..." అంది కంగారుగా బుచ్చమ్మ.

కాఫీ త్రాగుతూ సత్యవతి "యింట్లో సరకు లేమయినా పోయాయా?" అనడిగింది.

"ఏం పోలేదు."

వాళ్ళు దొంగలు కాదు. తన కోసం వచ్చినవాళ్ళు.

మధ్యాన్నం సప్తగిరి వచ్చాడు. "మీరు జాగర్తగా వుండాలి. మీకు అభ్యంతరం లేకపోతే రాత్రిళ్ళు నేను బయట పడుకుంటాను సాయంగా."

"థాంక్స్."

వారం రోజులు గడిచాయి. ముసురు మూలంగా సత్యవతి కేంతోచలేదు. పైగా భయపడిన మనస్సు ఆ చీదర వాతావరణంలో మరింత కృంగిపోయింది.

ఆ పూట బాగా ఎండ వచ్చింది. మధ్యాన్నం భోజనాలయ్యాక పాపాయి, సంబంధం వచ్చారు. టౌనులో సర్కస్ చూడడానికి వెళుతున్నారు. సత్యవతిని కూడ రమ్మన్నారు రిలీఫ్‌గా వుంటుందని బయలుదేరింది.

ఐస్ పార్లర్ దగ్గర సప్తగిరి కూడ కనిపించాడు.

"రండి మీరు కూడ, కంపెనీగా వుంటుంది." సత్యవతి ఆహ్వానించింది.

మొదటి ఆట సినిమా కూడ చూసి యింటికి వచ్చేసరికి పదకొండయింది. అటరిసీ భోజనాలకి వుండిపొమ్మంది సత్యవతి.

'దాసూ !' దూరాన్నుంచే పిలిచింది సత్యవతి, లేచి లైటు వేస్తాడని దాసు పలకలేదు. సప్తగిరి తడుముకుంటూ వీధిలో లైటు వేశాడు.

తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. అందరి గుండెలు గుబగుబ లాడాయి. పరిశీలిస్తూ లోపలికి వచ్చారు. బుచ్చమ్మ మంచానికి కట్టబడి వుంది. 'అమ్మా' అంటూ పాపాయి ఏడవడం ప్రారంభించింది. సంబంధం ఆమె కట్లు విప్పాడు.

సంబంధం, సప్తగిరి అన్ని దీపాలు వేసి వెతికారు. అన్ని తలుపులూ తీసి వున్నాయి. దాసు పెరట్లో కొబ్బరి చెట్టుకి కట్టబడి వున్నాడు.

ఇంట్లో దొంగలు పడ్డారు.

విలువైన ప్రతీ వస్తూవూ దోచుకోబడింది. దాసు వాళ్ళని గుర్తుపట్టలేక పోయాడు. ఎదురు తిరిగి దెబ్బలుతిన్నాడు.

అందరూ మతిపోయినవాళ్లలా చాలాసేపు బొమ్మల్లా కూర్చున్నారు. బుచ్చమ్మ కాఫీలు కాచి తెచ్చింది. సత్యవతి యినప్పెట్టి గదిలోకి వెళ్ళింది. ఐరన్ బాక్స ఖాళీ! తాకట్టు వస్తువుల అర వెలవెలబోతోంది. నిలువుదోపిడీ జరిగి పోయింది.

"ఈ చర్యకూ కరణమే కారణమా ?" సత్యవతి వితర్కించుకుంది. దుర్మార్గుడు, తనని లొంగదీసుకోడానికిలా పథకాలు వేస్తున్నాడన్నమాట.

"పోలీసుల్ని పిలిపిద్దామా ?" సంబంధం అడిగాడు.

సత్యవతికాని, సప్తగిరికాని దానికి ప్రోత్సాహం చూపించలేదు.

తెల్లన తెల్లవారింది. వూరంతా ఈ వార్త అందుకుని పరామర్శకి వచ్చింది. తాకట్టులవారు లబోదిబో మన్నారు.

"ఆ పత్రాలున్నాయి. ఎవరికీ అన్యాయం జరగదు" అని సత్యవతి హామీ యిచ్చింది.

రోజొక యుగంలా కదులుతోంది. ఈ భయంకర పరిస్థితులనుంచి పారిపోదా మనిపిస్తోంది సత్యవతికి. ఈ పరిస్థితిలో తన ప్రాణానికి రక్షణ ఏముంది ? ఏ క్షణం ఏం జరుగుతుందోనని గుండె అరచేత పెట్టుకోవాల్సి వస్తోంది.

పిరికిపందలా తప్పుకుపోడానికి ఆమె కిష్టంలేదు. ఈ సంక్షోభానికి కారణం కులపతి. అతడికి తనపై ఆశ. ఆ బలహీనతతో తను పబ్బం గడుపుకోవాలి. కులపతిని మంచి చేసుకోవాలి. ఏరు దాటాక తెప్ప తగలెయ్యాలి !

తన కార్యక్రమాన్ని పదే పదే సమీక్షించుకుంది.

అగ్నిశిఖరాలమీద ఆశగా పయనిస్తూ జీవితాన్ని బలిపీఠం ఎక్కించి కత్తుల ఒరలో కాలక్షేపం చేస్తూ యాత్ర సాగిస్తూ వచ్చింది. ఇది దారి కాదని ఆమెకి తెల్సు. తప్పటడుగు పాకురాళ్లమీద పడితే పతనమేనని తెల్సు. యుగయుగాల స్త్రీత్వం యొక్క సాహసం చలనం, జిగీష ఆమె కర్తవ్యాన్ని నిర్దేశించాయి. అందుకే తిరోగమనానికి ఆఖరి చీటీవ్రాసి పురోగమనాన్ని ప్రేమించి తన దారి గవేషణ చెయ్యడానికే ఈ సమరం. సవనం. సరంభం.

కులపతిని పిలుచుకురమ్మని దాసుని పంపింది.

కులపతి మీసాలు దువ్వుకుంటూ వచ్చాడు సత్యవతి తన చేతిలో బొమ్మ. తను ఆడించినట్లు ఆడుతుంది. ఎదురుతిరగాలనుకుని బోర్లాపడింది.

సత్యవతి గదిలోకివచ్చి కూర్చున్న కరణాన్ని చూసింది. పలకరింపుగా డ్రెస్సింగ్‌టేబిల్ దగ్గర తలచిక్కు తీసుకుంటూ, ఐబ్రోపెన్సిలోతో దిద్దుకుని బీరువాపై డీసీయం చీర అందుకుంది. అవతల గదిలోకి వెళ్ళి తలుపులు కొద్దిగా వేసింది.

బ్లౌజ్ తీసివేసింది. చీర విప్పింది. కులపతి తొంగిచూస్తున్నాడు. తెల్లటి లంగాలో, నిమ్మపండు రంగు చోళీబ్రాలో యిమడలేని ఎత్తైన రొమ్ములపై కదలాడుతున్న లాకెట్‌ని చూసి గుటకలు మింగాడు.

సత్యవతి చీరకట్టుకుని వచ్చి కూర్చుంది. పాపాయి వేడి సాంబారు, యిడ్లీలు తెచ్చి టేబిల్‌మీద పెట్టింది. కాఫీపాట్ దగ్గరగా పెట్టి వెళ్ళిపోయింది.



"ఇవి నా ఆకలి తీర్చలేవు." కులపతి యిడ్లీ తింటూ ఓరగా చూశాడు.

సత్యవతి తన కోపాన్ని బయటపెట్టలేదు. సున్నితంగా నవ్వుతూ "మీకు కావల్సింది నాకుతెల్సు. నాకు కావల్సింది చూస్తే..." తటస్థంగా ఆపింది.

"ఏం కావాలో చెప్పు నా వల్ల ?" కరణం ముందుకు వంగాడు.

సత్యవతి కాఫీ త్రాగుతూ సోఫాలో వెనక్కి జార్లబడింది. "ఖానోజీ హత్యకి, దొంగతనానికి కారణమైనవారిని పట్టివ్వడం..."

"అది నాకు క్షణాలమీద పని."

"ఇల్లు మినహాగా మిగతా ఆస్తి అమ్మేస్తాను. తొందరగా బేరం చూడాలి."

కులపతి చుట్ట వెలిగించాడు. "ఇవి చేసిపెడితే నాకు ప్రతిఫలం ?"

"దండిగానే ముడుతుంది."

"నాకు డబ్బు అక్కర్లేదు. నువ్వు కావాలి సత్యా." సూటిగా చెప్పేశాడు.

* * *

పోలీసులు వచ్చారు. ఎల్లమంద యిల్లు సోదా చేశారు. ఖానోజీ యింటిలోని వస్తువులు కొన్ని దొరికాయి.

"వీడేనండీ ఆయన్ని చంపివేస్త. ?" యస్.ఐ. దగ్గరకి వచ్చి కులపతి చెప్పాడు.

"మీకెలా తెల్సు ?"

"ఆ దొండపాదు క్రింద త్రవ్వండి, మీకే తెలుస్తుంది."

పోలీసులు అక్కడ త్రవ్వి చూడగానే రక్తంగుడ్డలూ, రక్తంలో తడిసిన బల్లెమూ, కత్తీ కనిపించాయి.

ఎల్లమందని అరెస్ట్‌చేసారు.

ఎల్లమంద వ్యాన్ ఎక్కుతూ గర్జించాడు. "నాకే చేతులు పెడతావా? రానీ... నీ అంతుచూస్తా... ఎల్లమందంటే ఏమిటో చెప్తా."

కులపతి తన రెండవ కార్యక్రమం ప్రారంభించాడు. పొలం అమ్మకం క్లిష్టమే అయింది. మార్కెట్ మందంగావుంది. సీలింగ్‌వల్ల వున్నవాళ్ల భూముల కేసి రావడంలేదు. సామాన్యులు అంతటి ఆస్తిని ఎక్కడ కొనగలరు?

రెడ్డినాయుడే కనిపించాడు. రెడ్డినాయుడుకి సప్తపది దాటుతోంది. కాంట్రాక్టుల వ్యాపారమే కాకుండా రాజకీయ వ్యాపారం కూడా వుంది.

"ఎకరం పదివేలకే యిస్తాను." అని ఆశపెట్టాడు కులపతి.

మంచి బేరం వదులుకోవాలనిపించలేదు రెడ్డినాయుడికి. అయినా బెట్టగా "ఇంకా నాకు పొలమెందుకయ్యా. అయినా... ఆవిడ్ని ఓసారి తీసుకురా. అవసరమైతే ఆలాగే పుచ్చుకుంటాను... తప్పుతుందా మరి?" అన్నాడు.

మర్నాడు సత్యవతిని తీసుకువెళ్ళాడు.

రెడ్డినాయుడు వేడి వేడి జున్ను తెప్పించాడు. రాత్రే గేదె ఈనింది. కులపతి తినబోతూండగా 'తాసీల్దారు' వచ్చాడని గ్రామనౌకరు కబురు తెచ్చాడు.

"ఈ ఆఫీసర్లు చంపేస్తున్నారయ్యా ... యిప్పుడే వస్తాను," అంటూ పరుగెత్తాడు.

"తీసుకో అమ్మాయ్... అన్నట్లు ఈ శనీశ్వరుడు నీకెలా తగిలాడు? వీడు పట్టుకున్నాడంటే పచ్చటి చెట్టయినా మాడిపోతుంది.''

కరణంవల్ల పొందిన బాధలన్నీ చెప్పుకుంది.

"మరి నాతో యిప్పటిదాకా ఎందుకు చెప్పలేదు? ఇప్పటికయినా మించి పోయిందేమిటిలే? నీ పొలం నేను కొంటాను. మధ్యన ఆ దలారి వెధవ ఎందుకులే ... వాడ్ని కూడా ఓ పట్టు పట్టమంటావా, తిరిగి లేవకుండా?"

సత్యవతి ముఖం వికసించింది. కొండంత అండ దొరికినట్లయింది. "ఆ పని చేస్తే మీ ఋణం వుంచుకోను బాబయ్యగారూ,'' అంది చేతులు జోడించి.

"తప్పకుండా చేస్తానమ్మాయ్. నీ వో చిన్నపని చేసిపెట్టాలి ... తర్వాత చెప్తాలే నిశ్చింతగా యింటికివెళ్లు. కులపతి సంగతి నేను చూసుకుంటాను."

సత్యవతికి యిరుకు గదినుంచి బయట పడ్డట్టయింది.

* * *

రెడ్డినాయుడు అన్న మాట నిలబెట్టుకున్నాడు. పొలం మార్కెట్ రేటు ప్రకారమే కొన్నాడు. సత్యవతి అప్పులు తీర్చివేసి మిగతాది బ్యాంక్ చేసింది. ఇల్లు పాపాయికి రాసిచ్చింది.

కులపతి అరెస్టయ్యాడు. ఇంట్లో కవుంటర్ ఫీట్ కరెన్సీ దొరికిందని వూరంతా గుప్పుమంది. సత్యవతి ఆనందానికి అంతంలేకుండా పోయింది. తన మీద తనకే గర్వంవేసింది. తనని కబళించాలనుకున్న ఎల్లమంద, కరణం తమ గోతుల్లో తామే పడ్డారు. తను వాళ్ళ వూబినుంచి బయటపడింది. సత్యవతికి ఆ రోజంతా రోహిణి ఎండల్లో బాధలు పడ్డాక తర్వాత వచ్చిన తొలకరిలాగుంది.

సాయంత్రం రెడ్డినాయుడు మనిషి వుత్తరం తీసుకువచ్చాడు. సత్యవతి ఆత్రంగా విప్పింది. 'రేపు మధ్యాహ్నం ప్రయాణం. సిద్ధంగావుండు.'

"నేను రెడీగానే వున్నానని చెప్పు" ఆ మనిషితో అన్నది.

రెడ్డినాయుడికి తనతో ఏం పని? ఎక్కడికి తీసుకువెళతాడు? ఇదేదో విపరీతానికి దారితీయదుకదా! ప్రవాహం ఎదురీది గట్టు చేరబోతుండగా కెరటాలకి బలికాదు కదా!

సత్యవతి కలవరాన్ని తమాయించుకుంది. పరిస్థితిని అధిగమించే చొరవా, తెలివీ తనకున్నాయని సర్దిచెప్పుకుంది.

సాయంత్రం నీరెండలు పడుతున్నాయి. పెరటివైపున గచ్చుపడిమీద ఈజీ ఛైర్‌లో కూర్చుంది. మనస్సంతా ప్రశాంతంగా వుంది. రేపు రెడ్డినాయుడుతో బయలుదేరుతుంది. మళ్ళీ యిలా రావడం ఎందుకు? ఏకంగా అటునుంచే రాజీవ్ దగ్గరకి వెళ్ళిపోతే సరి. రాజీవ్ చదువు పూర్తయి వుంటుంది. ఎక్కడ పెట్టాడో ప్రాక్టీసు? తను తీసుకున్న రిస్క్ తెల్సుకుంటే నిశ్చేష్ఠుడవుతాడు.

ఆ యింట్లో తన అనుభవాలు దశల దశలగా జ్ఞాపకం వస్తున్నాయ్. మొదటి రోజున ఎంతో భయపడిపోయింది. ఈనాడు అదంతా కలగా కనిపిస్తోంది.

పదకొండు గంటలకి రెడ్డినాయుడు కారు తీసుకువచ్చాడు. సత్యవతి ఎక్కగానే బయలుదేరింది. చెరువు దాటుతూండగా జీపు ఎదురయింది. రెడ్డినాయుడు కారు చూడగానే జీపు డ్రైవర్ ఆపమని సైగచేశాడు. రెడ్డినాయుడు జీపు దగ్గరికి వెళ్లాడు. పావుగంటయినా వాళ్ళ కబుర్లు తెమల్లేదు.

సత్యవతి గోళ్లు గిల్లుకుంటూ 'విండో' నుంచి చూస్తూ కూర్చుంది సప్తగిరి సైకిల్ మీద వస్తున్నాడు. అతడ్ని నిన్నటినుంచీ కలుసుకుందామనుకున్నా కుదరలేదు. సత్యవతి చప్పట్లుకొట్టి పిలిచింది.

"మీరా ?" సైకిల్ స్టాండువేసి కారుదగ్గరకు వచ్చారు.

"జ్ఞాపకముంచుకోండి...ఈ వూళ్లో నాకు మీరు మంచి స్నేహితుడిగా పరిచయమై నన్ను ఆదుకున్నారు. ధన్యవాదాలు." అన్నది ఆకుపచ్చటి చేలు గాలికి కెరటాల్లా ఎగరడం చూస్తూ.

"తిరిగిరారా ఏమిటి ?"

రెడ్డినాయుడు హడావిడిగా వచ్చేశాడు.

"లెటర్ ఫాలోస్." గాలిలోకి చెయ్యి వూపింది.

కారు ముందుకురికింది. రెడ్డినాయుడు చుట్ట వెలిగించబోయి 'అభ్యంతరమా?' అని అడిగాడు. సత్యవతి కాస్త దూరం జరిగి కాల్చుకోమంది.

"కరణం కొడుకు మంచివాడేస్మీ. రెండు మూడుసార్లు వుద్యోగం కోసం వచ్చాడు నా దగ్గరకి. ఏం చెయ్యలేకపోయాను పాపం. నువ్వు క్లోళ్ళఫారం పెట్టించావట ?"

"అది అందరికీ తెల్సిన విషయమే...కరణాన్ని ఎలా జైలుకు పంపారో చెప్పలేదా ?"

రెడ్డినాయుడు తమాషాగా నవ్వాడు. "అదా ? కట్టలు వాడింట్లో పెట్టించి రిపోర్టుచేశాను. మనవాడు యిప్పట్లో ఆ వూబినుంచి బయటికి రాడులే."

విజయవాడ చేరుకునేసరికి ఆరయింది. రెడ్డినాయుడు తన లాయర్ యింట్లో సత్యవతిని దింపి వెళ్ళిపోయాడు. తొమ్మిదింటిదాకా చూసి సత్యవతి భోంచేసి పడుకుంది. రెండుగంటల ప్రాంతంలో రెడ్డినాయుడువచ్చి లేవగొట్టాడు. 'త్వరగా రావాలి...యిప్పటికే లేటయింది. మనం తెల్లారేసరికి హైదరాబాద్‌లో వుండాలి."

నిద్రకళ్ళతోనే కార్లో కూర్చుంది. రెడ్డినాయుడు చెప్పేదేం ఆమె వినలేదు. వార్కృట్‌పల్లిలో 'చాయ్'కి లేపినా ఆమె లేవలేదు.

హోటల్‌గదిలో పన్నెండుగంటల ప్రాంతంలో సత్యవతి డైలీ తిరగ వేస్తూండగా రెడ్డినాయుడు వచ్చాడు, పర్వతాలరావుతో. పర్వతాలరావు పేరుకుతగ్గ మనిషి. పది వేళ్లకి పది వుంగరాలు వున్నాయి. మెడలో ఖరీదైన పులిగోరు వుంది.

ముగ్గురూ లంచ్ తీసుకున్నారు. భోజనం కాగానే రెడ్డినాయుడు హడావిడిగా వెళ్ళిపోయాడు. పర్వతాలరావు సిగరెట్ పడేసి సత్యవతిని దగ్గరకు లాక్కున్నాడు. సత్యవతి అవాక్కయిపోయింది. పర్వతాలరావు రెండుచేతుల తోనూ దూదిలాంటి ఆమె నడుము పట్టుకుని వక్షంపై పెదాలతో తడిమాడు. ఆ సుకుమారం, లాలిత్యం కసిపించాయి.

సత్యవతి విదిలించింది బట్టలు సరిచేసుకుంది.

"ఏమిటి పిల్లా బెక్కుపోతున్నావు. నాయుడేం చెప్పలేదా ? దొంగముండా కొడుకు, నిన్ను ఎరపెట్టి పదిలక్షలు టెండర్ పట్టుకుపోయాడు."

సత్యవతికి అర్థమైపోయింది. రెడ్డినాయుడు కూడా కాలనాగే. వాడి మంచి తనం వెనకాల ఘోరమైన స్వార్థం వుంది. అందుకే తనకి సాయపడ్డాడు.

స్త్రీ యుగయుగాలనుంచి మగవాడి కోరికలు తీర్చే పరికరంగా భావింప బడుతోంది. సాంఘికంగా ప్రగతి వేస్తున్నా రాజమార్గాలు అందుకుంటున్నా తెరవెనక తతంగం మామూలే ఇది యుగయుగాల తీరని ఆకలి. చలనంలేదు. జ్వలనంలేదు. నదులు సముద్రంలో కల్సి తమ చరిత్రని పోగొట్టుకుంటాయి. వ్యక్తుల సంస్కృతి ఈ సుడిగుండాల్లోపడి ఖరాబవుతుంది.

"అదా !...పట్టపగలేనా...దానికి రాత్రంతా వుంది. నడవండి ఎగ్జిబిషన్ చూసివద్దాం." నవ్వేస్తూ అంది. యుక్తి కాపాడాలి తనని శక్తికంటే.

"అలా అన్నావూ బావుంది." పర్వతాలరావు ప్లీజయ్యాడు. సత్యవతి నవ్వుకి పరవశించిపోయాడు. టాక్సీకి ఫోన్ చేశాడు

ఎగ్జిబిషన్‌లో పర్వతాలరావు సత్యవతికోసం అవీ-ఇవీ చాలా కొన్నాడు. డబ్బు లెక్కలేని మనిషనుకుంది. ఆమె ప్రతిక్షణం ఎంతో జాగ్రత్తగా ఆలోచిస్తోంది. ఇది చివరి అంచు. ఆఖరి మజిలీ. పర్వతాలరావు ఆమెని క్షణం కూడా వదలలేదు. తప్పించుకోడానికి మార్గాలు అన్వేషించసాగింది. ఎక్కడా వీలుపడలేదు. సాయంత్రం అతడితోబాటు కారు ఎక్కవల్సివచ్చింది.

పర్వతాలరావు ఎక్కగానే ఎవరో పిలిచారు. పర్వతాలరావు అతడితో ప్రక్కగా వెళ్ళాడు. సత్యవతి మనసు వేగిరం పనిచేసింది. డ్రయివర్ని పోనిమ్మని ఆదేశించిందే కారు ముందుకురికింది. సికింద్రాబాద్ జంక్షన్‌లో-కదులుతున్న రైలు ఎక్కేసేదాకా ఆమెకి తెలిపిలేదు. విశ్రాంతిలేదు.

* * *

"అదీ...జరిగిన కథా...గాథా...వ్యథాను..." అన్నది సత్యవతి.

రాజీవ్ మాట్లాడలేదు. ఆరిపోయిన సిగరెట్ వెలిగించుకొని...కిటికీనుంచి బయట ప్రకృతిని చూడసాగేడు పది నిముషాల పాటు ఎవరూ మాట్లాడలేదు, సత్యవతికి మాత్రం ముళ్లకంపల్లో నడుస్తున్నట్లుంది. 'ఇంతే భయంలేదు సత్యా' అని రాజీవ్ అంటాడనుకుంది. ఆ ఓదార్పులో తన కష్టాలను మరచిపోవాలను కుంది. రాజీవ్ మౌనం అనుమానం కలుగజేస్తోంది.

తనని నమ్మడంలేదా ? అనుమానిస్తున్నాడా ?

ఎవరో పేషంటుకి సీరియస్‌గావుందని రుక్మిణి రావడంతో, "పడుకో సత్యా.... ప్రొద్దుట మాట్లాడుకుందాం." అని రాజీవ్ వెళ్ళిపోయాడు.

సత్యవతి అచేతనంగా మంచంమీద వాలింది. కలగాపులగంగా ఎన్నో ఆలోచనలు. తనకితానే సర్దిచెప్పుకుంది. తను వృథాగా భయపడుతోంది. రాజీవ్ అలాంటివాడు కాడు. తెల్లవారబోతూండగా నిద్ర పట్టింది.

ఆమె లేచేసరికి పదయింది. నిద్రకళ్ల మధ్య యింకా తను పాలెంలోనే వున్నట్లు భ్రమపడింది గోడమీద రాజీవ్ ఫోటో నవ్వుతూ పల్కరించింది.

పేస్టు యివ్వనా అమ్మగారూ...మీరు లేవలేదాని చూస్తున్నాను. లేపుతానంటే డాక్టరుగారు వద్దన్నారు" అన్నాడు చిన్నా బయటకువస్తున్న ఆమెతో.

సత్యవతి నవ్వింది.

ఆమె స్నానంచేసి వచ్చేసరికి చిన్నా పెసరట్టు, వుప్మా తీసుకువచ్చాడు. "మీ కోసం స్పెషల్‌గా చేశాను అమ్మగారూ."

సత్యవతి తింటూ "నాలో ఏముంది స్పెషాలిటీ ?" నవ్వుతూ అడిగింది.

వాడు తెల్లమొగం వేశాడు. సత్యవతి బుజ్జగించి అడిగింది. చిన్నా ఏదో వాగేడు. "అసాధ్యుడివే" అంది ప్రశంసాపూర్వకంగా.

ఆనాడు సత్యవతి పాలపిట్టరంగు దావణగేరె చీరలో ప్రత్యేకంగా ముస్తాబయింది. ఇన్నాళ్ళు ఆమె శారీరక అలంకరణలో ఏం ప్రత్యేకత చూపించలేదు. తోడేళ్ళ మధ్య కాపురం కనుక, ఆ మజిలీలు దాటి కోరుకున్న స్థానానికి చేరుకుంది. ఆమె అలంకరణ పూర్తయ్యేసరికి పదకొండున్నరయింది. ఏంచెయ్యాలో తోచలేదు.

క్రిందకి వచ్చింది. విజిటర్స్‌హాల్ కిక్కిరిసివుంది. 'రాజీవ్ ప్రాక్టీసు బాగానే వుందన్నమాట' అనుకుంది. కాలక్షేపంగా హాస్పిటల్ అంతా తిరిగి పైకి వచ్చింది. రాజీవ్ బెడ్‌రూంలోని బుక్‌రాక్ ఆకర్షించింది. క్రింద అరలో మెడికల్‌జర్నల్స్ వున్నాయి. పై అరలో నవలలు వున్నాయి. ఇంతకుముందు చదివిన గోపీచంద్ 'అసమర్థుడి జీవితయాత్ర' నవల తీసుకుని సోఫాలో కూర్చుంది.

చాలాసేపటికి చిన్నా వచ్చాడు. "అయ్యగారు పిలుస్తున్నారు !" అన్నాడు.

పుస్తకం మూసివేస్తూ "ఎక్కడున్నారు ?" అనడిగింది.

"హాస్పిటల్లో."

రాజీవ్ విశ్రాంతిగా కూనిరాగం తీస్తూ కూర్చున్నారు.

"డాక్టర్‌గారికి సంగీతం వస్తోందా !" నవ్వుతూ లోపలికి వచ్చింది సత్యవతి.





"కుడుములు వండలేని ఆడదీ కూనిరాగం తీయలేని మగాడూ వుంటారను కున్నావా ? ఏం చేస్తున్నావ్. నిద్రపోవటంలేదు కదా ?" ఫ్లాస్కులోని టీ కప్పులో పోస్తూ అన్నాడు.

పదునైన పళ్ళవరస తెల్ల గులాబీరేకులు వెదజల్లినట్లు మెరిసింది నవ్వుతో. భోజుడి సమక్షంలో కవిత్వం వచ్చినట్లు, నీ దగ్గిర నిద్ర వస్తోంది."

"అందుకేగా దూరమైపోయావు ... శుభలేక యిద్దామని పిలిచాను నేను. పిలిచినట్లుగా నువ్వూ సమయానికే వచ్చావు." రాజీవ్ డ్రాయర్‌లోంచి శుభలేక తీసి యిచ్చాడు.

వణుకుతున్న చేతులతో అందుకుంది...రాజీవ్‌కి రుక్మిణినిచ్చి...ఆమె యిక చదవలేకపోయింది. వెలుగు బావినుంచి వెతల బావిలోకి పడిపోయింది శుభలేక డ్రాయర్‌పై విడదీసి, చాలాసేపు మౌనంగావుండి "ఏరు దాటించాక తెప్పతగల వేసేరకాలుంటాయని అర్థమైంది" అన్నది పట్టి పట్టి.

"ఇంకేమర్థమయింది?" ఛలోక్తిగా అడిగాడు.

"ఎద్దుపుండు పొడవటం కాకికి వినోదంగానే వుంటుంది. నా వల్ల జీవితాన్ని నిర్మించుకుని పెళ్ళికొడుకు వయ్యావన్నమాట. రుక్మిణి అంటే ఆ నర్సేనా ?" తాపీగా అడిగింది.

"కేవలం సరదాకి వుంటోంది. ఆమె తండ్రి ప్రముఖ న్యాయవాది. నేను హాస్పిటల్ పెట్టడానికి ఆయనే కారణం. అందుకే రుక్మిణిని చేసుకుంటున్నాను."

"నీ జీవితం ఆడవాళ్ళతోనే పైకి వస్తోందన్న మాట ... శభాష్ ఈ పెళ్ళి అంగీకరించే ముందు నేను గుర్తుకురాలేదా డాక్టర్."

"వచ్చావు. నీ గురించి వాకబు చేశాను. మీ అక్కయ్య పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయావని చెప్పింది. ఈ రెండేళ్ళలోనూ నీ దగ్గరనుంచి డబ్బు వచ్చింది కాని, వుత్తరం రాలేదు. ఎన్నాళ్ళు ఎదురు చూడమంటావ్ ?"

"ఎదురు చూడడానికి మీకు అవసరమేముంది ?" రాను రాను ఆవేశం ఆవహించింది. ఇన్నాళ్ళు తను కలవరపడ్డ బ్రతుకంతా వ్యర్థమని, కోరుకున్న కల భ్రమని తెలియగానే పిచ్చిపట్టినట్లయింది.

కథ మారిపోయింది. భవితవ్యం శూన్యంగావుంది. తన బ్రతుకు కుమ్మరి వీధిలో కుండలమ్మినట్లయింది. రాజీవ్ తనవాడు కాదు. అందరూ తనని భౌతికంగా మోసంచేస్తే రాజీవ్ మానసికంగా అన్యాయం చేశాడు. ఆవేదన అగ్నిగుండంలో యిక తను జీవించలేదు. భవితవ్యం లేనప్పుడు ఎందుకు బండగా మొండిగా శిశిరాల మధ్య జీవించడం ?

యుగ పాశంలో యిరుక్కున్న యితరులకు భిన్నమైన కొత్త బాటలో నిలవాలని తను పడ్డ ఆరాటం నీటిబుడగ. ఏరువాక ఎడారయింది. నందనవనం నైమిశారణ్యమయింది. ఈ లోకంలో ఎందరో బాధాతప్త జీవులున్నారు. వీళ్ళు ఏ ఆశతో బ్రతుకుతున్నారు. ఏముంది భవిత? ఎందుకు మంటల మధ్య శృతితప్పిన జీవనగీతికను వింటూ తమని తాము మోసం చేసుకుంటున్నారు?

అలా చెయ్యడం తనవల్లకాదు పరిష్కారమేమిటో తనకి తెల్సు.

"నన్ను క్షమించలేవా సత్యా. ఇంత కథ జరిగిందని నాకు తెలియదు. నువ్వు వస్తావని తెలిస్తే ఎన్నిరోజులయినా ఆగేవాడ్ని." నచ్చచెబుతున్నట్లు అన్నాడు.

"ఆ రోజు నేను చెప్పానుకదా...మనం తిరిగి కల్సుకునేరోజు వుంటుందని. నీకు ఎందుకు జ్ఞాపకముంటుంది ? రుక్మిణి మాయ...తప్పు నాది ... నాది." సత్యవతి విసురుగా లేచి వెళ్ళిపోయింది. దీనిపై వాదించడం ఆమెకిష్టంలేదు.

రాజీవ్ పిలిచినా ఆగలేదు. రెండు గంటలకి రాజీవ్ భోజనానికి పైకి వెళ్ళాడు. సత్యవతి గది తలుపులు దగ్గరగా వేసివున్నాయి.

"భోంచేద్దాం రా..." లోపలికి వచ్చి పిలిచాడు.

సత్యవతి మాట్లాడలేదు. కోపం వచ్చిందేమోనని మీదకి వంగాడు. చేతిలో ఉత్తరముంది. ప్రక్కన ఖాళీ నిద్రమాత్రల సీసా ఉంది.




రాజీవ్ ఉత్తరం విప్పాడు.

"రాజీవ్"

అందుకోవాలన్న స్వర్గం ఆమడదూరం జరిగిపోయింది. మనం కల్సి వుంటాం - దంపతుల మవుతాం అన్న ఆకర్షణతో బ్రతికాను. అది ఈనాడు వికర్షణయింది. సాహసం, పురోగమనం నా జీవనవ్యాపారాన్ని నష్టంతో ముంచెత్తాయి. ఆత్రపడినందుకు మంచి బహుమతే లభించింది. నువ్వు నాకు ఉపయోగపడకున్నా, నేను నీకు ఉపయోగించాను. అది నీ అంతరాత్మకి తెల్సు, భానోజీ భార్యగా కొన్నాళ్ళు వుండటం నీకు అనుమానం. అందుకే రుక్మిణిని చేపట్టావు. స్త్రీ కేవలం స్వార్థంతో అనుభవించే వస్తువు కాదు రాజీవ్! పవిత్రత పేరుతో నాగరికత పెపెరిగేకొద్దీ ఆమెకి బంగారు సంకెళ్ళు ఎక్కువయ్యాయి. ఇవి స్త్రీ జీవితానికి శాపాలు.

భార్యాభర్తల సంబంధం కేవలం మానసికమైనది. "మనః కృతం, కృతం రామ, న శరీరకృతంకృతం, యేనైవాలింగితా కాంతా, తైనైవాలింగితాసుతా"... అంటే కుమార్తెని కౌగిలించుకున్న శరీరంతోనే, భార్యనీ కౌగిలించుకుంటున్నాడు. కుమార్తె కౌగిలింతలో మనసు వికారం పొందదు. భార్య కౌగిలింత పరిస్థితి వేరు. శరీరం ఒకేరకం పనులు చేస్తోంది. మనసే మారుతోంది.

ఈ శ్లోకం ఎందుకు చెప్పానో అర్థంకాని మట్టిబుర్ర కాదు నీది. నువ్వు లేని జీవితం వద్దనిపించి వెళ్ళిపోతున్నాను

సత్యవతి"

"సత్యా!" పెద్దగా కేకపెట్టి ఆమెమీద పడిపోయాడు ఆ కేక విని వడ్డిస్తున్న చిన్నా పరుగెత్తుకు వచ్చాడు

"నిన్ను కావాలని చంపుకున్నాను సత్యా...నిన్ను పరీక్షిద్దామని నాటక మాడితే అదే నిజమనుకుని ప్రాణం తీసుకుంటావా ?" రాజీవ్ విలపిస్తున్నాడు.

"ఏం జరిగిందయ్యగారూ..." చిన్నా ఆత్రంగా అడిగాడు.

"మీ అమ్మగారు లోపలికి వెళ్ళి ఎంతసేపయిందిరా ?" తేరుకుంటూ అడిగాడు

"గంట పైనయిందండి...మీతో భోజనానికి వస్తారని పిలవలేదు."

అయితే సత్యవతి స్లీపింగ్ పిల్స్ మ్రింగి గంటయిందా ? వైద్యం చెయ్య డానికి బుర్ర పనిచేయలేదు "చిన్నా డాక్టర్ రఘుని, డాక్టర్ విశ్వామిత్రని కార్లోపోయి తీసుకురా ?...తొందరగా రావాలి."

చిన్నా పరుగెత్తాడు.

సత్యవతి అచేతనంగా పడివుంది. రాజీవ్ మతిపోయినవాడిలా తిరుగు తున్నాడు. కంగారు...బాధ...సత్యవతి దక్కదేమోనన్న ఆందోళన.

"నువ్వు లేని జీవితం నాకు మాత్రం ఎందుకు సత్యా ! శుభలేఖ చూసి అంతా నిజమనుకున్నావా ? నేను వినోదానికి చేసినది విషాదానికి దారితీసింది. నేను మూర్ఖుడ్ని సత్యా! రత్నాన్ని పోగొట్టుకున్నాను."

రాజీవ్ ఏడుస్తున్నాడు...

డాక్టరుగారుకూడ ఏడవగలరన్నమాట!" సత్యవతి నవ్వుతూ లేచి కూర్చుంది.

"స...త్యా..." నమ్మలేకపోయాడు. ఛంగున మంచంవైపుకి దూకి ఆమెని తన ఒడిలోకి తీసుకుని అందినచోటల్లా ముద్దుపెట్టేసుకున్నాడు.

"ఆగుమరి...దానికింకా టైం ఉంది." సత్యవతి మృదువుగా తప్పించు కుంది

"నన్ను ఎంత బాధపెట్టావో తెల్సా ?" కృత్రిమంగా కోపిస్తూ అన్నాడు.

"నన్ను పెట్టలా...అందుకే నిన్ను...నవ్వుల శుభలేఖ తయారుచేశావు. నేను స్లీపింగ్ పిల్స్ సీసా ఎఫెక్ట్ కోసం వాడుకున్నాను. డాక్టరుగారికి గ్లిజరిన్ అక్కర్లేదు."

రాజీవ్ సిగ్గుపడ్డాడు

"నాడి చూస్తే నీ నాటకం పసికట్టేద్దును."

''మనకంత బుర్రేది?" కిలకిలా నవ్వింది.

ఇంతలో చిన్నా డాక్టర్ విశ్వామిత్రని తీసుకుని వచ్చాడు. "రఘుగారు శేరండి అయ్యగారూ..."

"ఏమిటయ్యా కుర్ర డాక్టరూ విశేషం..." విశ్వామిత్ర బట్టతల గోక్కుంటూ అడిగాడు.

రాజీవ్ ఫ్రిజిలోనుంచి ఆపిల్ జ్యూస్ తీసి యిచ్చాడు "సారీ ఫర్ ది ట్రబుల్. నిద్రమాత్రలు మ్రింగకుండా మ్రింగినట్లు నటించింది."

"ఏమవుతుం దీపిల్ల? చెల్లెలా? అక్కా? మరదిలా? వదినా? భార్యా? విశ్వామిత్ర భూతద్దల కళ్లజోడునుంచి సత్యవతిని పరీక్షగా చూస్తూ అడిగాడు.

"త్వరలో చివరిది కాబోతుంది సార్!"

"అహ్హా!...అదా సంగతి...తొందరగా పెళ్ళిచేసుకో. లేకపోతే ఇలాంటి నాటకాలే వేస్తుంది. ఈ మధ్య మనకి ఎక్కడా పెళ్ళిభోజనం తగల్లేదు." విశ్వామిత్ర నవ్వుతూ వెళ్ళిపోయాడు.

"అయ్యగారూ...వడ్డించెయ్యనా?" చిన్నా అడిగాడు.

"ఇంకా నువ్వెందుకురా పానకంలో పుడకలాగ? మ్యాట్నీకి పో...మేం యించక్కా..." సత్యవతి నోరుమూసింది. "సిగ్గులేకపోతేసరి."

చిన్నా వెళ్ళిపోయాడు.

"మన కష్టాలు తీరాయి సత్యా. దీనికి కారణం నువ్వు. అందుకే నీకు మాంచి బహుమానం యివ్వాలి..." ఆమెని తన కౌగిలిలో బంధించాడు.

సత్యవతికి పున్నమి చంద్రుడు ఒడిలో వాలినట్లయింది.





# మరిచిపోలేని మేలు

ఓలేటి శ్రీనివాసరావు భాను

ఉదయం ఆరుగంటల నుంచీ ఎడతెరిపి లేకుండా ధారాపాతంగా కురుస్తున్న వర్షాన్ని తిట్టుకుంటూ, గంటన్నర నుంచీ గడియారాన్ని మార్చి మార్చి చూసుకుంటూ, గడిచిన పావు గంటలో పదిహేనోసారి వీధిలోనికి చూసివచ్చిన శర్మ మేస్టరు వంటింట్లోంచి భార్య అమ్మడు "టైమెంతయిందండీ" అని అడిగితే "ఒంటిగంటంపావు" అన్నాడు.

రివ్వు రివ్వుమని వీస్తున్న ఈదురు గాలి చెంపలు చెళ్ళుమనిపిస్తూ, గోడకి తగిలించిన తెలుగు కేలెండర్‌ని 'టప' 'టప' మనిపిస్తూంది. ఏ ఝామయ్యో వంటంతా పూర్తిచేసి కుంపటి దగ్గిర మడిగా కూర్చుని చలికాగుతూ "శాస్త్రులు ఇహ వస్తాడంటారా ?" అని అడిగింది అమ్మడు

ఆ ప్రశ్నకి అంత చలగాలిలోనూ వళ్ళు భగ్గుమంది శర్మ మేస్టరికి!

"వస్తాడో, ఛస్తాడో నీ కెంత తెలిసీ అఘోరించిందో నాకూ అంతే తెలిసి చచ్చింది. ఆరు మైళ్ళ దూరంనుండి పొలాల గట్లమీంచి బ్రాహ్మడు రావాలాయె ! ఉదయంనుంచీ చూడబోతే ఊళ్ళు ముంచుకొస్తున్నట్లు ముసురాయె!

నీ కేంపోయింది ఎన్ని కబుర్లేనా చెప్తావ్. ఎంత మహా తద్దినం వంట వండేసినా ముచ్చికాయ ముగ్గురికే కదా! మూడు ఘడీల్లో వంట వండేసి వంటింట్లో పొయ్యి దగ్గర కొక్కిరమ్మలా చలి కాచుకుంటూ శాస్త్రులు వస్తారా రాడా అని రెండు గంటల్నించీ ఒక్కలా వేపుకు తింటున్నావు" అని భార్యమీద కసురుకున్నాడు, శర్మ మేస్టరనబడే కాశీభట్ల కైలాసనాథ శర్మ, ది రిటైర్డ్ స్టేషన్ మాస్టర్!

"ఇది మరీ బావుంది! అడిగి తెలుసుకోవడం కూడా తప్పే కాబోలు. ఇంట్లో అసలే కార్యం జరిగినా మీకు అన్నింటి కన్నా ముందు చిరాకు ముంచుకొస్తుంది," అని గొణుక్కుంది అమ్మడు.

"ఏమిటే ఆ గొణగడం? చిరాకు పడేనంటే పడనూ మరి. ముప్పావుగంట నుంచీ చూస్తున్నాను, ఇది ముప్పై మూడోసారి నువ్వడగడం నేను చెప్పడవూను" అని రెచ్చిపోయిన కోపంలో తమ కుటుంబం తప్ప "మరే బ్రాహ్మణ గడపే లేని ఆ దిక్కుమాలిన పల్లెటూళ్ళో, ఆరునెలల క్రిందట తను రిటైర్ అయిన తరువాత కొడుకులు ఎంత వద్దని చెబుతున్నా, చవగ్గా దొరుకుతున్నాయని భూములు కొనిపించిన బావమరిదినీ, అందుకు ప్రోదిచేసిన భార్యామణినీ, ఇరుమైళ్ళ దూరంనుంచి తన తండ్రిగారి ఆబ్దికం కోసం సరిగ్గా ఈ వేళ పన్నెండు గంటలకి భోక్తగా రావలసిన పౌరుగూరి శాస్త్రుల్ని రానివ్వకుండా కురుస్తున్న వర్షాన్ని తిట్టుకుంటూ, మరో కాలంలో కాకుండా కేవలం వర్షాకాలంలోనే సంభవించిన తండ్రి మరణమ్మీదా చిరాకుపడ్డాడు.

ఆ మాటల్నే అమ్మడితో అంటే-

"ఇది మరీ బావుందండీ! మనం తద్దినాలు పెట్టుకోడానికి అందువిడిగా చావులు పొడి కాలాల్లోనే సంభవిస్తాయిటండీ? ఇవేవన్నా పెళ్ళిముహూర్తాలా మనిష్టం వచ్చినప్పుడు పెట్టుకోడానికి!" అని అవకాశం వచ్చింది కదాని మూతిని ఈ కొసనుండి ఆ కొసకు సాగదీస్తూ, జారిపోతున్న జానాబెత్తెడు పండు జుట్టునీ తిరిగి ముడి చుట్టుకుంటూ, ఇంకా ఏదో చెప్పబోతోంది అమ్మడు

"నోరు మూసుకో తల్లీ! పొరపాటున నోరు జారేను. నీ పెద్దలకి వెయ్యి దండాలుగానీ మన్నాకు చిర్రెత్తించకు. సందు దొరికితే చాలండీ షంటింగ్ ఇంజనులా తగులుకుని వర్రతిన్న కాకిలా ఒహటే గోల" అని విసుక్కుంటున్న శర్మ మేస్టర్ "కావ్ కావ్" మని శబ్దం రావడంతో పెరటి వరండాలోకి తొంగి చూసేడు. చలికి బాగా వడబట్టిపోయి, తడితో బరువెక్కిన రెక్కల్ని 'టపటప' మని అల్లార్చుకుంటూ ఓ కుంటి కాకి ఒంటికాలితో బట్టలు ఆరవేసే దణ్ణెమ్మీద ఈ కొసనుంచి ఆ కొసకి

తిరుగుతూంది. ఉండుండి దణ్ణెమ్మీద అటూ ఇటూ ముక్కుని రాసుకుంటూ మేతకి ఏమీ దొరకనందున 'కావ్ కావ్' మంటున్నది.

"అమ్మయ్యా" అనుకున్నాడు శర్మ మేస్టరు. అమ్మడిని మెల్లగా రమ్మంటూ సైగచేసి కాకిని చూపించేడు. ఎంతో సేపట్నుంచి ఎదురుచూస్తున్న బండి సైట్ అయినట్లనిపించింది వాళ్ళకి.

"ఎలగరా తండ్రీ ఈ దిక్కుమాలిన ముసురులో తర్పణాలు తినడానికి పిట్ట కాకైనా రాదేమోనని బెంగ పెట్టుకు ఛస్తుంటే, ఆ భగవంతుడు చల్లగా చూసి కుంటిదో గుడ్డిదో ఓ కాకినంటూ పంపించేడండి. కాకపోతే చోద్యంకాని ఇంత కుంభవృష్టిలోనూ ఇంట్లో ఈగైనా కదల్లేదే! ఎక్కణ్ణించి ఎగిరొచ్చిందో ఇది?" అంటూ కోరమాండల్ ఎక్స్ప్రెస్‌లా కొట్టుకుపోతున్న అమ్మడి వాక్ప్రవాహానికి 'చైన్' లాగి 'బ్రేకు' వేస్తూ,

"ఇహ నీ ధోరణి చాలుగానీ, ఇవాళ పూజంతా అయిపోయేవరకూ నువ్వా కాకిని ఎటూ ఉడాయించకుండా చూడాలి. అదెటేనా ఎగిరిపోయిందా మళ్ళీ చచ్చే చావు. చిన్న సులువు చెప్తాను విను. వెంటనే నాలుగు నూకల గింజలా వరండాలో మూల పడి. అవి కొరుక్కుంటూ అదక్కడే తచ్చాడుతుంది. ఎందుకేనా మంచిది ముందు జాగ్రత్తగా సవ్యం చూసుకుని ఆ పెరటివరండా జాఫిరీ తలుపులూ, మధ్య తలుపులూ మూసీ మరెటూ కదల్లేదది."

శర్మమేస్టరు చెప్పినట్లు తూ. చ. తప్పకుండా చేసి, "అమ్మయ్యా" అని మధ్యగదిలో ఎడంగా కూర్చుంది అమ్మడు.

పాపం ముసురు మూలంగా ఉదయాన్నుంచీ ఎక్కడా మేత దొరికినట్లులేదు, కుంటి కాకి ఆత్రంగా నూకల్ని బుక్కేస్తూంది.

"ఇహ ఇసుంటా వచ్చీ! మరి మాటి మాటికీ రెక్కలు తీస్తూన్న దాన్నలా చూడకు" అని అంటూ ఎవరో వచ్చిన అలికిడి విని వీథిలోనికి చూసేడు శర్మ మేస్టరు

ఆ దంపతు లిద్దరి కళ్ళూ ఆనందంతో మెరిసిపోయేయి. తమకోసం వెయ్యబడిన స్పెషల్ ట్రైను వాళ్ళ వాకిట్లో కొచ్చినంత సంబరపడ్డారు వాళ్ళు. ఎదురుగా శాస్త్రులు నిలబడ్డాడు. తాటాకుల గొడుగులో వచ్చినా తడిసి ముద్దైపోయేడు. పైమీద తువ్వాలు తప్ప చొక్కా లేదతనికి. కట్టుకున్న గావంచా గుడ్డ పూర్తిగా బురదనీటితో డాగులు కట్టుకుపోయింది. ఆరుమైళ్ళ దూరాన ఉన్న పల్లెటూరినుంచి దారి పొడుగునా నీటిగుంటలు దాటుకుంటూ పొలాల గట్లకి అడ్డంపడి రావడంవల్ల పాదాల



నిండా, కాలివేళ్ళ సందుల్లోనూ బంకమన్ను నిండిపోయింది.

“రా శాస్త్రులూ రా” అంటూ వృద్ధ దంపతులిద్దరూ ప్రేమతో ఆహ్వానించేరతన్ని. అమ్మడు అందించిన రెండు చెంబుల నీళ్ళతో వీధి గడపలో కాళ్ళ బురదని కడుక్కొని, గోనెపట్టామీద పాదాల తడిని గట్టిగా తుడుచుకుంటూ, వారం రోజులనుండీ విపరీతంగా ముంచుకొస్తున్న ఉబ్బసాన్ని భరించలేక 'ఖంగ్ ఖంగ్' మని దగ్గుతూ ఆయాస పడుతున్నాడు శాస్త్రులు.

గత మూడురోజులుగా ఇంటిల్లిపాదీ పస్తులు పడుండటంవల్ల, ఆరుమైళ్ళ దూరంనుంచీ తద్దినం భోజనంకోసం వాచిపోయిన ముఖంతో, తాంబూలంతో దొరికే నాలుగు పరకల దక్షిణ డబ్బుల కోసం కొండంత ఆశతో, మింటికీ మంటికీ ఏకధారగా కురుస్తున్న వర్షాన్నీ, నెట్టుకొస్తున్న నీరసాన్నీ లక్ష్యపెట్టకుండా నడచుకొచ్చేడు శాస్త్రులు.

“బాగా ఆలస్యమైపోయింది బాబూ! త్రైము రెండౌతుందేవిటి? ఆ కాడికీ తొందరగా బయల్దేరాలని పెందరాళే తెమిలేను. కానీ ఈ ముసురు చూసేరా ఎలా ముంచుకొచ్చిందో! ఏ గడికైనా తగ్గకపోతుందాని చూస్తుంటే అలా మరింత కొట్టుకురావడవేఁగానీ తగ్గుముఖం పడితేనా? నా గుబ్బగొడుగు కమాన్లు విరిగిపోయి, గుడ్డ కాస్త ఎంక్కొట్టేసి చిరిగి చిద్రూపవైఁపోయింది. మరో గొడుక్కోసం వేపగిస్తే అతి కష్టంమీద దొరికిందీ తాటాకు గొడుగు.

ఆం. ఇహ ఇ-ట్లో అంతా సిద్ధమే కదమ్మా" అని అడిగేడు శాస్త్రులు.

"అన్నీ సిద్ధమే" నని కుంపటిమీద మడిగా కాచి ఉంచిన వేణ్ణీళ్ళని ఇద్దరికీ తొర్లించింది అమ్మడు

పెరటి వరండాలో కుంటికాకి నూక లన్నీ తినేసి ఓ మూల రెక్కల్లో ముఖాన్ని ముడుచుకుని వెచ్చగా కునుకు తీస్తోంది.

శాస్త్రులు తను కట్టుకొచ్చిన గావంచా గుడ్డని తడిపేసి వరండాలో దణ్ణెంమీద ఆరేసి శర్మ మేస్టరిచ్చిన మడిపంచెని కట్టుకున్నాడు.

ఇద్దరూ మధ్యగదిలోకి మడిగా వచ్చేరు. అమ్మడు పూజకి కావలసిన ఏర్పాట్లు చేసింది. పూజ మొదలుపెట్టి దగ్గుతూ, ఆయాసపడుతూ మంత్రాలు చదివి అఖుందనిపించేడు శాస్త్రులు.

ఓ విస్తరాకులో అన్నం పిడచల్ని పెరటి వరండాలోకి తీసుకొచ్చి తూర్పు దిక్కున ఉంచి నీళ్ళు వదిలేసేడు శర్మ మేస్టరుఖంగారుగా విస్తరిమీదకికలబడింది కుంటికాకి మరో కాకో, పిచికో వచ్చి కదెత్తుకు పోతాయేమోనని అటూ ఇటూ చూస్తూ అన్నం పిడచలు తినేసి "ఇంకొంచెం పెడితే బావుణ్ణ"న్నట్లు చూసిందది.

అందరి భోజనాలూ పూర్తయ్యేయి.

శాస్త్రులు కడుపు అబగా తిన్న గారెలతో బరువెక్కింది. దక్షిణ డబ్బులు మొలకి దోపుకుని తాంబూలం బిగించి వీధి వరండాలో భారంగా చేరబడ్డాడు.

సాయంత్రానికి వర్షం బాగా తగ్గింది. పెరట్లో దణ్ణెంమీద ఆరేసుకున్న గావంచాని మార్చుకుని తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యేడు శాస్త్రులు.

"వాన బాగా తెరిపిచ్చినట్టుంది. మేస్టారూ! ఇహ నేను వెళ్తాను. ఈ దగ్గొహటి చెడ్డ తినేస్తున్నాది. రేపు పార్వతీపురం ధర్మాస్పత్రికి వెళ్ళాలి. ఇవాళ మీ ఊరి షావుకారు అడ్డెడు బియ్యం ఇస్తాను రమ్మన్నాడు. అతగాణ్ణి కలుసుకుని మళ్ళీ జల్లు రాకముందే మా ఊరు పోవాలి. మరి సెలవిప్పించండి వస్తానమ్మా" అని బయల్దేరబోయేడు.

"శాస్త్రులూ, ఏళ్ళూ ఊళ్ళూ ఏకమై పోతున్నరోజు దేన్నీ లక్ష్యపెట్టకుండా భగవంతుడిలా నువ్వొరాబట్టి సమయానికి మా నాన్నగారి ఆబ్దీకం సవ్యంగా జరిగిపోయింది. లేకపోతే ఎన్ని అవస్తలు పడవలసి వచ్చేదో నాయనా.

ఏదో అభిమానపడి మా కోసం అంత దూరంనుంచి బ్రాహ్మడివి వచ్చేవు. నీ మేలు మరీ జన్మలో మరిచిపోలేం 'నాయనా' అంటూ పార్వతీ పరమేశ్వరులు కృతజ్ఞతతో క్రుంగిపోయేరు.

వీధిమలుపు దాటుతూ శాస్త్రులు దగ్గిన దగ్గు వర్షంలోంచి పోతూ రైలు వేసిన కూతలా వినిపించింది వాళ్ళకి.

పెరటి వరండాలో కాకి ముసురు తగ్గడం చూసి ఓసారలా చక్రీ కొట్టడానికి ఎగిరిపోయింది.

* * *

మూడు రోజులు గడిచేయి.

ఆకాశంలో మబ్బులు చేస్తున్న అల్లరి ఇంకా తగ్గలేదు.

ఉండీ ఉడిగీ తెరలు తెరలుగా జల్లులు కురుస్తూనే ఉన్నాయి.

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటన్నర కావొస్తూంది. శర్మ మేస్టరు రెయిను కోటు వేసుకుని, చెప్పుల్లో కాళ్ళు దూర్చి, గొడుగుతో సహా గుమ్మం దాటి వీధి లోనికి అడుగు పెట్టేడు.

ఎదురుగా శాస్త్రిలు కనిపించేడు. విపరీతమైన ఎగ ఊపిరితో, ఊపిరి సలుపుకోలేని దగ్గుతో రొప్పుకుంటూ నిలబడ్డాడు.

"చచ్చేం. గుమ్మం దిగేసరికి ఒంటి బ్రాహ్మడి శకునంరా బాబూ" అనుకుని "ఏం శాస్త్రిలూ ఇలా వచ్చేవు ?" అని అడిగేడు శర్మ మేస్టరు.

అంతా చెప్పి, మూర్తీభవించిన దైన్యంలా నిలబడ్డాడు శాస్త్రిలు.

మూడు రోజుల క్రిందట అతను శర్మ మేస్టరింట్లో తద్దినం భోజనంచేసి వెళ్ళిన రాత్రి ఆయాసం ముంచుకొచ్చి మరిక తను బతకననుకున్నాట్ట ! నిన్న పార్వతీపురం ధర్మాసుపత్రికి వెళ్తే, తనిఖీ చేసిన డాక్టరు ఉబ్బసం చాలా తీవ్ర దశలో ఉన్నదని, బాగా ట్రీట్ మెంటు తీసుకోవాలని, లేకపోతే లాభం లేదని చెప్పి, ఏవో మందులూ, ఇంజక్షన్లూ రాసేట్ట ! "అయ్యా నేను బీదవాణ్ణి ! కేవలం పౌరోహిత్యమ్మీదే కుటుంబమంతా బతుకుతున్నాం. అంతలేసి ఖరీదుపెట్టి మందులు కొనుక్కోలేన్నాయినా" అని బ్రతిమాలితే "అది సరేనయ్యా ! దానికి నేనేవీఁ చెయ్యలేను. సరి ఆ మందులు కొనేదాకా ఈ మాత్రలు వాడు" అని నాలుగు బిళ్ళలిచ్చి, "వారం తిరిగేక, ఆ మందులు కొనుక్కుని వాడుతూ, మళ్ళీ రా" అని పంపించేట్ట డాక్టరు !

"మా ఊర్లో తలొక్కరూ ఎవరికి తోచినంత వాళ్ళిస్తున్నారు బాబూ. మీ ఊర్లో షావుకార్ని, మిమ్మల్ని అడుగు దామని వచ్చేను. మీ రిప్పుడు దయదలచి ధర్మం చేస్తే నా పిల్లలకి నన్ను దక్కించిన పుణ్యం తవఁదే. మీ పేరు నా కుటుంబం బతికున్నంతకాలం చెప్పుకుంటాం బాబూ..." అంటూ ఇంకా ఏదో చెబుతూ రెండుచేతులూ ఎత్తి నమస్కరించి, అప్రయత్నంగా వచ్చిన కన్నీటిని ఆపుకోలేకపోతున్నాడు శాస్త్రిలు.

శర్మ మేస్టరికి ఎవరేనా డబ్బుల విషయం కదిపితే చాలు ఎక్కడలేని దరిద్రమూ దాపురిస్తుంది.

"చూడు శాస్త్రిలూ, నిజవేఁ. నీ పరిస్థితి చూస్తే నాకూ చాలా బాధగానే

ఉంది. కాని నా దగ్గిర ప్రస్తుతం ఎర్రని ఏగాణీ లేదు. మొన్న అందిన సొమ్మంతా దమ్ములకీ, ఉడుపులికీ అయిపోయింది. నా కొడుకులు ముగ్గురూ కూడ బలుక్కున్నట్లు ఈ నెల ఏ ఒక్కడూ పైసా కూడా పంపలేదు. రాసిన ఉత్త రాలకి జవాబుల్లేవు. ఊరు కాని ఊర్లో నానా యాతనలూ పడుతున్నాను. చెప్పు కుంటే వినేవాళ్ళు లేరు. అదిగో మళ్ళీ మబ్బులు కమ్ముకొస్తున్నాయి. ఆ షావు కారిని కలుసుకుంటానన్నావుగా, వేగిరం వెళ్ళు. పదో పరకో ఇస్తాడు. నేనలా కళ్ళంవేపు వెళ్ళాలి. అమ్మడూ తలు పేసుకో" అని మరి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయేడు శర్మమేస్టరు.

అంతకు అరగంట మునుపే షావు కారిని కలుసుకుని "లేదు పొమ్మ"నిపించు కుని చివరి ప్రయత్నంగా కొండంత ఆశతో శర్మమేస్టరిని చూడవచ్చిన శాస్త్రులుకి నోట మాట రాలేదు.

ఆకాశం నిండా మేఘాలు కమ్ముకుని పిసినిగొట్టువాడి దయాగుణంలా ఉంది వెలుతురు.

ఆ రోజు ఉదయం అతి విధేయులైన ముగ్గురు కొడుకులూ పంపిన మూడు వందల రూపాయలూ, శర్మమేస్టరుగారి రెయిన్ కోటు కింద వెచ్చగా తగులుతూ పోస్టాఫీసు సేవింగ్స్ ఖాతా దగ్గరకి పాస్ బుక్ తో సహా దారితీసేయి.

సాయంత్రం పెరటి వరండాలో-

చలినుంచీ, వర్షంనుంచీ తప్పించుకుని కాస్త వెచ్చగా తలదాచుకోవచ్చునని, తినడానికి నూకల గింజలో, అన్నం పిడచలో దొరుకుతాయని ఆశతో వస్తున్న పితృదేవతని

"నీ జిమ్మ పడిపోనూ, మా కొంప మీద పట్టించే వేవీందే దిక్కుమాలిన ముండా" అని తిట్టుకుంటూ, బయటకు తరిమేస్తూ పెరటి వరండా జాఫిరీ తలుపులు మూసేసి చిడత వెయ్యడంతో గత మూడు రోజులుగా సతమతమౌతున్న "రిటైర్డ్ స్టేషన్ మాస్టారి అమ్మడి గారి"కి ఊర్లో వాళ్ళ వస్తువుల్నితాకట్టు పెట్టుకుని చేబదుళ్ళివ్వడానికి తీరిక చిక్కటం లేదు.



# వ్యాపారస్తుడు




"సార్! అర్జెంటుగా ఓ వంద రూపాయలు కావాలి".

ఎప్పుడూ నన్ను అప్పు అడగని యాదయ్య దాదాపు కళ్ళనీళ్ళ పర్యంతంగా అంత డబ్బు అడగటం నాకు కొద్దిగా ఆశ్చర్యం అనిపించింది. మా ఆఫీసులో పేరుకి ప్యూన్‌గా పనిచేస్తున్నా, మా గుమాస్తాలు చాలామంది కన్నా యాదయ్య ఆర్థిక పరిస్థితి ఎంతో మెరుగగా వుంది

వడ్డీమీద రహస్యంగా చాలామంది వాడి దగ్గర వందలకి వందలు అప్పు తీసుకొనటం నాకు తెలుసు. కాని అంతా గప్‌చిప్‌గా వుంచటం వాడిలోని ప్రత్యేకత.

అలాంటి యాదయ్యకే డబ్బవసరం వచ్చి అడిగితే 'లేదు' అనలేకపోయాను.

"రేపు వుదయం ఇస్తాను. తీసుకు రాలేదు" అని చెప్పాను.

"మీ ఇంటికి వస్తాను సార్. ఇవాళే కావాలి" అన్నాడు కొద్దిగా వేడుకోలుగా.

లంచ్ అవర్‌లో కాఫీ కోసం ఇంటికి వెళ్ళినప్పుడు గుర్తుపెట్టుకుని అమ్మనడిగి వంద తీసుకొచ్చి ఇచ్చాను యాదయ్యకి.

"జీతం రాగానే ఇచ్చేస్తాను సార్" అన్నాడు కృతజ్ఞతగా.

అదేరోజు వుదయం మా ఆఫీస్‌లో పనిచేసే ఎకౌంటెంట్ ఓ డబ్బయి అయిదు రూపాయలు వుంటే సర్దమని అడిగాడు నన్ను.







"సారీ లేవు" అని చెప్పాను.

ఆయనెప్పుడూ ఆర్థికంగా అవస్థ పడుతుంటాడు. అలాంటి ఆయనకి ఇవ్వాలి నిజానికి. కాని ఆయనకి 'నో' అని, వడ్డీలమీద సంపాదించే యాదయ్యకి 'నో' అని ఎందుకు అనలేకపోయాను ?

సాయంత్రం ఇంటికి వెళుతుంటే ఆ ఆలోచన వచ్చింది. కాని నా మనసుకి నాకు సబబయిన కారణం తోచలేదు. పుష్కలంగా డబ్బుండే యాదయ్యకి మంచివాడు అనే ఉద్దేశంతో, స్వార్థంతో లేదనాలనిపించలేదు బహుశా.

మర్నాడు హృదయం ఎకౌంటెంట్ సీట్ దగ్గరకి వెళ్ళాను, జేబులో డబ్భై అయిదు రూపాయలతో.

"అనుకోకుండా మా తమ్ముడికి బోనస్ వచ్చింది. నిన్న లేదన్నాను సార్" అన్నాను డబ్బు బయటకి తీసి.

ఆయన చిన్నగా నవ్వి తల అడ్డంగా వూపుతూ చెప్పాడు.

"అసలు మిమ్మల్ని అడిగేవాడిని కాదు. యాదయ్యని అడిగితే వాడిదగ్గరా లేవు. అప్పుడడిగాను మిమ్మల్ని. కాని నిన్న సాయంత్రం వాడే ఎక్కడో ఓ వంద పుట్టించుకువచ్చి ఇచ్చాడు, మామూలుకన్నా ఓ రూపాయి ఎక్కువ వడ్డీమీద."

"వెరీ సారీ."

ఈసారి మనస్ఫూర్తిగా చెప్పాను.

# సర్వస్వం

ఎమ్. పార్థసారధి



ఒక పాత పెంకుటింటి పెరట్లో-

వేసవి మధ్యాహ్నపు ఏకాంతంలో-

జామచెట్టు కింద, వయసిచ్చిన అందం తప్ప మరే అర్హతాలేని ఓ పదహారేళ్ల అమ్మాయి మనసు నిండా తియ్యటి కలలతో-

"బావా,నువ్వే నా సర్వస్వం నీ తోనే నా జీవితం. నీ ప్రేమ లేందే నేను బ్రతక లేను. నా హృదయం నీది. నువ్వు లేని జీవితం నేనూహించలేను. మా యింట్లో వాళ్లు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా సరే, ఈ లోకం ఏమన్నా సరే-నేను నీ

దాన్ని. మన ప్రేమ శాశ్వతం. మనో వాక్కాయ కర్మలా నేను నీ దాన్ని," అంది తన మెడికో మేనబావ రఘురాంతో.

మరో రెండేళ్లకు-

తలుపులన్నీ వేసిన శోభనపు గది వుక్కలో, పట్టుచీర పరపరలో, అగరొత్తుల ఘుమఘుమలో, పాతి వ్రత్యంతో పరవశించెంది, ఓవర్సీరు రామలింగానికి పాదాభివందనం చేసి

"నేను మీ దాన్ని. నా శరీరం, నా మనసు మీ అధీనం. నా జీవితం మీ కంకితం. మీరే నా ఆరాధ్య దైవం. నా గుండెను గుడిగా చేసి మీ రూపాన్నే అందులో ప్రతిష్ఠించుకున్నాను. మీ దాసిగా బ్రతికి, సుమంగళిగా మీ ఒళ్లో తల పెట్టుకుని కళ్లు మూయటమే నాక్కావలసింది. మీరే నా సర్వస్వం," అంది, ఆవిడే

ఆ తర్వాత-

నొసట కుంకుమ చెరిగి, పసిగుడ్డును చేతుల్లో పట్టుకుని, అన్నగారింటి పంచన నిలిచి.

"అన్నయ్యా! ఇంక నాకీ బ్రతుకులో మిగిలిందేమీలేదు. తల్లివైనా, తండ్రి వైనా నువ్వే నాకు అన్నీ. ఈ పసికందును పెట్టుకుని నీ యింట్లో పనిమనిషిగానైనా బ్రతుకుతాను. నా దేవుడు నన్నొదిలి వెళ్ళిపోయాడు అన్నయ్యా, ఇంక నువ్వే నాకు దిక్కు," అని కూడా అంది.

కొడుకు పెరిగి పెళ్ళీడు కొచ్చాడు.

"ఒరేయ్ నాయనా, ఇన్నాళ్లు నేనెందుకు బ్రతికాననుకున్నావు. నీ కోసం. నాకీ బతుకులో యింకా ఏ మాశ వుందిరా, నువ్వు తప్ప. నువ్వు సుఖపడితే చూడాలనే యిన్నాళ్లున్నాను. నీ కోసమేరా నాయనా, నేనిన్నాళ్ళున్నాను" అని అంది కొడుకుతో.

ఆ తర్వాత, మరో ఐదేళ్లకు, మన వళ్లను ముందేసుకుని కూర్చుని-

"అడ్డాల నాడు బిడ్డలు గాని, గడ్డాల నాడు గాదురో. వాడికోసం యింత చేస్తే వాడి కీనాడు పెళ్లాం బెల్లమైపోయింది. ఇప్పుడైతే ఎత్తుకోమంటూ చేతులిస్తున్నారుగాని రేపు పెరిగి మీ రెంత మర్యాద చేస్తారో? నాయనా రండి. అంతా మీ దయ," అంటో ఆమె మనము చేతుల్లాగుతుంటే నవ్వుకుంటూ, తిట్టుకుంటూ. సాధించుకుంటూ వాళ్ళను దగ్గరకు తీసుకుంది.






## 22

క్రూరాతురుని కొట్టాననే కోపంతో, భాగ్యమ్మగారు నా మీద అలిగి తమ్ముడి దగ్గరకు వెళ్ళిపోయింది! జయ నెల నెలా ఆవిడ పేరిట డబ్బు పంపిస్తోంది! నేను కాదనలేదు! డబ్బు పోయినా, ఆవిడ అలా దూరంగా వుంటే, జయ మారుతుందని, మాలో వ్యక్తిగా కలిసిపోతుందని ఆశించాను! కానీ నా ఆశలు అడియాసలే అయినాయి!

పెద్దపిల్లకి ఒంట్లో బాగాలేదు. బాగా జ్వరంగా వుంది. జయ వూళ్లో లేదు. స్నేహితులతో కలిసి వరంగలు వెళ్ళింది! పెద్దది జ్వరతీవ్రతతో 'అమ్మా-అమ్మా' అని ఒకటే ఏడుపు. ఈ చిన్నపిల్లల్ని లాలించటంగాని, సముదాయించటం గాని నాకు రానే రావు! అక్కయ్య రాత్రి తెల్లవార్లూ మేలుకుని-పెద్దపిల్లని సముదాయిస్తూనే వుంది! ఎంతో కష్టం మీద మూడురోజులు గడిచినాయి! అక్కయ్య రాత్రిళ్ళు నిద్రలేక అలసటతో నీరసంగా అయింది.

మూడు రోజుల తర్వాత జయ వూరి నుండి తిరిగివచ్చింది! జ్వరంగా వున్న పిల్లని దగ్గరకి తీసుకుని, "అమ్మ వుంటే, నా పిల్లకి యిలాటిస్థితి వచ్చేదికాదు" అంది.

"మీ అమ్మ వుంటే వచ్చే జ్వరం ఆపేదా !" అన్నాను. జయకి కాస్తయినా కృతజ్ఞత లేకపోవటం, అక్కయ్య చేసిన సహాయం గుర్తించకపోగా, సూటీ పోటీగా మాటలు అనటంతో నాకు తిక్క రేగింది.

ఏ సాకు దొరుకుతుందా నాతో ఘర్షణకి దిగుదామా అని ఎదురు చూస్తున్న జయకి యిది ఒక పెద్ద అవకాశంగా కనిపించింది. నేను,అక్కయ్య కలిసి తన తల్లిని వెళ్ళగొట్టామని అంది. తనకి, తన పిల్లలకి ఏ కష్టం వచ్చినా, యీ యింట్లో ఆదుకునే దిక్కు లేదంది! నన్ను పెళ్ళిచేసుకుని, జీవితం నరక ప్రాయం చేసుకున్నాను అంది !

మా యిద్దరి మధ్యా మాటా, మాటా పెరిగింది ! జయమీద చెయి చేసుకో బోతుంటే, అక్కయ్య నన్ను వెనక్కి లాగింది. జయకి నాకు యిక పడదనిపిం చింది. నాకు మంచి, మర్యాద కావాలి ! జయకి ఎంతసేపూ, తన సుఖం- సరదాలు చాలు ! వాటికోసం ఏదయినా చేస్తుంది ! మాది మామూలు దాంపత్యం కానే కాదు ! ఇద్దరు పడని వ్యక్తుల మధ్య కుమ్ములాట వ్యవహారం ! జయతో కలిసి వుండాలంటే ఒకటే మార్గం ! ఘర్షణకి దిగకుండా తన హఠం భరించి, మౌనంగా వుండిపోవటం ! లేదంటే జయకి విడాకులు యివ్వాలి ! కానీ పిల్లలున్నారు. వాళ్ళ భవిష్యత్తు ఏమిటి ! అందుకని నేను మొదటి మార్గమే ఎన్నుకున్నాను ! కానీ, దీని వల్ల నాకు బైటివాళ్ళ ముందు చాలా అవమానాలు ఎదురుకాసాగినాయి. నాకు చేతకానివాడు అనే బిరుదు లభించింది ! భార్యని కంట్రోల్ చేయలేని వాజమ్మ అన్నారు. నన్ను చూసి ముఖాలు చాటు చేసుకుని నవ్వుకునేవాళ్ళు, గుసగుస లాడేవాళ్ళు !

ఈ అవమానం నేను భరించలేక పోతున్నాను!నాకు తరచుగా విపరీతమైన తలనొప్పి రాసాగింది ! వచ్చినప్పుడల్లా శారిడాన్ మాత్రలు మింగేవాడిని !

ఒకసారి యిలాగే బాగా తలనొప్పి వచ్చింది ! ఆ తలనొప్పి ఎంత తీవ్రంగా వుందంటే, మూడు మాత్రలు మింగినా తగ్గలేదు ! ఆ బాధకి తట్టుకోలేక నా శరీరం నరకయాతనపడుతోంది! గదిలో పడుకున్నాను !

జయ గదిలో, ఫ్రెండ్స్ కూర్చుని వున్నారు. గోలగా మాట్లాడుతున్నారు. పైనుంచి రికార్డ్సు ఒకటి ! నా తల బ్రద్దలయిపోతున్నట్లుగా వుంది !

చరచరా లేచి వెళ్ళాను.

జయ, మరో యిద్దరు అమ్మాయిలు, రికార్డ్ కి అనుగుణ్యంగా డాన్స్ చేస్తున్నారు.

"జయా ! ఈ గోల కాసేపు ఆపు. నాకు తలనొప్పిగా వుంది," అన్నాను.

"ఒంటరిగా కూర్చుంటే, అలాటి

తలనొప్పులే వస్తాయి. కాస్త మాతో వచ్చి కలవరాదూ! హాయిగా వుంటుంది."

"షటప్! ముందు ఆ రికార్డ్ ఆపుతావా లేదా ?"

జయ ముఖం జేవురించింది. "మర్యాద అనేది నీ యింటా వంటా లేదు."

నేను ఆ అవమానం దిగమింగాను. లోపలకి సరాసరి వెళ్ళి ఆ రికార్డ్ ఆపు చేసాను! ఆ గదిలో కూర్చొనివున్న ఆడవాళ్ళని చూస్తే నాకు అసహ్యం వేసింది.

"మీకెవరికీ పనీ పాటా ? లేదా ? ఎప్పుడూ యీ తందనాలేనా! మీకు కాలక్షేపం కావాలంటే, మరోచోటు చూసుకోండి! ఈ పూటనుంచి మా యింటికి రాకండి! వచ్చారంటే మాత్రం మర్యాదగా వుండదు!"

వాళ్లంతా నిశ్చేష్టులయినట్టు చూసారు. ఒక అమ్మాయి రోషంగా అంది. "జయా! ఏమిటే యిది! నీ పుట్టినరోజు అని చెప్పి మమ్మల్ని పిలిచి, యిలా అవమానం చేస్తావా!"

జయ అప్పటికే వాళ్ళ దగ్గరకి వచ్చింది. "ఆయన మాటలు మీరు పట్టించుకోకండి! ఈ మధ్య ఆయన మనస్థిమితం సరిగ్గా వుండటంలేదు! ఇప్పుడిలా అని, తర్వాత తనే బాధ పడతారు."

"ఏం కూసావు నువ్వు " నేను జయ జుట్టు పట్టి లాగాను! నన్ను పిచ్చివాడిగా జయ చిత్రించటం భరించలేక పోయాను! అసలే తలనొప్పితో వున్నానేమో, వెఱ్ఱికోపం వచ్చేసింది. మరుక్షణంలో జయ నా చేతుల్లో చిత్తుగా తన్నులు తింది! రికార్డర్ తీసి అవతల పడేసాను! వాళ్ల బాగ్‌లు విసిరేసాను! "ఇంకోసారి మీ రెవరైనా నా గుమ్మంలో అడుగు పెడితే, కాళ్ళు విరక్కొడతాను," అని అరిచాను, వాళ్ళంతా బయటికి పరిగెత్తారు. చెప్పులు, బాగ్‌లు దొరికినవి అందుకుని, వెనక్కి చూడకుండా పారిపోయారు. అక్కయ్య పరుగెత్తుకు వచ్చింది. "ఏమిట్రా యిది?"

"ఈ రోజునుంచి జయ యింట్లోంచి కదలటానికి వీల్లేదు! నాకు తెలియకుండా, బయటకి వెళ్ళిందా చంపేస్తాను."

"ముందు నువ్వు యిలా రా!" అక్కయ్య, నన్ను పట్టుకుని మంచం మీద పడుకోబెట్టింది!

నేను కళ్లు మూసుకున్నాను! నాకు తెలివి వుంది! కానీ నా మనసు నా వశంలో లేదు! ఈ స్థితికి నాకు భయం వేసింది!

డాక్టర్ వచ్చాడు! నాకు బాగా విశ్రాంతి కావాలని అన్నాడు! తల నొప్పి వచ్చినా సరే, ఆ శారిడాన్ మాత్రలు మాత్రం వేసుకోవద్దన్నాడు.

జయని నాకు చికాకు కలిగించే పన్లేవీ చేయవద్దని హెచ్చరించాడు!

జయ సరేనని తల వూపింది.

* * *

# 23

స్నేహితుల్లో బంధువుల్లో, ఎలా పాకిందో, ఎవరు ప్రచారం చేసారోగానీ, క్రమంగా, నేను మతి చాంచల్యం వచ్చిన మనిషిని అయ్యాననే వాదు వచ్చేసింది! అందరూ నన్ను దూరంగా వుంచసాగారు! ప్రతివాళ్ళు నేను కనిపించగానే, "ఇప్పుడు నీ ఒంట్లో ఎలా వుంది?" అని యోగ క్షేమం అడగసాగారు.

షాపు చూసేందుకు నాన్న వేరే మనిషిని పెట్టాడు.

నాకు జీవితం అంతా అయోమయంగా అనిపించసాగింది! నేనేం చెయ్యాలో నాకు తోచటంలేదు! ఈ తరానివాడు నీళ్లలో వుక్కిరి బిక్కిరి అవుతూ, మునుగుతానో తేలతానో అని భయపడుతున్నట్లుగా వుంది!

నా పరిస్థితి మూలంగా జయకి కావాల్సినంత సానుభూతి దొరికింది! స్నేహితులు ఆదరించసాగారు! నాకు తెలియకుండా జయ యింట్లోనించి వెళ్ళసాగింది! ఎప్పుడైనా వెళితే, ఏదో సాకు చెప్పేది!

ఆ రోజు సాయంత్రం—

స్నేహితురాలి కూతురు పుట్టిన రోజుకు, వెళ్తాను అంది. వెళ్ళమని చెప్పాను.

జయ టిప్‌టాప్‌గా తయారైంది!

నా దగ్గరకి వచ్చింది. "మీరు చెప్పిన టైమ్‌కి సరిగ్గా వచ్చేస్తాను. ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యను" అంది.

"మీరు మందు వేసుకున్నారా! నా కోసం అయినా మీరు ఆరోగ్యం బాగా చూసుకోవాలి! మీరు తప్ప నాకు ఎవరు వున్నారు చెప్పండి" అంది.

ఆ క్షణంలో జయ ప్రవర్తనకి నా మనసు చాలా ఆహ్లాదంగా అయింది! జయలో మార్పు వస్తోందనే ఆనందం కలిగింది! జయని నేను పెళ్ళి చేసుకున్నాను. పిల్లలు పుట్టారు. కష్టమో, నిష్ఠూరమో నేను జయని భర్తగా భరించాలి! ఎప్పటికైనా జయ మారక పోతుందా! అనుకున్నాను. జయ వెళ్ళిపోయింది.

అక్కయ్య యింట్లోనే వుంది! నేను లేచి బట్టలు మార్చుకున్నాను.

"చీకటయింది! ఇప్పుడెక్కడికిరా?" అంది అక్కయ్య.

"ఇప్పుడే వస్తానక్కయ్యా. కొంచం సేపు అలా తిరిగి వస్తాను."

"వెంట ఎవరినైనా తీసుకువెళ్ళు."

"అవసరంలేదు."

వీధిలోకి నడిచాను.

వీధుల్లో నడిచి నడిచి, పబ్లిక్‌గార్డెన్ చేరుకున్నాను. బాగా చీకటి అయింది! మెల్లగా నడుస్తున్న నేను, అక్కడ సిమెంట్ బెంచీమీద కూర్చుని వున్న జంటని చూసి ఆగాను. వాళ్ళు ప్రేమ పక్షుల్లా వున్నారు! ఇహలోకంతో

సంబంధం లేనట్టుగా, ఒకరిని ఒకరు అనుకుని కూర్చుని వున్నారు! అతని చేయి ఆమె మెడ చుట్టూపడి దగ్గరకి పొదివి పట్టుకుని వుంది! అతని చేతిని ఆమె రెండు చేతుల్లో పట్టుకుని వుంది! ఇద్దరూ మాట్లాడుతున్నారు. మధ్య మధ్యలో ఒకరిని ఒకరు గాఢంగా ముద్దు పెట్టుకుంటున్నారు! నాకు నవ్వొ వచ్చింది! ఒకప్పుడు నేను కూడా, యీ వెఱ్ఱిపనులు చేసినవాడినే! ఆ పిచ్చిలో పడ్డవాళ్ళకి, తెగింపు ఉంటుంది!

ఎవరైనా చూస్తున్నారేమోననే జాగ్రత్త వుండదు! అతని చేతుల్లో ఒదిగిపోయి, అతని మెడ దగ్గరకి తల ఆనించి, కూర్చున్న ఆ అమ్మాయిని చూస్తుంటే నాకు యీర్ష్య కలిగింది! అతనెంతఅదృష్టవంతుడు అనుకున్నాను! ముందుకు వెళ్ళి, ప్రేమ సామ్రాజ్యంలో తలమునకలుగా వున్న ఆ యిద్దరి ఆనం దాన్ని భంగపరచటం నా కిష్టంలేక పోయింది! వెనక్కు వెళ్ళిపోదాం అని తటపటాయింపుగా ఆగిపోయాను.

ఇంతలో ఆ అమ్మాయి లేచింది. బాగ్ చేతికి తీసుకుంది. నా కళ్ళు చురుగ్గా అయినాయి! దూరంనుంచి మందంగా వస్తున్న లైటు కాంతిలో ఆ అమ్మాయిని చూడగానే నేను నిశ్చేష్టుడిని అయాను! నా కళ్ళని నేను నమ్మలేకపోయాను! ఆ అమ్మాయి ఎవరో కాదు, జయ! సాక్షాత్తూ నా భార్య! నా మెదడు మొద్దుబారి నట్టయింది.

అతను కూడా లేచాడు! ఒకసారి ఎవరేనాఉన్నారేమోనని చుట్టూచూసాడు! బారుగా చెట్టు క్రింద నీడలోవున్న నన్ను గుర్తించలేదు కాబోలు! లేక ప్రేమో ద్రేకంలోనున్న అతని చూపులు సరిగ్గా చూడలేదో! జయని గాఢంగా కౌగలించు కున్నాడు! పెదవుల మీద ముద్దుపెట్టు కున్నాడు.

మరుక్షణం యిద్దరూ, అక్కడికి కాస్త దూరంలోవున్న కార దగ్గరకి వెళ్లారు.

జయ అతని ప్రక్కన కూర్చుంది, అతను కారు స్టార్ట్ చేసాడు!

కారు వెళ్ళిపోయింది!

నేను అక్కడే చెట్టుక్రింద, స్థాణువులా నిలబడి వున్నాను! నా మెదడు మీద, వేయి విమానాలు దిగినంత భారంగా మోతగా వుంది. (సశేషం)

* * *



# ఛత్రపతి



కలువకొలను సదానంద

"పెద్దవారి మాట చద్దిమూట" అనేది కూడా పెద్దలమాటే! గజపతి తాను పెద్ద అని చెప్పుకోడు, కాని–ఒకటి రెండు మంచిమాటలు చెప్పి, తరువాత "పెద్దవారి మాట చద్దిమూట" అంటాడు ఒక మహారాజుటా. 'మన మహారాజే మనకు దేవుడు' అని ఓ శాసనం చెక్కించి, దాని ప్రక్కనే నిలబడి, వచ్చే పోయేవారితో "దేవునికి మొక్కండి!" అన్నాట్ట!

ఆటువంటి గజపతి – "గొడుగు కొంటున్నారా?" అన్నాడు, నేను బేరమాడుతున్న సమయంలో కనిపించి.

అంగడివాడికి ధర యిచ్చి, గొడుగు పుచ్చుకొని బయటపడ్డాక - నాతోబాటే నడుస్తూ అన్నాడు. "ఇప్పుడు మీరు ఈ గొడుగు కొనుక్కోకుండా వుంటే బాగుండేది. ఇలా అంటున్నానని మరేమనుకోకండి. ఏదో మీ మోజు; నేను కాదనగలనా ? కాని, యిటువంటి వస్తువులు ఒక నెల్లాళ్ళయినా మనదగ్గర వుంటాయని గట్టిగా చెప్పలేము. అలవాటు లేనివి కాబట్టి, ఎక్కడైనా పెట్టి మరచి పోవచ్చు; అవసరం వచ్చిందంటూ స్నేహితుడన్న వాడెవడైనా పట్టుకెళ్ళ వచ్చు; లేదా సమయం చూసి ఎవరైనా కొట్టుకుపోవచ్చు! 'ఇది నాది' అని అను కోవటానికి వీలులేని వస్తువులు యివి. కనుక-నా సలహా ఏమిటంటే, యిటు వంటి వస్తువులు కొనుక్కునేకన్నా డబ్బులు మిగుల్చుకొని వూరుకోవడం ఉత్తమోత్తమం!''

అతని ఈ సలహాలో నూటికి నూరు పాళ్ళు సత్యం ఉందనడంలో సందేహం లేదు. నాకు తెలిసిన చాలామంది మిత్రులు అతను ప్రపచించిన అన్ని విధానాల్లోనూ ఎన్నో వస్తువులను ధారవోసుకున్న సంగతి నేనెరిగిందే!

కాని - ఇంత గొప్ప సలహానిచ్చిన అతని చంకలోనూ ఒక గొడుగుంది. అందువల్ల అతని మాటలు నా కంత సబబుగా లేకపోయినా-వెనువెంటనే-తన వస్తువులను భద్రంగా కాపాడుకోగల సమర్థత ఇతనికి వుండవచ్చును కదా అన్న ఆలోచన కలిగింది.

గొడుగు కొనాలన్న సంకల్పం నాకు కలగడానికి కారణమేమిటంటే-గతించిన రెండురోజుల వర్షంలో నాలుగుసార్లు జలకాలాడ్డమే!

బట్టకు తగులుకొన్న చీకటిపను వదిలించుకొన్నంత జాగ్రత్తగా గజపతిని వదిలించుకొని, సర్వరు నమ్రత, వినయవాక్కులు అనుపానంగా హోటలు తిండిని విధిగా భుజించి, నా నివాసానికి దారితీశాను.

వర్షం వచ్చే సూచనలు కనిపిస్తు న్నాయి. చలిగాలి వీస్తూంది. ప్రశాం తంగా వుంది, ఆ ఆదివారం. చల్లగాలికి హృదయం హాయితో బరువెక్కి పోతూంది. గది తాళం తీసి, బొంగరం త్రాటిని విసిరినంత జోరుగా పరుపు చుట్టను నేలమీద పరచేసి, కాలుమీద కాలు వేసుకుని హాయిగా కళ్ళుమూసుకుని పడుకున్నాను.

మగతనిద్రలో ఉండగా-కలలోంచి మేల్కొల్పినట్లు - గదితలుపులమీద వ్రేళ్ళతో చప్పుడు చేస్తున్నట్లు, పేరెట్టి పిలుస్తున్నట్లు వినిపించింది. మనసులోనే విసుక్కుంటూలేచి వెళ్ళి తలుపు తీద్దును కదా-ఇంకెవరోకాదు-గజపతి!

గుండ్రాతికి కాళ్ళువచ్చి గున గున నడిచినట్లు-చూస్తున్నంతలోనే లోపలికి కదలి వచ్చాడు. 'నిద్రపోతున్నారేమిటి?

నిద్ర మహా చెడ్డది! అలనాటి లక్ష్మణుడు ఎలా జయించగలిగాడో గానీ, మనబోటి వారికది సాధ్యమా ? ఊర్మిళ కొన్ని సంవత్సరాల తరబడి నిద్రపోయిందంటే అందులో ఆశ్చర్యమేముంది ?'' అంటూ తన గొడుగును - వంకెకు - నా కొత్త గొడుగు పక్కన తగిలించాడు.

అతని ధోరణి చూస్తే-అనవసరంగా నన్ను నిద్ర మేల్కొల్పినందుకు ఎంత మాత్రం నొచ్చుకున్నట్లులేదు. నోటి నిండుకూవున్న తమలపాకు ఉమ్మిని కిటికీగుండా బయటకు ఉమిసి-''పగటి పూట నిద్రపోవటం అలవాటు లేక పోయినా, ఎందుకోగానీ-చల్లగా కునుకు వస్తున్నదండీ యీ రోజున' కాసేపు పడుకొని పోదామని వచ్చాను. మీకేమీ యిబ్బంది వుండదుగదా ?'' అన్నాడు.

''అంతమాత్రానికి యిబ్బంది ఏముంటుందండీ...నిద్రాదేవిమీద రోత పుట్టేంతవరకూ నిద్రపోండి!'' అంటూ అతనికి పరుపు తీసి యిచ్చాను.

గజపతి భుజంమీది కండువాను తీసి పడకమీద పడేసి, శరీర భారంతో ఒక్కసారి మూల్గి, పడకమీద చతికిల బడ్డాడు. నా ఆశ్చర్యానికి అవధులు లేనట్లు అరనిమిషానికంతా కండిరీగల రొదలాంటి గుర్రు ప్రారంభమైంది.

మా పరిచయం ఏమంత చెప్పుకో దగినంత గొప్పదికాదు. కానీ, కాలం ఏర్పరచినటువంటి వయోభేదం బట్టి అతనిపట్ల నాకు గౌరవభావం వుండడం సహజమే.

గజపతి రూపం చూపరి హృదయ క్షేత్రంలో లోతైన గోయి ఒకటితీసి, అందులో-అతనొక పెద్దమనిషి, మర్యాదస్తుడు అన్నటువంటి అభిప్రాయాన్ని రాతి స్తంభంలా నాటేస్తుంది. మనిషి ఎర్రగా వుంటాడు. రొట్టెలు తయారు చెయ్యటంకోసం పిసికి వుంచుకున్న గోధుమపిండి ముద్దలా వుంటుంది అతని కాయం. అతని తలకాయ-భుజాలమధ్య ఆకుల్లో క్యాబేజీ గడలా కూరుకుపోయి వుండటంవల్ల అతని మెడ ఉనికి సరిగ్గా తెలియదు. ఎనిమిది మూరల మల్లుపంచెతో గోచీకట్టు, మోచేతులను దాటి మరినాల్గు వ్రేళ్ళమేర ఆక్రమించు కొన్న తెల్లటి చొక్కాచేతులు, భుజం మీద పెద్ద కండువా, జేబులో మసీపర్సు, ఊటకలం, ఏవో ఒకటి రెండు మడిచిన కాగితాలు, ఇంచుమించు చేతి మణికట్టు నంతా ఆక్రమించుకొని వున్న పాతరకపు పెద్ద రిస్టువాచీ, నుదుట తిలకం, ఒక వ్రేలిన ఉంగరం, కాళ్ళకు బరువైన చెప్పులు, చేతిలో దినపత్రిక-వీటివల్ల-ఎటువంటి వ్యక్తికయినా అతనిపట్ల గౌరవభావం కలిగి తీరవలసిందే! అతనిది సమీపంలో ఏదో పల్లెటూరు. మండీ వ్యాపారులతో ఏవో పనులున్నాయంటూ చాలా తరచుగా టౌనుకు వస్తూవుంటాడు.




బయట కళలు మార్చుకుంటూన్న సూర్యదేవుని కాంతిపుంజాలను చూస్తూ ఆలోచించుకుంటూ వుండగానే, కను రెప్పలు నిద్ర బరువుతో వాలిపోయాయి.

నిద్రలో గజపతి "ఇక వెళ్ళొస్తా నండీ" అనడం, నేను సరేననడం, తలుపుతెరిచి మళ్ళీ మూసినట్లు చప్పు డవటం-ఇంతే నాకు తెలుసును.

సాయంకాలం మెలకువ వచ్చి, టైమెంతైందో చూసుకున్నాను అయిదు కావస్తోంది. గజపతి వెళ్ళిపోయినట్లు మాత్రం నాకు గుర్తుంది. గబగబ ముఖం కడుక్కోవడం, తల దువ్వు కోవడం, బట్టలు మార్చుకోవడం వగైరాలు క్షణాలమీద జరిగిపోయాయి. ఇక నా కార్యక్రమాలు రెండే రెండు. హోటలుకు వెళ్ళి కాఫీ తాగటం, అక్కడి నుంచి పట్టాల వెంబడే దూసుకువెళ్ళే రైలుబండిలా సూటిగా క్లబ్బుకు వెళ్ళిపోవడం! ప్రకృతి స్తంభించిపోయి నట్టుంది. ఆకాశం మేఘాలతో నిండిపోయి బుడబుక్కలవాడిపాతగొడుగులా వుంది. మేఘాలు కయ్యాన్ని కోరుతూ - ఒక దాన్నొకటి కవ్వించుకోవడం ఇప్పు డిప్పుడే ప్రారంభమవుతున్నట్లు-సరళం గానే ఉరుముతున్నాయి.

చినుకులు పడుతున్నవేమోనని బయటకువెళ్ళి, ఆకాశానికి సూటిగా నిలబడి తల పైకెత్తి చూశాను. సూది మొనలంతటి సన్నటి చినుకులు కంట్లో ఒకటి, నోట్లో ఒకటి రాలాయి

'పాడు వాన! ఇప్పుడే రావాలీ?' అనుకుంటూ వుండగానే-నాకు గొడుగు కూడా ఒకటున్నదన్న విషయం జ్ఞప్తికి వచ్చింది. సంతోషంతో గదిలోపలికి వచ్చి వంకెకేసి చూద్దునుగదా-నా కను

గుడ్డ పరిమాణం హెచ్చింది. పైదవడకు కింది దవడకు అడ్డంగా మేకునొకదాన్ని నిలబెట్టినట్లు—నానోరు తెరచుకుపోయింది. ఆ సమయంలో ఎవరైనా ఛాయాచిత్ర కారుడు పొంచివుండి నా భంగిమను ఫోటోతీసి 'ఆశ్చర్యాంబుధిలో' అని వ్యాఖ్య వ్రాసి పోటీలకు పంపివుంటే, తప్పకుండా బహుమతి లభించివుండేది. 'ఆశ్చర్యాంబుధిలో' కొంత సేపటివరకు నాకు గుక్క తిరిగిందికాదు. నా కొత్త గొడుగు కొన్ని గంటల్లోనే ముసలిదై పోయింది. ఆ గొడుగును చూస్తుంటే, చీకట్లో వెలిగించిన మతాబులా నా మెదడులో గజపతి మెరిశాడు. గొడుగుల తారుమారుకు కేవలం అతని పొరబాటే కారణమై వుండవచ్చు. వదిలీ వదలని నిద్రమత్తులో ఏ గొడుగు ఎవరిదో గమనించకపోయి వుండవచ్చు. నా గదికి సమీపంలోనే నాలుగు వీధుల కూడలి వుంది. గబగబ అక్కడికెళ్ళి, తనచుట్టూ తాను తిరుగుతూ సూర్య ప్రదక్షిణం చేసే భూగోళంలా ఒక్కొక్క వీధికి అభిముఖంగా నిలబడి చుట్టూవున్న నాలుగు వీధులకేసి దృష్టిని సారించేశాను. సీతనెత్తుకుపోవడానికి ఆ రోజుల్లో రావణాసురుడు పుష్పక విమానంలో వచ్చాట్ట గానీ, ఈ గజపతి తనవెంట ఏ విమానాన్ని తెచ్చుకున్నాడో నాకర్థం కాలేదు.

నిజానిజాలు తెలుసుకోకుండా అతన్ని అనుమానించడం నా వ్యక్తిత్వాన్ని, సంస్కారాన్ని మలినపరచుకోవడమే అవుతుంది. పరువూ ప్రతిష్ఠా వున్న వాడైతే తన పొరబాటుకు క్షమాపణ కోరుతూ నా వస్తువును నాకు అప్పగించి తన వస్తువును తాను తీసుకోకపోడు. అంతవరకు అతని గొడుగును భద్రపరచడం నా విధి

గజపతి గొడుగును ముట్టుకోనైనా ముట్టుకోకుండా గది తలుపు తాళంవేసి చినుకులన్నీ ఒకదానితో ఒకటి కూడబలుక్కునే లోపున హోటల్ చేరుకున్నాను కాఫీ తీసుకురమ్మని చెప్పి, సర్వరు మీదినుంచి చూపులు ప్రక్కకు మరల్చగానే—ఎట్టఎదుట — కాఫీ కప్పును పెదవుల దగ్గరకు చేర్చుకుటూ నా వైపు వోరకంటితో చూస్తున్న గజపతి కనిపించాడు. అతనిచేయి వణికి, కాఫీ కాస్త చింది క్రిందికి జారటం గమనించాను అతను కంటబడగానే నామనస్సులో ఒకమూల ఆశ రేకెత్తింది. అతను నన్నుచూసి "మీ ... మీ ... గొ ... గొ ..." అంటూ తడబడ్డాడు. ఒకేమాటమీద నిలచిపోయిన రికార్డు పాటలా వున్నాయి అతని మాటలు కాస్సేపటికి నింపాదిగా అన్నాడు. "నా గొడుగు మీ గదిలోనే వుండిపోయింది. తెలియక నా గొడుక్కి బదులు మీ గొడుగు తెచ్చేశాను. ఇరవై మైళ్ళ దూరంలోవున్న ఒక వూరికి వెళ్తూ నా స్నేహితుడొకడు మీ గొడుగు

తీసుకెళ్ళాడు. నాదికాదని ఎంత చెప్పినా వినలేదు. ఏం చెయ్యను? రేపు అతను వచ్చినప్పుడు మీ గొడుగు మీకు చేర వేస్తానులెండి..." అతను ఈ మాట లనగానే నా గుండెల్లో బండపడినట్ల యింది. పుస్తకం వనితా విత్తం, మరియు నా ఛత్రం పరహస్తం గతం గతః! పైకిమాత్రం "అట్లాగే కానివ్వండి" అన్నాను.

హోటల్ గడప దాటబోతుండగానే, హోటల్ ముందున్న సీనారేకుల కప్పు దడదడమంది. వరుణదేవుడు భూమిమీద ఒక్కసారిగా విరుచుకు పడ్డాడు. రోడ్డుపై నున్న జనం ఎక్కడి వారక్కడ మాయమైపోయారు కొంత మంది హోటలు ప్రాంగణంలోని రేకుల కప్పు క్రిందికి పరుగెత్తుకొచ్చి తలలు దాచుకున్నారు. గత్యంతరంలేక నేనూ నిముషాలు లెక్కించుకుంటూ, అరగంట సేపు అక్కడే ఆగిపోయాను. వర్షం ప్రారంభమైన కొద్దిసేపటికే వీధిలో కొన్ని గొడుగులు తచ్చాడ్డం మొద లైంది. గజపతి నా వెనుక నిలబడి—"అయ్యబాబోయ్! ఈ వర్షంలో మూడు మైళ్ళు ఎలా నడిచి వెళ్ళగలను?" అంటూ తన భయాన్ని వెళ్ళగక్కాడు. అతనిమీద నాకు జాలి కలిగినా, నా చేతనైన సహాయం అతన్ని ఓదార్చ డమే! "మీ గొడుగును నేనైనా తెచ్చినవాణ్ణి కాను; మీరి వర్షానికి భయ పడవలసి వచ్చేదికాదు" అన్నాడు అతన్ని అనునయిస్తూ.

ఇంతలో రోడ్డుమీద గొడుగుక్రింద సురక్షితంగా నడిచి వెళ్తున్న నా మిత్రుడు కంటబడగానే నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది. గ్రద్దనుచూసి బెదిరి తల్లి రెక్కలక్రిందికి పరిగెత్తే కోడి పిల్లలా అతని గొడుగుక్రింద దూరాను.

* * *

గజపతి ఆ తర్వాత రెండురోజుల వరకుగానీ కనిపించలేదు. ఆ రెండు రోజులు అతని దర్శనంకోసం అల్లాడి పోయాను. గజపతి మాటల్లో మళ్ళీ నాకు నిరాశే ఎదురైంది. "నేను ముందే చెప్పాను-ఇటువంటి వస్తువులను మనం భద్రపరచుకోలేమండీ-అని. నా సలహా వినివుంటే ఇం దా కా వచ్చేదికాదు. ఊరికే అన్నారా, పెద్దలమాట చద్ది మూట అని? గొడుగెత్తుకెళ్ళిన మిత్రుడు వల్లకాటికి వెళ్ళినట్టే వున్నాడు. అయినా ఇప్పుడేమైందిలే! అతను మళ్ళీరాకపోడు. వచ్చినప్పుడు మీ గొడుగు మీకు అప్పగించే పూచీ నాది. అంతవరకు నా గొడుగును మీ దగ్గరే వుండనివ్వండి," అంటూ కనిపించినవాడు కనిపించినట్లే వెళ్ళిపోయాడు.

ఆ పిదప ఒక నెలరోజులు గడిచి పోయాయి. ఈ నెలరోజుల పొడుగునా గజపతి నా పాలిట ఒక వింతమాదిరిగా మాత్రమే వుండిపోయాడు. అతను

కనిపించడం అరుదైంది. కనిపించినా అతనికీ నాకూ మధ్య ఏ ఫర్లాంగు దూరమో వుండేది. దగ్గరకు వెళ్ళగానే- 'శ్రీకృష్ణుడు ఏ చెట్టుచాటున దాగినాడో, ఏ పుట్టమాటున నక్కినాడో-' అంటూ తికమక పడిపోయే గోపిక అవస్థలా వుండేది నా పని.

నా కొత్తగొడుగును గురించిన సమస్య నన్ను బాధించడంలేదు గాని, గజపతి విడిచిపోయిన పాతగొడుగే కొత్త సమస్యగా పరిణమించింది నా దైనందిన జీవితంలో అదొక అసంతృప్తిగా, మనస్సులో ఒక మచ్చగా నిలిచిపోయింది.

గొడుగు ఎంత పాతదంటే - గుడ్డ రంగు చాలావరకు మాసిపోయింది. గొడుగు శీర్షభాగంలో కుట్లు సడలి పోయాయి. లోపల కమ్మీలు ఒకటి రెండు వూడిపోయి వున్నాయి. కర్ర పుచ్చిపోయి సన్నటి బెజ్జాలతో నిండి పోయింది. గజపతి దీన్నికూడా తీసుకుని వెళ్ళిపోయివుంటే బావుండేది నేను గదిలో వున్నప్పుడు ప్రతి నిమిషం ఇది నా కంటబడుతూంటే, గజపతితోబాటు నా క్రొత్తగొడుగు జ్ఞాపకం వచ్చేది. కాలిలో ముల్లులాగా ఏదో వెలితి నా మనస్సును పీడించేది.

గజపతి ఆ గొడుగును ఎక్కడ, ఎలా వుంచిపోయాడో-అక్కడ అలాగే వుండిపోయింది. దానితో నాకు అవసరం వున్నా ఎప్పుడూ ఉపయోగించలేదు. దాన్ని చేతబుచ్చుకొని వీధులవెంట వెళ్ళాలంటే నాకు సిగ్గనిపించింది. అందు చేత దాని శిథిలరూపం నా కెంతమాత్రం ఉపయోగకరం కాకపోగా, చరిత్ర పుటల్ని త్రిప్పిచూపించే శిథిల దుర్గంలా కేవలం ఒక స్మృతి చిహ్నంగా మాత్రమే నిలిచిపోయింది.

వర్షాకాలం పేరుతో అప్పుడప్పుడూ వానలు కొద్దో గొప్పో కురుస్తూనే వున్నాయి. నా బాధ నేను పడుతున్నానే గానీ, నా కోసం పాత గొడుగును మాత్రం ఎప్పుడూ బాధించలేదు ఒక నాటి ఉదయం సన్నసన్నగా తుంపర రాలుతూంటే ఒకానొక ఆప్తమిత్రుడు వచ్చి, తొందరపనిమీద ఏదో పల్లెకు వెళ్ళిరావాలని చెప్పి గొడుగు ఇమ్మని అడిగాడు. ఇచ్చాను. ఆ రోజు సాయం కాలం నుంచీ రాత్రి తొమ్మిది, పది గంటలదాకా భూమ్యాకాశాలు దద్దరిల్లి పోయేటట్లు ఎడతెరిపిలేకుండా గొప్ప వర్షం కురిసింది. గది కిటికీ రెక్కలు ఫెడేల్ ఫెడేల్ మంటూ కొట్టుకున్నాయి. వానజల్లు లోపలికి వచ్చిపడి, గదంతా నీళ్ళ మడుగైపోయింది వీధుల్లో వరదలు ప్రవహించాయి. చరమావస్థలో వున్న మొండిగోడలు కొన్ని కూలిపోయాయి.

మరునాటి ఉదయం గదినుండి బయలుదేరబోతుండగా - పాత గొడుగు తీసికెళ్ళిన మిత్రుడు లోపలికి వచ్చాడు.

అతని చేతిలో ఏదో గోతంచుట్ట వుంది. అతడు ఉలుకూ పలుకూలేక గోతం చుట్ట విప్పాడు. అందులోనుంచి జానెడేసి కర్రముక్కలు మూడు బయటికి లాగాడు. ఆ తర్వాత కొన్ని వంగి పోయిన కమ్మలు, చీలికలు పీలికలైన నల్లగుడ్డ-వీటినంతా-పళ్ళెరంలో అర్చన ద్రవ్యాలుంచి పూజారికిచ్చినట్లు ఒకచోట కుప్పగా పేర్చి జాలిగా నా వైపు చూశాడు. నాకు కోపం ముక్కువరకు నవ్వు నోటివరకు వచ్చి ఆగిపోయాయి.

"వర్షంలో నా మానాన నేను నడిచి వస్తూంటే వెధవ సుడిగాలి వచ్చి నన్నే కౌగిలించుకోవాలీ? ... " అంటూ ప్రారంభమైన అతని సాహసగాధను అంతటితో తెంపేస్తూ "ఏడవలేక పోయావ్? అక్కడే పారేసి రాకుండా యిక్కడికెందుకు ఏరి తెచ్చావ్?" అని, అతని చేతిలోని సంచి లాక్కుని, గొడుగుకు సంబంధించిన వివిధ భాగా లన్నీ అందులోవేసి యధాప్రకారంగా చుట్టచుట్టి చేతబట్టుకుని, గదికి తాళంవేసి అతనితోబాటు బయటపడ్డాను. నా గదికి ఒకవైపు అతి సమీపంలో పంట పొలాలున్నాయి. వాటి మధ్య ఒక పాడుబడిన మోటబావివుంది అందులో అట్టడుగున ఎక్కడో ఎర్రటి వాననీరు నిలిచివుంది. అక్కడికివెళ్ళి, సంచివిప్పి అందులోని ఒక్కొక్క భాగాన్ని తీసి బావిలోకి విసిరేశాను. "నిన్న వానలో తడిసి జబ్బుచేసింది. ఆస్పత్రికి వెళ్ళొస్తా" నంటూ ఖాళీసంచిని తీసి చంకన పెట్టుకుని మిత్రుడు వెళ్ళి పోయాడు. నేను బజారువైపు దారి తీశాను.

నెలరోజుల తర్వాత ఆనాటికి నా మనసు చల్లబడింది. ఏ నిరుపయోగ కరమైన వస్తువైతే నన్ను అసంతృప్తి పాలుజేసిందో, అది యికమీదట కంటి కైనా కనిపించదు దాన్ని యిక పూర్తిగా మరిచిపోవచ్చు. నాలోని బరువు మాయమైపోయి, మనస్సు తేలికపడింది.

హోటల్ సమీపిస్తుండగా - అనుకో కుండా-గజపతి కనిపించాడు. నన్ను చూసి "మరి ... మీ గొడుగు ... మీ గొడుగు..." అంటూ తొట్రుపడ్డాడు. నా మనస్సులోనుండి మాటలు చకచకా తేలిగ్గా బయటకి దూకేశాయి. "ఆ బెంగ యికమీదట మీ కనవసరంలెండి నేను అడగదల్చుకోలేదు. ఎందుకంటే, మీ గొడుగు నామరూపాలు లేకుండా పోయింది. నిన్నటి చిన్న సుడిగాలికి తన ముసలి తనువును చాలించింది, పాపం!..." అంటూ ముందుకు కదల బోయాను. గజపతికి ఈ వార్త సంతోష దాయకంగా వుంటుందనుకున్నానుగానీ, అతడు మరోలా వాపోగలడని నేను కలలోకూడా అనుకోలేదు "అ! అం! ఎంతపని జరిగింది! నా గొడుగు

పోయిందా ? అది నాకు ప్రాణ సమాన మైనదే! మా తండ్రి పోతూ పోతూ- దాన్ని నా కిచ్చిపోయారు. అదేమీ లెక్క రోజనాలు విలువ చేయకపోయినా, దాన్ని చూస్తూ మా నాన్న యింకా బ్రతికేవున్నాడని అనుకునేవాడిని. మా అమ్మ అంటూనే వుండేది పాపం — 'ఒరేయ్, దాన్ని బయటికెక్కడికీ తీసుకుపోవద్దురా. దాన్ని పోగొట్టేవరకు నువ్వు నిద్రపోవేమిట్రా?' అని. ఆమె మాట వినకపోయాను. వూరికే అన్నారా పెద్దలమాట చద్దిమూట అని ? మీ గొడుగుని నిన్న తీసుకొచ్చి యిచ్చాడు నా మిత్రుడు. ఇప్పుడు యింటినుండి వస్తూ తెచ్చి మీ కిచ్చేద్దామనుకుని మర్చి పోయాను. ఇంతలో జరగవలసిందేదో కాస్తా జరిగిపోయింది. సరే! సెలవండీ యిక..." అంటూ ప్రశాంతంగా ముందుకు సాగవారాడు గజపతి. ఆ క్షణం వరకు తెలుసుకోలేకపోయాను. ఇతడు ఏ ఎండకు ఆ గొడుగు పట్టగల సమర్థుడని.

* * *

ఆ మరునాడు-సెగలు గక్కుతున్న ఎండలో గొడుగు క్రింద నీడలో గున గున నడిచిపోతూ కనిపించాడు గజపతి. అది నెలరోజుల క్రితం నా కష్టార్జితంతో కొన్న కొత్త గొడుగు.

అతడు గొప్ప సామ్రాజ్యాన్ని ఆక్రమించుకొన్నంత ఉత్సాహంతో, ఠీవితో ఛత్రచ్ఛాయనంతా ఆక్రమించు కొని, తమలపాకు నములుతూ, ఎడమ చేతితో గొడుగును అటూ ఇటూ చిన్నగా త్రిప్పుకుంటూ, దినపత్రిక వున్న చేతిని స్ప్రింగులా ముందుకూ వెనకకూ ఊగించుకొంటూ నడిచిపోతున్నాడు. ఒకసారి నా వైపు చూసుకున్నాను. ఎండకు ఒళ్ళంతా చెమటలు గ్రక్కుతూ వుంది తల మాడిపోతూంది. అతను గొడుగు నీడలో చల్లగా, సెలయేరులా పోతున్నాడు. అతని వైపు చూడాలంటే, అతని కంట బడాలంటే కూడా నాకు తల కొట్టేసినంత సిగ్గువేసింది. కానీ, తన ఆలోచనలతో తనకేమీ నిమిత్తం లేనట్లు నన్ను చూసి ఒక్క చిరునవ్వు మాత్రం విసిరి, గొడుగును ఈ చేతి నుండి ఆ చేతికి మార్చుకుని నన్ను దాటిపోయాడు గజపతి...కాదు కాదు... ఛత్రపతి!



# అత్తగారికి ఒకొత్తచీర!

కొండముది రుక్మిణీదేవి



పెద్దపండగ దగ్గరకొస్తున్నది. గత నెలరోజులుగా ఒకటే హడావుడి. పిల్లలు సంక్రాంతి ముగ్గులు వెయ్యటం తోనూ, గొబ్బిళ్ళు పెట్టడంతోనూ హడావుడిగా వుంటే, ఇంటి యజమానులు పండిన పంటను ఇళ్ళకు చేర్చి దాన్ని జాగ్రత్త చెయ్యటంలో నిమగ్నులైనారు. ఆడవాళ్ళు ఇళ్ళకు వెల్లలు వేయించి, గుమ్మాలకు పసుపు కుంకాలు పెట్టి, కొత్త అల్లుళ్ళ రాకకు ఎదురు చూస్తున్నారు.

వర్ధనమ్మ వంటరిగానే వుంటున్నా అందరిలాగా అంత హడావుడీ పడుతున్నది తమ మండువా ఇంటికి వెల్లలు వేయించింది. గుమ్మాలకు పసుపు కుంకాలు పెట్టించింది. కొత్తధాన్యం రాగానే అటుకులు కొట్టించింది. ఇళ్ళు కడిగి ముగ్గులు కూడా పెడుతున్నది. మళ్ళీ

పిల్లా జెల్లా వస్తే తొక్కి పాడుచేస్తారు అరి వుంటుందికదా అని. వర్ధనమ్మకు నలుగురు కొడుకులు. పెద్దతను కలకత్తాలో ఏదో కంపెనీలో చేస్తుంటే, రెండో అతను మొన్నీమధ్యనే కంచి దగ్గర ఏదో వూరికి ట్రాన్స్‌ఫర్ అయినట్లు రాశాడు. మూడోవాడు గూడూరు దగ్గర, నాలుగోవాడు నల్గొండలో వుంటున్నారు. కొడుకులందరూ తలాఒక చోట వున్నా వర్ధనమ్మ మాత్రం, ఇంటి పట్టునేవుండి, వున్న పొలం సొంత వ్యవసాయం చేయిస్తుంది. తలరాత తారుమారైనా, గుండె దిటవు చేసుకుని, నలుగురు కొడుకుల్ని ప్రయోజకుల్ని చేసింది. అంతేకాదు పెళ్ళిళ్ళు చేసి, ఎవరి కాపురానికి కావల్సిన హంగులు వాళ్ళకు ఏర్పరచింది. వర్ధనమ్మ నలుగురు కొడుకులు ఎంతెంత దూరాన వున్నా ఈ సంక్రాంతి పడక్కమాత్రం తల్లిదగ్గరకే వస్తారు తప్పకుండా! అందుకనే ఈ పండక్కి మాత్రం ఆవిడకు ఎక్కడలేని హడావుడి. "పెద్దాడి రెండో కూతురికి నడక వస్తున్నదని రాశాడు, రెండోవాడి మూడో కొడుకు ఈపాటికి పారాడుతుండాలి" అని మురిసిపోతున్న వర్ధనమ్మను, "అమ్మగారూ! చీరలు జరీచీరలు తీసుకు వచ్చా!" అంటూ కేకవేసింది వాడుకగా చీరలిచ్చే వెంకటలక్ష్మి.

"తన నలుగురు కొడుకులు సంపాదనపరులైనారు. నలుగురు నాలుగు చీరలు తెస్తారు." వర్ధనమ్మ ఆలోచిస్తుండగానే,

"మంగమ్మగారూ, మాణిక్యమ్మగారూ పెద్ద జరీ చీరలు రెండేసి కొన్నారు. మీరూ రండమ్మా త్వరగా." తొందర పెట్టింది వెంకటలక్ష్మి.

"ఇప్పుడొద్దులే, తరవాత కనపడు." బయటకు వెళ్ళకుండానే అని, నలుగురూ తీసుకురాకపోయినా, ఏ ఒక్కరు తీసుకు వచ్చినా నాకీ పండగ వెళ్ళిపోతుంది అనుకున్నది. పండగ యింకా నాలుగు రోజులే వున్నది. బహుశా ఎల్లుండికి అందరూ వచ్చేస్తారు. అరిశెలు, మిఠాయి చెయ్యటం ఎప్పటికి అవుతుందో...? వర్ధనమ్మకు ఒకటే హడావుడి. అప్పుడే సుందరమ్మ కూతురు, పిల్లలు వచ్చేశారుట. అల్లుడు పండగనాడు వస్తాట్ట తులశమ్మ ఇందాకనే వచ్చి చెప్పివెళ్ళింది కొడుకు, కోడలు వచ్చేసారని.

సంవత్సరం పొడుగునా నిద్దర పోయిన ఈ యిల్లు పిల్లలున్న నాలుగు రోజులు కళకళ్ళాడుతుంది. క్రిందటి సారి వచ్చినప్పుడు శశి పసిపిల్ల. ఇప్పుడు బామ్మ బామ్మ అంటూ తనవెంటే వుంటుంది...?! అసలు తనని గుర్తు పడుతుందో లేదో!? వర్ధనమ్మ ఆలోచనలకు అంతరాయంగా వీధిలో రిక్షా ఆగింది. చేతిలోవున్న అరిశెల గరిటెలు పక్కనపెట్టి ఎవరా అని తలెత్తి

చూసింది. పెద్దకొడుకు, కోడలు, పిల్లలు రిక్షా దిగి లోపలకు వస్తున్నారు. వెనకనుంచి రిక్షావాడు రెండు సూట్ కేసులు, పెద్ద బెడ్డింగు, ఎయిరుబ్యాగు తీసుకువచ్చి వరండాలో పెట్టాడు. వర్ధనమ్మ వాళ్ళకు ఎదురు వెళ్ళింది. మనవలు "బామ్మా!" అంటూ కాళ్ళకు చుట్టుకున్నారు. మనవరాలు తల్లి చంకలోనే వుండి, వర్ధనమ్మవైపు చూసి మొహాన్నింత చేసుకుని నవ్వింది. "ఎంత దూరాన వుంటే మాత్రమేం! రక్త సంబంధం ఎక్కడికిపోతుంది," అనుకుని, మనవరాలివైపు చేతులు జాపింది. తల్లి చంకలోనుంచి ఒక్క దూకు దూకింది ఆ పసిపిల్ల. "మా అమ్మే! నీకు బామ్మ తెలుసా!?" అంటూ గుండెలకు అదుముకున్నది. మనవలు కాళ్ళకు చుట్టుకుని వదలటంలేదు. "వుండండిరా! ఆ అరిశెలపని పూర్తి చేసి వస్తాను," అని వర్ధనమ్మ అంటే "మీరు పిల్లల్ని దగ్గర కూర్చోపెట్టు కోండి. ఆ పని నేను చేస్తాను" అన్నది కోడలు సావిత్రి.

"అమ్మా! అరిశెలు చేస్తున్నావా? నీ కెందుకమ్మా శ్రమ. కోడళ్ళంతా వచ్చిన తరువాత, వాళ్ళు చెయ్యరూ?" కొడుకు సత్యం అన్నాడు.

"ప్రయాణాలు చేసివచ్చి వాళ్ళేం చేస్తారు? అయినా ఇవన్నీ పాతకాలం వంటలు ఇవి నేను చేస్తే వాళ్ళొచ్చి కొత్త రకాలు చేస్తారు ముందు ఈ రెండు తిను" అంటూ ప్లేటు అందించింది.

మాత్రైతే అన్నాడుగాని సత్యానికి తెలుసు కొన్ని కొన్ని వంటలు చెయ్యటంలో తల్లిని మించినవాళ్ళు లేరని. అందుకే ఆప్యాయంగా తిన్నాడు.

ఆ రాత్రి పొయ్యిదగ్గరికి రానివ్వలేదు అత్తగార్ని సావిత్రి. వంటకూడా తనే చేసింది. ఆ వేళ వాళ్ళెవరూ నిద్రపోలేదనే చెప్పాలి. సిటీలో ఇబ్బందులు, పిల్లల కబుర్లు సావిత్రి, సత్యం చెపితే, తన వంటరితనం, స్వంత వ్యవసాయంలో ఎదురవుతున్న సాధక బాధకాలు వర్ధనమ్మ చెప్పింది.

తెల్లవారేసరికి మిగతా కొడుకులు, కోడళ్ళు, పిల్లలు వచ్చేశారు. వున్న రెండు గేదెలపాడి సరిపోక పైనుంచి రెండు శేర్ల పాలు తెప్పించింది.

"రెండో కోడలు ఈ మధ్యనే ఉద్యోగంలో చేరిందని రాశాడు. ఈసారి పనిపాటలు చేస్తుందో లేదో?..." అని అనుమానించిన వర్ధనమ్మ, నాలుగు మూల్లా తెల్లవారకుండానే అందరికీ కాఫీలు, టిఫిన్లు తయారుచేస్తున్న కోడల్ని చూసి "నా కోడళ్ళు ఏమీ మారరు'' అనుకున్నది.

పిల్లలు ఆమెను వదలటంలేదు ఆమె ఎక్కడికి వెళ్తే అక్కడికి, "మేమూ వస్తాం"అంటూకొంగుపట్టుకుంటున్నారు.

ఇంత సందట్లో రెండురోజులు రెండు క్షణాల్లా గడిచిపోయాయి ఆవేళ భోగి.

పిల్లలందరూ భోగిమంటలు వేశారు. మనవరాళ్ళు బొమ్మలకొలువు పెట్టారు. తలంట్లు, భోజనాలు అయ్యేసరికి వంటి గంట దాటిపోయింది. సాయంకాలం భోగిపళ్ల పేరంటం. నలుగురు కోడళ్ళు పట్టుచీరలు కట్టుకున్నారు. మొగ పిల్లలకు బెల్‌బాటమ్స్, చెడ్డీ నిక్కర్లు ఫుల్‌లెన్ అమెరికన్ జాకెట్లు, ఆడపిల్లలకు రెడీమేడ్ ఫ్రాకులు, జీన్స్, స్కర్టులు రకరకాల బట్టల్లో పిల్లల్ని చూస్తున్న వర్ధనమ్మ,

"వాళ్ళకు నా దిష్టే తగలదుగదా?" అనుకున్నది. పేరంటం కూడా ఎంతో గ్రాండుగా చేశారు. మామూలుగా అందరూ పంచిపెట్టే శనగలు, అరటి పళ్ళు, తాంబూలాలే కాకుండా పెద్ద కోడలు తీసుకువచ్చిన ప్లాస్టిక్ పళ్ళాలు, రెండో కోడలు తీసుకువచ్చిన స్టీలుపూత కుంకం బరిణెలు భోగినాడు పంచిపెట్టే మూడో కోడలు నాలుగో కోడలు తీసుకు వచ్చిన ప్లాస్టిక్ బుట్టలు, డబ్బాలు మర్నాడు బొమ్మల పేరంటానికి అట్టిపెట్టారు.

నాలుగు చోట్ల వున్న కోడళ్ళు పండక్కో, పబ్బానికో అత్తవారింటికి వచ్చినా, పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకు వెళ్ళిన ఆడపడుచులు పుట్టింటికి వచ్చినా ఆ ఇంట్లో సందడి, సరదాలు చూడ వలసిందే కాని, చెప్పనలవికాదు. అలాగే వర్ధనమ్మకు ప్రతిపనిలోనూ సాయం చేస్తున్న కోడళ్ళు "కోడళ్ళంటే ఇలా వుండాలి సుమా!" అన్నట్లున్నారు.

ఆ వేళ పెద్దపండుగ, అందులోనూ కాస్త పల్లెటూరేమో, యింటికి వచ్చిన వాళ్ళు, ఇంట్లోవాళ్ళే కాకుండా పెట్టు బళ్ళు ఎక్కువగానే వుంటాయి. చాకళ్ళు, పాలేర్లు, పనివాళ్ళే కాకుండా, కాస్త తెలిసినవాళ్ళు, తెలీనివాళ్ళు కూడా "అమ్మగారు" అంటూ వస్తారు. ఇలా బయట పెట్టుబళ్ళే కాకుండా, ఏ కొడుక్కి ఏవి ఇష్టమో, పేరు పేరునా చేస్తున్నది వర్ధనమ్మ. వాళ్ళంతా పెద్దవాళ్ళయి, సంపాయిస్తూ, సంసారాలు చేస్తున్నా, తల్లి దగ్గరున్న నాలుగురోజులు తమింకా చిన్నపిల్లల్లాగానే ఫీలవుతారు. పండగ రోజు వర్ధనమ్మకు అసలు తీరికేలేదు. కోడళ్ళు, పిల్లలు, తాము కొనుక్కున్న కొత్తబట్టలు కట్టుకునే ప్రయత్నంలో వున్నారు.

పెద్దకోడలు తను కొనుక్కున్న గద్వాలచీర కట్టుకుంటుంటే, సత్యం అన్నాడు. "అమ్మ కొత్తచీర కొనుక్కున్నదో లేదో...!" అని.

"ఆమె ఎందుకు కొనుక్కోదు. బోలెడు డబ్బు చేతిలో వుండగా?" భార్య సమాధానం తృప్తిగా లేకపోయినా 'అదీ నిజమే!' అనుకున్నాడు.

రెండో కోడలు పండక్కి కొనుక్కున్న కంచి పట్టుచీర కట్టుకుని, అత్తగారి దగ్గరకు వచ్చి "ఈ చీర ఎలావుంది? నేను ఉద్యోగంలో చేరానని మీ కొడుకు కంచి వెళ్ళి కొనుక్కొచ్చి నాకు ప్రజంటు చేశారు. కంచిలో చీరలు

చాలా బావున్నాయిట. చాలా చవక కూడాను. మీకు ఒకటి తెద్దామంటేమీకు ఏ రంగు కావాలో...అనితీసుకోలేదు."

ఆ మాటకు వర్ధనమ్మ నవ్వుకున్నది. "తనకు ఎన్ని రంగుల పట్టుచీరలున్నా యని, లేని రంగు కొందామనుకోవటం," అనుకున్నది మనసులో.

అమెరికన్ జార్జెట్ చీరకు పసుపు పెడదామా? వద్దా? అని మూడోకోడలు అనుమానపడుతుంటే మొగుడు గదిలోకి వచ్చి, 'నువ్వు కట్టుకుంటున్నావు బాగానేవుంది. అమ్మ ఇంకా పాతచీర తోనేవున్నది. కొత్త చీర కొనుక్కు రమ్మంటుందేమో అడిగిరా!'' అన్నాడు.

''మీది మరీ చోద్యం. క్రిందటేడు మనమే ఒకచీర కొనుక్కొచ్చాం ఆమెకు. రెండో కోడలుకూడా సంపాయిస్తున్న దిట...! అయినా ఆమెకు మీరొక్కరేనా కొడుకు...? మిగతావాళ్ళు...?"

"ఇంతకీ మనం కొనక్కర్లేదంటావ్? సరే కాని...'' అంటూ చెప్పులు తొడు క్కుని బయటకు వెళ్ళాడు.

పేరంటానికి ఒక్కొక్కరే వస్తు న్నారు. వర్ధనమ్మ వంటింట్లోనే సత మతమౌతూ, "అమ్మాయ్ సుధా! యింకా నీది కాలేదా.'' అంటూ కేక వేసింది నాలుగో కోడల్ని.

"సుధా! అందరూ కొత్త బట్టలు కట్టుకున్నారు. అమ్మ సంగతి అన్నయ్య లెవరూ గమనించినట్లు లేదు. నేనువెళ్ళి ఏదో ఒకచీర కొనుక్కొస్తాను.'' నాలుగో కొడుకు కొంచెం బాధగా అన్నాడు.

'అవునండీ! పాపం అత్తయ్యకు ఎవ్వరూ కొన్నట్లులేదు. మనం కొంటే బాగానే వుంటుంది. ఆమె సంతోషిస్తుంది కూడాను. కానీ..."

''ఏమిటి సుధా?''

'మీరు ఈ మధ్యనే ఉద్యోగంలో చేరారు. పైగా మనం వుంటున్నది దూరాభారం. తీసుకువచ్చిన డబ్బు ఖర్చయిపోతే......

అయినా కావాలంటే అత్తయ్యే వెళ్ళేటప్పుడు ఇస్తారనుకోండి. ఏమైనా సంపాదనపరులైన తరువాత ఆమె ముందు చెయ్యి జాచటం.... ఆలోచించండి...'' అన్నది పోలిఎస్టరు చీర కుచ్చెళ్ళు సవరించుకుంటు. వంట యింట్లో యింకా ఆ పనీ, ఈ పనితో సతమత మవుతున్న వర్ధనమ్మకు ఈ మాటలన్నీ వినపడుతూనే వున్నాయి.

''మీకు ఎంత ముందు చూపుందిరా! కొడుకుల్ని కన్ననాడు, పెంచి పెద్దచేసి అడ్డమైనవాళ్ళ కాళ్ళు పట్టుకుని, చదువు సంధ్యలు చెప్పించి, వ్యక్తుల్ని చేసిన్నాడు ఒక్క స్వార్థపు ఆలోచనకూడా నాకు రాలేదు. నా పిల్లలు పెద్దవాళ్ళు కావాలి. పెద్ద పెద్ద పదవుల్లో వుండాలి అనే అనుకున్నాను గాని...అత్తగారికో కొత్త చీర కొనటానికి వంతులు, వచ్చుదాలు వస్తాయని వూహించనన్నా లేదు.... మీరు కొడుకుల తల్లిదండ్రులే!'' అను కున్నది వేదాంత ధోరణిలో వర్ధనమ్మ!

———




ఆ రోజు ఉదయం పదిగంటలకి యూనివర్సిటీలో ఇంటర్వ్యూ వుంది ఆనందరావుకి.

ప్రొద్దున్నే లేచి కాలకృత్యాలు ముగించుకొని, కావలసిన సర్టిఫికేట్లూ అవీ యివీ సమకూర్చుకునేసరికి తొమ్మిది గంటలైపోయింది.

ఇంటర్వ్యూకి యింకోగంట టైముంది. ఇప్పుడు బయలుదేరితేనేగాని ఏ సిటీ బస్సో అందుకొని కొంచెం ముందుగా యూనివర్సిటీకి చేరుకోలేం.

కాఫీ త్రాగి బయలుదేరటానికి సిద్ధమవుతూండే ఆనందరావు తల్లి అంది—

"ఒరేయ్ బాబూ! బయలుదేరే ముందు ఎవరొస్తారో కాస్త చూచుకొని మరీ బయలుదేర్రా."

నిజానికి ఎప్పుడూ తన తల్లే ఎదురొచ్చేది—ఏ శుభకార్యార్థమై తను బయలుదేరుతున్నా. కాని సంవత్సరం క్రితం తన తండ్రి చనిపోవడంతో తనకా అదృష్టం లేకుండా పోయింది.

"అలాగేనమ్మా" అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు ఆనందరావు—టేబిల్ మీది ఫైలు చేత్తో పట్టుకొని.

లేచి నిలబడిందే తడవుగా ఎవరో 'హచ్' మంటూ తుమ్మారు.

ఉలిక్కిపడ్డాడు ఆనందరావు.

"ఎవరో తుమ్మినట్లున్నారా అబ్బాయ్! కాసేపు కూర్చొని మరీ బయలుదేరు" అంది ఆనందరావు తల్లి-కాళీ కాఫీ కప్పు అందుకొని లోపలి కెళ్తూ.

చేసేదిలేక కుర్చీలో కూర్చుండి పోయాడు ఆనందరావు

ఐదు నిముషాలు గడిచాయి.

ఆనందరావు లేచి నిలబడ్డాడు మళ్ళీ. ఈసారి ఎవరూ తుమ్మిన శబ్దం వినబడ లేదు. ధైర్యంచేసి రెండడుగులు వేశాడు.

అంతే!

నల్లపిల్లి కాళ్ళకు అడ్డుపడింది. మళ్ళీ హతాశుడై పోయాడు.

ఇదేమిటి చెప్మా! ఇలా అపశకునాల మీద అపశకునాలు ఎదురౌతున్నాయ్. ఇంత శ్రమపడి ఇంటర్వ్యూకి వెళ్ళినా సెలెక్టవుతానో లేదో-అనుకొన్నాడు ఆనందరావు.

నిజానికి కాళ్ళకు అడ్డుపడిన పిల్లి తమ పెంపుడు పిల్లే. తన తండ్రి బ్రతికున్నరోజుల్లో ఇంట్లో ఎలుకల బాధ భరించలేక ఎక్కడినుండో ఓ పిల్లి కూనని పట్టుకొచ్చాడు. అదే యిది. అయితే-అప్పటినుండీ ఎలుకల బెడదైతే యింట్లో సమసిపోయిందిగానీ, యిలా యింట్లోవాళ్ళు ఏ శుభ కార్యార్థమో బయలుదేరుతుంటే-నేనున్నానంటూ-కాళ్ళకు అడ్డపడుతుంది ఎంత పెంపుడు పిల్లయితే మాత్రం పిల్లి పిల్లేగదా! పిల్లి ఎదురయితే బయలుదేరకూడదని తన తండ్రి బ్రతికున్న రోజుల్లో చెబుతూ వుండేవాడు. ఆయన తరం గడిచి పోయింది. కాని ఆయన ప్రతిపాదించిన ఆచార వ్యవహారాలు మాత్రం మా ఇంట్లో నిలిచిపోయాయి. ఆయన ఆచారాలే తనకూ వచ్చాయంటారు అందరూ

కాని-ఏ మూలనుండో అప్పుడప్పుడూ అనిపిస్తుంది ఆనందరావుకి-ఇంత చదువూ చదివి ఇంటి వెనకాల చచ్చినట్లు, యిలా ఈ మూఢనమ్మకాలను భుజాన వేసుకొని తిరుగుతున్నా నేమిటి చెప్మా-అని కాని అంతలోనే తన తండ్రి జ్ఞాపకం వస్తాడు. తనకు జరిగిన సంఘటనలు జ్ఞాపకం వస్తాయి. ఆ వెంటనే గుండెల్లో మరో మూల ఎక్కడో కలుక్కుమంటుంది. ఈ ఆచార వ్యవహారాలను పాటించకపోతే సంభవించే అనర్థాలు ఎంత దారుణంగా వుంటాయోనని భయపడిపోతాడు.

అందుకే—వెనక్కి తిరిగి మళ్ళీ కుర్చీలో కూలబడిపోయాడు ఆనందరావు.

అతడికి మహా చికాకుగా వుంది. ఇంటర్వ్యూలో ఎటువంటి ప్రశ్న లడుగుతారో తెలీదు. ఆదిగులు ఒక ప్రక్కన మనస్సును పట్టి పీడిస్తుంటే, ఈ శకునాలు ఎదురై మరో ప్రక్క మనసుని అల్లకల్లోలం చేసేస్తున్నాయి.

మరో అయిదు నిముషాలు భారంగా గడిచాయి.

లేచి నిలబడ్డాడు ఆనందరావు.

ఈసారి ఎవ్వరూ తుమ్మలేదు. పిల్లి కూడా కాళ్ళకు అడ్డుపడలేదు. ధైర్యంగా ముందుకు అడుగులు వేసుకుంటూ వీధి గుమ్మం దాటాడు. వీధిలో పడ్డాడు బారెడు దూరం నడిచాడో లేదో మళ్ళీ అపశకునం.

గుండెలో రాయిపడింది ఆనంద రావుకి.

ఇలా అయితే యిక ఇంటర్వ్యూకి వెళ్ళినట్లే — చిరాకుపడిపోయాడు ఆనందరావు.

దూరంగా ఓ ఆకారం ఆ శాల్తీకి తల మీద వెంట్రుకలు సున్నా. సున్నని గుండు మీద, తెల్లని మల్లుగుడ్డ ముసుగేసు కుంది.

ఆ శాల్తీ నెమ్మదిగా ఒక్కో అడుగూ వేసుకొంటూ ఆనందరావుకి ఎదురొస్తోంది. ఆమె నడిచే ఒక్కో అడుగూ ఒక్కో మెగాటన్ బాంబులా ఆనందరావు గుండెల్లో ప్రేలుతున్నాయి.

ఆనందరావుకి మొదట దుఃఖం వచ్చింది. ఆ తర్వాత కోపం వచ్చింది.

చీ! చీ! వెధవ ముండ! అసలు తనకే గనుక అధికార ముంటే ఈ వెధవ ముండలు వీధులవెంట నడవకూడదని శాసించేవాడిని. ఒకవేళ తన శాసన్నాన్ని అతిక్రమించి వీధులవెంట నడిస్తే నిర్దాక్షిణ్యంగా తుపాకీతో కాల్చేయమని పోలీసులకి ఆర్డర్స్ జారీచేసేవాడిని— అని అనుకొన్నాడు మనసులోనే ఆనందరావు.

కాని—ఆ వెంటనే తన తల్లి జ్ఞాపకం వచ్చింది. తన తల్లి పొందే మనోవేదన జ్ఞాపకం వచ్చింది. తన తల్లి కూడా వెధవ ముండేగదా! భర్త చనిపోయి దిగులుతో కృంగిపోతున్న స్త్రీయే గదా! తన తల్లిని చూచి కూడా తనలాగే యింకెవరైనా తిట్టుకోవచ్చుగదా! తనకా ఇంగితజ్ఞానం యిసుమంతైనా ఎందుకు లేకుండాపోయింది—మనస్సులోనే బాధ పడిపోయాడు ఆనందరావు.

తనకు శకునాలమీద గట్టి నమ్మకమే వుండవచ్చు. అంతమాత్రంచేత ఎదుటి వ్యక్తిని తిట్టుకొనే అధికారంగానీ, అహం భావంగానీ తన కెవరిచ్చారు? తనలో తనే సిగ్గుపడిపోయాడు ఆనందరావు.

చేసేదిలేక మళ్ళీ వెనక్కి తిరిగాడు.

నీరసంగా ఇంట్లోకి ప్రవేశించి, కుర్చీలో కూలబడ్డ కొడుకుని చూచి ఆశ్చర్యపోయింది ఆనందరావు తల్లి.

"ఏం బాబూ! ఏమైంది?" ఆదుర్దాగా ప్రశ్నించింది.

నిజం చెప్పలేకపోయాడు ఆనందరావు

అవును, ఏమని చెప్తాడు? తనకు ఓ వెధవ ముండ ఎదురొచ్చిందని

చెప్తాడా? అలా చెప్పగలడా? అలా చెప్తే తన తల్లి బాధపడదూ!

అందుకే అన్నాడు—

"ఏం లేదమ్మా! ఓ సర్టిఫికేట్ మర్చిపోయా తీసుకెళదామని వచ్చాను," అని.

ఆనందరావు తల్లి మరి మాట్లాడలేదు. లోపలి కెళ్ళిపోయింది.

మరో అయిదు నిముషాలు కూర్చొని భయం భయంగానే లేచి నిలబడ్డాడు. ఇల్లు దాటి వీధిలో పడ్డాడు.

ఈ సారి తను అనుకొన్నట్లుగా ఏ అపశకునమూ ఎదురవ్వలేదు.

కాని—

ఓ వంద గజాలు నడిచిన తర్వాత డీలక్స్ హోటల్ సెంటర్ చేరుకొనే సమయంలో మాత్రం ఓ కుర్రాడు—బహుశా ఏ కాలేజీ కుర్రాడో—ఎదురయ్యాడు. మొదటిసారిగా ఎదురొచ్చిన మనిషి కాబట్టి ఆ వ్యక్తిని గుర్తుపెట్టుకోవడం ఆనందరావు కో అలవాటు.

అతాడి వయస్సు షుమారు యిరవై మూడూ యిరవైనాలుగూ వుండొచ్చు—మాసిన చొక్కా—మాసిన పాంటూ, చేతిలో ఓ పుస్తకమూ, ఆ పుస్తకం నిండుగా ఏవో కాగితాలూ

అతగాడ్ని మరోసారి చూచి, అతన్ని దాటుకొని డీలక్స్ సెంటర్ చేరుకొన్నాడు. తన అదృష్టం బావుండి యూనివర్సిటీకి వెళ్ళే సిటీబస్సు బయలుదేరటానికి రెడీగా వుంది. ఎప్పుడూ కిట కిట లాడుతూ ప్రెగ్నెంట్ లేడీలా నిండుగా వుండే సిటీబస్సు ఆ రోజెందుకో ఖాళీగా వుంది. అప్పుడే అనుకొన్నాడు ఆనందరావు—తనకెదు రొచ్చిన ఆ కాలేజీ కుర్రాడి శకునమే అయ్యుంటుందని. చూడబోతే ఆ కుర్రాడి శకునం చాల శుభదాయకంగా వుంది అని కూడా అనుకొన్నాడు ఆనందరావు. ఆలస్యం చెయ్యకుండా గబుక్కున లోపలికి దూరి ఓ మంచి సీటు చూసుకొని కూర్చున్నాడు.

యూనివర్సిటీ దగ్గర్లోనే వుంది కనుక అనుకున్న టైంకి కొంచెం ముందుగానే చేరుకొన్నాడు ఆనందరావు.

* * *

రెండురోజుల తర్వాత ఇంటర్వ్యూ రిజల్ట్సు వొచ్చాయి.

ఆనందరావు సెలెక్టయ్యాడు.

అతడి ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. నిజంగా ఇంటర్వ్యూలో తను పొడిచేసింది ఏమీలేదు. ఎగ్జామినర్స్ ఏవో వాళ్ళ నోటి కొచ్చింది అడిగారు. తన నోటి కొచ్చింది తను చెప్పాడు. నిజం చెప్పాలంటే తను సెలెక్టవుతాడని కలలో కూడా అనుకోలేదు కాని సెలెక్టయ్యాడు.

మరోసారి ఆనందరావు నమ్మకం రుజువయ్యింది ఆ రోజు తనకు ఎదురొచ్చిన కాలేజీ కుర్రాడే తను సెలెక్టవ

టానికి కారణమని ఆనందరావుకి గట్టి నమ్మకం ఏర్పడిపోయింది.

ఆ మాటే తన తల్లితో అన్నాడు ఆనందరావు.

"ఎవరో కుర్రాడు—మంచి శకునంలా వుంది. ఈసారి కనిపిస్తే థాంక్స్ చెప్పు" అంది ఆనందరావు తల్లి.

నిజమే. ఆ కుర్రాడు కన్పిస్తేబావుణ్ణు అతడు కనిపిస్తాడని సిక్త్స్ సెన్స్ చెబుతోంది ఆనందరావుకి.

* * *

ఆ కుర్రాడి కోసం రోజూ ప్రయత్నిస్తూనే వున్నాడు ఆనందరావు

ఓ రోజు అనుకోనివిధంగా ఆ కుర్రాడు తటస్థపడ్డాడు.

ఆ రోజు ఆనందరావు డీలక్స్ హోటల్‌కి టీ త్రాగటానికని వెళ్ళాడు. అనుకోని రీతిగా కుర్రాడు వచ్చి ఆనందరావుకి ఎదురుగా కూర్చున్నాడు

ఆనందరావు గుర్తుపట్టాడు. అదే మాసిన చొక్కా—మాసిన పాంటూ—చేతిలో పుస్తకమూ-పుస్తకం నిండుగా కాయితాలూ.

ఆనందరావే మొదట పలుకరించాడు

"సారీ సార్ ! మీ పేరు తెలుసుకోవచ్చా ?"

పరిచయంలేని వ్యక్తి పలుకరించగానే ముందుగా కొంచెం కంగారుపడ్డాడా కుర్రాడు.

"నా పేరు శంకరం" అన్నాడు తర్వాత నెమ్మదిగా.

"నాపేరు ఆనందరావు. నన్నెప్పుడైనా మీరు చూశారా ?" అని అడిగాడుఆనందరావు.

"చూశాను-ఒకే ఒక్కసారి" అన్నాడు శంకరం

ఎక్కడ చూశావు? ఎప్పుడు చూశారు ? అని ఆనందరావు అడగలేదు కారణం అతడి ఆనందం అతడిది. ఇన్నిరోజుల తన నిరీక్షణ ఫలితంగా ఈరోజు ఎలాగో అతగాడు కనిపించాడు. కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఇదీ ఆనందరావు ఆరాటం.

"నేను కొన్నిరోజుల క్రితం ఒక ఇంటర్వ్యూకెళ్ళాను. అదృష్టవశాత్తూ సెలెక్టయ్యాను" అన్నాడు ఆనందరావు ఉపోద్ఘాతంలా.

శంకరానికి ఆశ్చర్యంగా వుంది. ఇంటర్వ్యూ విషయం తన కెందుకు చెబుతున్నాడో అర్థంకాలేదు. తనెప్పుడూ ఆనందరావుతో ఇంటర్వ్యూకి వెళ్ళలేదు. అటువంటప్పుడు తనతో ఆ విషయం చెప్పవలసిన అవసరం ఏమిటో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

"చాలసంతోషం. అదృష్టవంతులు" అని మాత్రం అనగలిగాడు శంకరం.

"థాంక్స్. ఈ రెండురోజులూ మీరు కనిపిస్తారేమోనని తెగ వెతికాను. మీరు కనిపించలేదు. కనీసం మీ ఇల్లు కూడా ఎక్కడో నాకు తెలీదు. ఈ రోజు నా అదృష్టంకొద్దీ అనుకోనివిధంగా మీరు కనిపించారు," అన్నాడు ఆనందరావు.



ఎందుకు అన్నట్లు చూశాడు శంకరం.

ఏదో చెప్పబోయి అంతలోనే ఆగిపోయాడు ఆనందరావు.

కారణం-అక్కడికి సర్వర్ వచ్చాడు.

"మీరేం తీసుకొంటారు ?" అని అడిగాడు ఆనందరావు.

"టీ చాలు." శంకరం చెప్పాడు.

"ఏక్ ఛాయ్" ఆర్డరిచ్చాడు ఆనందరావు.

సర్వర్ వెళ్ళిపోయాడు.

రెండు నిముషాలు ఎవ్వరూ మాట్లాడుకోలేదు. శంకరం దేన్ని గురించో ఆలోచిస్తూ వుండిపోయాడు.

"సార్." ఆనందరావే మళ్ళీ ప్రారంభించాడు.

"చెప్పండి" అన్నాడు-శంకరం.

"మీకు శకునాలమీద నమ్మకముందా ?"

"ఎందుకలా అడిగారు ?"

"ఊరికినే మీ కభ్యంతరమైతే మానేస్తాను." బాధపడుతున్నట్లుగా అన్నాడు ఆనందరావు.

"ఫర్వాలేదు. చెప్పండి "

"నాకు శకునాలంటే చాల నమ్మకం సార్. బహుశా మా నాన్నగారి దగ్గరి నుండి అది నాకు సంక్రమించి వుంటుందేమో" అన్నాడు ఆనందరావు

"మీరు మరోలా భావించకపోతే నేనోటి చెప్తాను. వీటిమీద నాకు బొత్తిగా నమ్మకం లేదు. నా మీద నాకు నమ్మకం. నా చేష్టలమీద నాకు నమ్మకం. నా ఆత్మవిశ్వాసంమీద నాకు

నమ్మకం అంతేగాని ఈ ఆచారాలూ, మూఢనమ్మకాలు అంటే నా కెందుకో మొదటినుంచీ అయిష్టమే" అన్నాడు శంకరం

ఆనందరావు యిబ్బందిగా కుర్చీలో కదిలాడు

"అలా అనకండి సార్. మీకో ఉదాహరణ చెప్తాను వినండి. ఆ రోజు నేను ఇంటర్వ్యూకి బయలుదేరుతుంటే ఎవరో తుమ్మారు. తర్వాత ఓ నల్లపిల్లి కాళ్ళ కడ్డం పడింది. ఆ తర్వాత ఓ విధవరాలు ఎదురైంది. అన్నిసార్లూ నా ఓపికను నేను పరీక్షించుకొని, వెనక్కి తిరిగెళ్ళి, కాస్సేపు కుర్చీలో కూర్చొని, మళ్ళీ బయలుదేరాను. ఆఖరుకు మీరు ఎదురొచ్చారు. మీ శకునం మంచిది కాబట్టి నేను సెలెక్టయ్యాను" అన్నాడు ఆనందరావు

శంకరం వెంటనే మాట్లాడలేదు.

ఆనందరావు ముఖంలోకి చూచి నెమ్మదిగా ప్రారంభించాడు-

"చూడండి ఆనందరావుగారూ ! నా కెందుకో మీరు పొరబడ్డారనిపిస్తోంది. మీ రింకాపాతకాలంలోనే వున్నారనిపిస్తోంది. రాతియుగం పోయి రాకెట్ యుగం వచ్చింది. రాజులూ రాజ్యాలూ పోయి ప్రజలే దేశాన్ని పరిపాలిస్తున్న రోజు లొచ్చాయి. సైన్సు రోజు రోజుకీ పురోగ మిస్తుంది ఇలాంటి సైంటిఫిక్ యుగంలో కూడా మీరింకా మూఢనమ్మకాలన్ను పట్టుకొని ఆరాధిస్తున్నారంటే నాకెందుకో బాధగా వుంది......

"ఇకపోతే మీకు ఎదురైన శకునాలను గురించి నాకు తోచిన రెండు ముక్కలు చెప్తాను. మీరు బయలు దేరినప్పుడు ఎవరో తుమ్మారన్నారు. అతగాడికి తుమ్మొచ్చింది. తుమ్మాడు అది మీరు అపశకునంగా తీసుకుంటే, అతగాడ్ని తిట్టుకుంటే అది అతగాడి ఖర్మ అని చెప్పాలి. ఇక పోతే మీ కెదురైన రెండవ శకునం నల్లపిల్లని చెప్పారు. నల్లపిల్లి అపశకునం అని మీరు భావించితే భావించవచ్చుగాని- పిల్లి అపశకునం కాదనీ, శుభ శకునమే నని ఎన్నో సాక్ష్యాధారాలున్నాయి. 'మంగళం కృష్ణ మార్జాలం' అని అన్నారు మన పెద్దలు. నల్లపిల్లి శుభ దాయకం అని దానర్థం. వెనుకటికి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఇండియాకు ప్రయాణ మవుతూ నల్లపిల్లుల్ని ఎదురొచ్చే ఏర్పాటు చేసుకొన్నాడట శుభం జరుగు తుందని. చూశారా! మన పురాణేతి హాసాలేగాక పాశ్చాత్య దేశస్థులు కూడా నల్లపిల్లి శుభదాయకమని చెబుతున్నారు. అంతేగాదు, దేవుళ్ళమీద, దేవతలమీద మన కవులు ఎలా శతకాలు వ్రాశారో అలాగే పిల్లిమీద కూడా బోలెడన్ని శతకాలూ, పద్యాలూ రాశారు మన కవులు. కాబట్టి పిల్లి ఎదురు రావడం అన్నివిధాలా శుభదాయకమే ఇకపోతే

మీకు ఎదురైన మూడవ అపశకునం వెధవముండ భర్తను కోల్పోయి. అయిదో తనాన్ని పోగొట్టుకుని తన దురదృష్టాన్ని తలుచుకొని తనలో తనే కుమిలి కుమిలి ఏడ్చే ఆ యిల్లాలు వీధుల వెంటకూడా నడవటానికి అర్హురాలు కాదా? అలా నడవడం ఆమె చేసిన నేరమా? ఇది చాలా దారుణం సార్! ఇలా శకునాల పేరుతో మిమ్మల్ని మీరే మోసం చేసుకొంటున్నారు. ఇలా కఠినంగా మాట్లాడినందుకు క్షమించండి," అన్నాడు శంకరం-అంతకంటే అధికంగా మాట్లాడటం ఇష్టంలేనట్లు.

ఆనందరావు ఆలోచనలో పడ్డాడు. కాని అతగాడి మనస్సు శంకరం చెప్పిన మాటల్ని అంగీకరించనందోంది.

"అయితే శంకరంగారూ! నేను సెలెక్ట్ కావడానికి మీ శకునమంటే మీరు అంగీకరించరన్నమాట".

"ఎంతమాత్రమూ అంగీకరించను. మీరు ఇంటర్వ్యూలో బాగా అన్సర్ చేసివుంటారు. అందుకే సెలక్టయ్యారు.

పెద్దగా నవ్వాడు ఆనందరావు.

"ఎందుకలా నవ్వుతారు" శంకరం ఆశ్చర్యపోతూ అడిగాడు.

"కాకపోతే మరేమిటిసార్ నేను బాగా ఆన్సర్ చేశానంటే నవ్వొచ్చింది. నిజం చెప్పమంటారా సార్! నేను అస్సలు ఫిఫ్టీ పర్సెంట్ కూడా ఆన్సర్ చెయ్యలేదంటే నమ్మండి అయినా ఇంటర్వ్యూలు కేవలం బోగస్ సార్ చదివేవదువులకీ, చేసే ఉద్యోగాలకీ అసలు సంబంధమే వుండదు ఇకపోతే ఇంటర్వ్యూలలో అడిగే ప్రశ్నలకీ మనం చదివిన చదువు కీ ఎక్కడా లింకే వుండదు డాక్టర్లనీ, ఇంజనీర్లనీ పాలిటిక్స్ గురించీ, పాలిటిక్స్ వాళ్ళని మెడిసిన్, ఇంజనీరింగ్‌లని గురించీ ప్రశ్నలు అడిగితే ఎవరుమాత్రం ఎలా ఆన్సర్ చేస్తారు, చెప్పండి. నామట్టుకు నేను ఏదో నోటికొచ్చింది చెప్పాను. అసలు నా సెలక్షన్ గురించి యిప్పటికీ నాకు ఆశ్చర్యంగానే వుందంటే నమ్మండి అందుకే నాకు జాతకాలన్నా, శకునాలన్నా చచ్చేంత నమ్మకం."

"మీరు మళ్ళీ పొరబడుతున్నారు. ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ళందర్లోకి మీరే బెటర్ కాండిడేట్ ఆయ్యుంటారు. మిగిలిన వాళ్ళు మీకంటే యింకా ఘోరంగా ఆన్సర్ చేసివుంటారని మీ రెందు కనుకోరు"

"అది పాయింటే కావొచ్చు. కాదనను. కాని ఈ రోజుల్లో మెరిట్‌ని చూసి సెలక్ట్ చేస్తున్నారంటే మాత్రం నే నమ్మను. ఉత్తరమో దక్షిణమో ఏదో ఒకటి ఉండాలి. నాకు అ రెండూలేవు. ప్రతి చిన్న ఉద్యోగానికి మినిస్టరు దగ్గర్నుండి ప్రైమ్‌మినిస్టర్ వరకూ ఇంటర్‌ఫియర్ అవుతున్నారంటే మీరు అంగీకరిస్తారో లేదో నాకు తెలీదు అటు

వంటప్పుడు నేను సెలెక్ట్‌కావడం కేవలం నేను బయలుదేరిన వేళావిశేషమే. కాక పోతే మరేమిటి? చెప్పండి" అన్నాడు ఆనందరావు

"లోకంలో అవినీతి లేదని నేననను. కాని లోకమంతా అవినీతి మీదుగానే నడుస్తుందంటే మాత్రం నేనొప్పుకోను" అన్నాడు శంకరం.

ఇంతలో టీ తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టాడు సర్వర్.

వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

టీ త్రాగాడు శంకరం.

సర్వర్ బిల్లు యిస్తుంటే బలవంతంగా ఆనందరావే తీసుకొన్నాడు.

"నేను త్రాగిన టీకి మీరు బిల్లు చెల్లించడం ఏమంత సమంజసంగా లేదు సార్" అన్నాడు శంకరం కొంచెం నొచ్చుకున్నట్లుగా.

"నేను సెలక్టయిన శుభసమయాన్ని పురస్కరించుకొని మీకు తేనీరు ఆఫర్ చేశాననుకోండి నా సంతోషాన్ని కాదన కండి" అన్నాడు ఆనందరావు. అతగాడి మాటల్లోని అభ్యర్థన చూసిన తర్వాత కాదనలేకపోయాడు శంకరం.

కొద్ది క్షణాలు మౌనంగా వుండి పోయారు యిద్దరూ.

"ఇంతకీ మీరేం చేస్తున్నారో చెప్ప లేదుగా" ఆనందరావే అడిగాడు.

శంకరం ముఖంలో రంగులు మారాయి, దీర్ఘంగా నిట్టూర్చాడు.

"నా గురించి తెలుసుకోవాలను కొంటున్నారా?" పేలవంగా నవ్వుతూ అడిగాడు శంకరం

"మీ కభ్యంతరం లేకపోతే" అన్నాడు ఆనందరావు

"ఇందులో అభ్యంతరాని కేముంది లెండి. చెప్తాను. అయితే నేనేం చేస్తు న్నానో చెప్పేముందు మా కుటుంబ పరిస్థితి టూకీగా చెబితే మంచిదని నా అభిప్రాయం. మా తల్లిదండ్రులకి నేనొక్కణ్ణే కొడుకుని. నాకు పెద్ద పెద్ద చదువులు చదవాలనీ, పెద్ద పెద్ద ఉద్యో గాలు చెయ్యాలనీ, నా తల్లిదండ్రుల్నీ, నా తోబుట్టువుల్నీ సుఖపెట్టాలనీ మహా కోరిగ్గా వుండేది. కాని నా కోరిక తీర లేదు. అందుక్కారణం ఉద్యోగం చేస్తున్న మా నాన్నగారు అకస్మాత్తుగా ఓ ప్రమాదంలో చనిపోయారు తత్ఫలి తంగా నా చదువాగిపోయింది. పైపెచ్చు కుటుంబభారం నా నెత్తిమీద పడింది. అందుకు నేను బాధపడలేదు. నా కర్తవ్యంగా భావించాను. కాని కుటుంబాన్ని ఎలా పోషించాలో అర్థం కాలేదు. అమ్మకు ఆరోగ్యం ఎప్పుడూ బావుండదు. నాకు - చదువుకొంటున్న యిద్దరు చెల్లెళ్ళున్నారు. పెళ్ళికెదిగి ఇంట్లో కూర్చున్న యిద్దరక్కయ్య లున్నారు వీళ్ళందర్నీ పోషించి పెళ్ళిళ్ళు చెయ్యాల్సిన బాధ్యత నామీద వుంది..." చెప్పడం ఆపాడు శంకరం.




"పోనీ ఏదైనా ఉద్యోగానికి ప్రయత్నించకపోయారా" అన్నాడు ఆనందరావు.

"బి ఎ లోనే నా చదువాగిపోయింది. అప్పటినుండీ నేను ప్రయత్నించని ఉద్యోగమంటూ ఏదీలేదు. కాని నాకు ఉద్యోగం దొరకలేదు. ఉద్యోగం దొరకని నంతమాత్రంచేత అన్నం తినడం తప్పదుగదు సార్! నేనుతిన్నా తినక పోయినా నా చిన్నారి చెల్లెళ్ళు పస్తులు పడుకొంటూంటే ఎలా చూస్తూ సహించ గలను. నవమాసాలు మోసి నన్ను కని యింతవాణ్ని చేసిన నా తల్లి మందులేక రోగంతో బాధపడుతుంటే ఎలా చేతులు కట్టుకుని బాధ భరించగలను? చెప్పండి. ఈ లోకంలో ప్రతిదానికీ డబ్బుకావాలి. అందుకే ఒక ఉపాయం ఆలోచించాను. పదిమంది స్కూలుపిల్లలకి ట్యూషన్స్ చెప్పుకొంటున్నాను. సాయంత్రం ఓ పచారీ షాపులో లెక్కలు రాయడానికి కుదిరాను. ఓ రోజు తిన్నా తినకపోయినా ఎలాగోలా గడిచిపోతుంది మా సంసారం" ఆ మాటలు అంటున్నప్పుడు శంకరం కంఠం కొంచెం వొణికింది అయినా ఆ మాటల్లో ఏదో చెప్పలేని పట్టుదల వుంది.

"ఈ మధ్య ఏ ఉద్యోగానికీ ప్రయత్నించలేదా?". ఆన దరావు అడిగాడు.

"ఎందుకు ప్రయత్నించలేదు సార్! రెండురోజుల క్రితం కూడా ఓ గుమస్తా ఉద్యోగానికి ఇంటర్వ్యూ కెళ్ళొచ్చాను" అన్నాడు శంకరం ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ.

"సెలెక్ట్ కాలేదా ?"

పెదవి విరిచాడు శంకరం.

"సార్! మీకు శకునాలమీద నమ్మకంలేదని అంటున్నారనుకోండి అయినా-నా కుతూహలంకొద్దీ అడుగుతున్నాను. ఆ రోజు మీరు ఇంటర్వ్యూకి బయలుదేరినప్పుడు ఎదురెవరొచ్చారో జ్ఞాపకముందా ?"

"ఎందుకులేదు కళ్ళకు కట్టినట్లు ఆ మనిషి నాకు జ్ఞాపకమున్నాడు. కాని ఆ మనిషివల్లే నేను ఇంటర్వ్యూలో సెలెక్ట్ కాలేదంటే నేను ససేమిరా వొప్పుకోను."

"మీకు నమ్మకం లేకపోవచ్చుగాని-ఈ శకునాలు నిజంగా జరిగి తీరుతాయి సార్!" అన్నాడు ఆనందరావు.

"మీ నమ్మకాన్ని కాదనే అధికారం నాకులేదు. కాని నా కలాంటి పట్టింపులు లేవని ముందే చెప్పాను."

"పోనీలెండి మీకు నమ్మకం లేకపోయినా నా కెందుకో ఈ శకునాలమీద గట్టి నమ్మకం సార్! నా నమ్మకం ప్రకారం మీకు ఎదురొచ్చినవాడు వొట్టి పాపిష్టివాడులా వున్నాడు. వాడి ముఖం చూస్తేను పాపం చుట్టుకొనేలా వుంది. మీరిన్ని కష్టాల్లో వుండికూడా మీరు సెలెక్ట్ కావడం లేదంటే అదంతా కేవలం మీకు ఎదురయ్యే వాళ్ళ అపశకునమే అయ్యుంటుంది" అన్నాడు ఆనందరావు

శంకరం ఏమీ మాట్లాడలేదు కాని ఆనందరావు ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

"సార్! ఆ రోజు ఎదురొచ్చిన వ్యక్తి మీకు బాగా జ్ఞాపక ముందంటున్నారుగదా. ఎవరుసార్ ఆ పిల్లిముఖం వాడు."

చెప్పడం యిష్టంలేనట్లుగా కొంచెం అయిష్టంగా ముఖం పెట్టాడు శంకరం.

"నా కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. చెప్పండి సార్!"

"మీరు బలవంతం చేస్తున్నారు గనుక చెప్తున్నాను అంతేగాని నాకు ఈ శకునాలంటే అస్సలు నమ్మకంలేదు" అన్నాడు శంకరం

"ప్లీజ్..." ఆనందరావు అభ్యర్థన.

"మీరే"

"............"



# గడియారం




కాటూరు
విజయకుమార్ రాజు

"శానా బావుంది బావా ! యాడదీ... కొన్నావా ?" కొత్త చేతిగడియారాన్ని సంబరంగా చూస్తు అడిగింది మల్లి.

"మన మెందుకు కొంటామే ? కొత్తగా పెళ్ళిచేసుకున్నాననగానే మా అయ్యగారు యిచ్చారు..." అన్నాడు చెంద్రిగాడు, పోజుగా.

"ఎట్టా ? ! మీ అయ్యగారికి నువ్వంటే అంతిదా ?" ఆశ్చర్యపోతూ అంది.

"మరేంటనుకున్నా ?"

"శానా కరీదనుకుంట..." కిందికీ మీదికీ తిప్పుతు అంది.

"ఆఁ...ఎంత, మూడొందలుంటుంది..." నవ్వు అణచుకొని అన్నాడు.

"మూడొందలే!" కళ్ళు పెద్దవి చేసుకు చూసింది

తండ్రి వేసిన కొత్త గుడిసెకి మూడొందలయింది!

గుప్పెట్లో కొచ్చే గడియారం వెల మూడొందలుంటే—'ఎంత గొప్పదో!' అనుకుంది.

"మీఅయ్యగారు శానా మంచోరు..." అంది

"అందుకే కారిచ్చి పంపారు...నువ్వు తొందరగా తయారుకా సిన్మాకి పోదాం..."

"సిన్మాకా? అమ్మో...అమ్మో... ఏందియ్యాల..." చిలకమ్మలా రాగాలు తీస్తు అడిగింది.

"అయన్నీ అడగమాక...ముందల రడీ కావాల..."

"సిటికెలో రడీగానూ..." అంటు ఉతికిన చీర అందుకుని లోపలికి నడిచింది మల్లి.

మురిపెంగా పెళ్లాం నడకల్ని చూస్తుండిపోయేడు చెంద్రిగాడు.

* * *

"చక్కగా సిన్మా ఏక్టరులా ఉందిరా." మల్లికేసి నఖశిఖ పర్యంతం చూస్తు అన్నాడు నందగోపాల్.

మల్లి సిగ్గుల జల్లులో తడిసిపోయి మొగుడెనకాల దాక్కుంది

చెంద్రిగాడి పెదవులమీద గర్వరేఖ కదిలింది.

"ఏం పిల్లా...నీ పేరేంటో చెప్పావ్ కాదు..." కవ్వింపుగా చూస్తూ ప్రశ్నించాడు నందగోపాల్.

చూపుడు వేలు పళ్ల మధ్య కొరుకుతు పెద్ద కళ్ల మీద బరువుగా రెప్పలు వాల్చి మౌనంగా ఉండిపోయింది మల్లి.

"చెప్పు..అయ్‌గారు అడగటంలా."

మొగుడు గదమాయింపుకి బెదిరి "మల్లి" అనేసింది చటుక్కున

బిగ్గరగా నవ్వుతు "ఓహ్...భలే పేరురా...తెల్లచీరలో మల్లెపువ్వు లాగానే ఉంది..." యింకా నవ్వుతుండగానే లోపల టెలిఫోన్ మ్రోగటం విన్పించింది.

నవ్వటం ఆపి, వేగంగా అటెళ్ళాడు నందగోపాల్.

"ఏంది మీ అయ్యగారట్టా నవ్వుతారు? నాకేందో బయంగా ఉంది... పోదాం పద...సిన్మాకి టైం గాలా?" అంది వేలికి కొంగు చుట్టుకుంటు.

"ఓ సెద్రి మొగమా కార్లో ఎంత టయిం పడద్దే? అయ్‌గారు పైక్లాసులో టికెట్లు తెప్పించారు...ఇయిగో సూడు." జేబులోంచి టికెట్లు తీసి చూపేడు, చెంద్రిగాడు. అవి కొని తెచ్చింది వాడే!

"అంటే మేడ మీన కూకుంటమా?" ఆశ్చర్యంగా కళ్లు తాటిస్తు ప్రశ్నించింది.

"మరేందనుకున్న?" కాలరు సరిజేసుకున్నాడు గర్వంగా.

"ఓ...ఓ...బాగనే ఉన్నవ్ లేవోయ్

...మాంటికీ, మాంటికీ కాలరెత్తుతున్నవు గాని..." లోలోపల ఆనందిస్తూనే పైకి ఎద్దేవా చేసింది, మల్లి.

వాళ్ళు మాటల్లో ఉండగానే గొంతు సరిజేసుకుంటు వచ్చాడు నందగోపాల్.

ఇప్పుడతని మొహం యిందాకటిలా లేదు.

ఏదో మథనపడుతున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది.

వచ్చి వాళ్ళ కెదురుగా నిలబడి, స్తబ్దంగా ఎటో చూస్తుండిపోయా, దొక నిముషం.

చెంద్రిగాడు ఆగలేక అడిగేడు.

"ఏంటిబాబూ...అలాగున్నారేంటి?"

ఉలిక్కిపడ్డట్టు చెంద్రిగాడ్ని చూసేడు.

"అదేరా...నీతో ఎలా చెప్పాలో తెలియక..." తికమకగా చేతులు కదిలిస్తూ అర్థోక్తిలో ఆగిపోయేడు నందగోపాల్.

"పర్లేదు చెప్పండి బాబూ..." ఆత్రంగా అడిగేడు.

"నా ఫ్రెండ్ వెంకటరత్నం లేడూ. వాళ్లమ్మగారికి సీరియస్‌గా ఉందట. అర్జంటుగా వెళ్ళాలిట...కారు కావా లన్నాడు."

"దాన్దేముంది, మేం రిక్షాలో పోతాం లెండి. కారు తీసికెళ్ళమనండి..." అనేశాడు చెంద్రిగాడు తేలిగ్గా

"నేనూ అదే అనుకున్నానూ గానీ... వెంకటరత్నానికి డ్రైవింగ్ రాదు...పైగా మన కారులో గేర్ల ట్రబులుంది గద? అది నీ కొక్కడికే తెలుసు. పోనీ నే వెళ్దా మంటే డాక్టరుగారు ఆర్నెల్లదాకా కారు నడపొద్దన్నాడు..."

చెంద్రిగాడి మొహంలో నిముషంలో పదిరంగులు తిరిగేయి.

వాడు ఎటూ తేల్చుకోలేకుండా ఉన్నాడు.

వెనకాల—వీపుని దాదాపు ఆనుకు నిలబడ్డ మల్లి స్పర్శ వాడి మనసుని మరింత అల్లకల్లోల పెట్టింది.

సినిమా ఆశపెట్టి తీసుకొచ్చాడు.

ఇప్పుడిలా...

అసలీ గొడవంతా లేకుండా హాయిగా గుట్టుచప్పుడు లేకుండా, ఏశలవురోజునో కింది టికెట్టు కెళ్ళుంటే బావుండేది.

అయ్యగారి మాట కాదన్లేకపోయేడు. అందుక్కారణం లేకపోలేదు.

అయ్యగారు తనకి కొత్త జీవితం యిచ్చేడు

యాక్సిడెంటు చేసి జైలు కెళ్ళొచ్చిన తనని ఆయన గనక డ్రైవరుగా పెట్టుకున్నాడు!

"ఆ యాక్సిడెంటులో తప్పు నీది కాదని నాకు తెలుసురా...ఏ డ్రైవరైనా ఆ పనే చేస్తాడు. చచ్చిపోయింది కానిస్టేబుల్ గనక నీకు శిక్ష తప్ప లేదంతే" అని ధైర్యం చెప్పాడు.

ఆ రోజునుండీ అయ్యగారు తనకి ఆరో ప్రాణం.

కానీ...కానీ...

వాడి గుండెలోంచి సూదిలా పొడుచు కొచ్చిందొక బాధ...

స్వయంగా అనేకమార్లు కిరాయి కొచ్చే ఆడపిల్లల్ని తీసుకొచ్చి యిక్కడ దించాడు!

అయ్యగారి అలవాట్లు తెలిసీ...అమాయకం విడని పెళ్ళాన్ని వదిలి, ఎక్కడో ఎవరికోసమో కారు తీసుకెళ్ళటమా?

వాడి మెదడులో తిరుగుతున్న భావాలన్నింటినీ మొహంలో చదువుతూ ఓ సిగిరెట్ వెలిగించుకున్నాడు నందగోపాల్.

"ఓ పన్చేస్తే ఎలాగుంటుంది బాబూ."

"ఏ పని?" అన్నాడు సిగిరెట్ పొగ వదుల్తు.

"మల్లినింటికాడ దింపి ఎల్తే?"

నవ్వేడు నందగోపాల్.

"ఒరే చెంద్రిగా! అర్ధంటు అందే తెల్సురా నీకసలు? కొంప లంటుకుంటే ఫైరింజన్లెలా పరుగెడతాయ్? అసలీ పాటికి నువ్వు సగం దూరంలో ఉండాల్సింది. అవతల వెంకటరత్నం ఎదురుచూస్తుంటాడు. అంత అవసరమన్పిస్తే మల్లిని కూడా నీతో బాటు కార్లో వాళ్ళూరు తీసికెళ్ళె.కానీ-అదంత మంచిపననుకోను..."

చెంద్రిగాడికి తను వెళ్ళక తప్పదని అర్ధమైపోయింది.

నిస్సహాయంగా మల్లికేసి చూసేడు.

అది పులిగుహలోకి పొరబాటున దూరిన మేకలా మొగుడు మొహంకేసి భీతి నిండిన కళ్ళతో చూస్తోంది.

* * *

గోడగడియారం ఎనిమిది గంటలు కొట్టింది.

అన్నిమూట్లూ ఎవరో తన నెత్తిన సుత్తితో కొట్టినంత బాధగా తల పట్టుకున్నాడు నందగోపాల్.

బ్యాండేజి చేతికి గట్టిగా తగిలింది. వేదనగా మూలిగేడు. అంతలోనే పీక ఎండిపోతున్నంత దాహం వేసింది.

ఆర్తిగా అటు, యిటు నర్సుకోసం కళ్ళతో వెతికేడు

పక్క బెడ్డుమీద-జ్వరం నుండి కోలుకుంటున్న భర్తకి రొట్టె తినిపిస్తున్న వయసు మళ్ళినావిడ కన్పించింది.

అతని చూపుల్లో భావాన్ని చదివినట్లు "ఏమన్నా కావాలా నాయనా?" అనడిగింది ఆప్యాయంగా.

"మంచినీళ్ళు..." అన్నాడు పెదవులు తడి చేసుకుంటు.

ఆవిడ వెంటనే మరచెంబులోంచి గ్లాసెడు నీళ్ళు వంచి, అందులో యింత గ్లూకోజు పడేసింది చమ్చాతో బాగా కలిపి కొడుక్కి పట్టినంత ఆపేక్షగా అతనిచేత తాగించింది. తిరిగి అతన్ని







పక్కమీద మృదువుగా పడుకోబెట్టి వెళ్ళింది.

నందగోపాల్ గుండెకి కొత్తబలం చేకూరినట్లనిపించింది

అతనిలో యిప్పుడిప్పుడే వివేకం రేకలు విప్పటం ప్రారంభించింది

తన జీవితంలో ఉన్న వెలితి ఏమిటో ఆవిడ చెప్పకుండానే చెప్పినట్లు తోచింది.

'ఇన్స్యూర్' చెయ్యని జీవితంలా— భద్రత లేని మనిషయ్యాడు తను!

ఇన్నాళ్లూ గుర్తుకిరాని ఒంటరితనం యిప్పుడు మేరువంత్తై మీద కురికింది.

తను ఒంటరివాడు!

గాలి రాని గదిలో ఉన్నట్లు ఉక్కిరి బిక్కిరయ్యాడు.

ఈ ఒంటరితనం తను సృష్టించుకున్నది...

తన స్వయంకృతం!

గడియారపు టిక్కు టిక్కుల మధ్య మనస్సు గతంవైపు దారితీసింది.

తల్లిదండ్రులు లేని తనని పెత్తండ్రి పెంచి వారసుణ్ణి చేసుకోవటం—ఆ రూపేణా లభించిన లక్షల ఆస్తి—ఆస్తితో బాటు అంకురించిన ఖరీదయిన దురలవాట్లు!

ఏ పువ్వూ తన 'ఫవర్ వాజ్'లో పూటకంటే ఉండకూడదు

ఏ పడతి నవ్వూ తన చెవుల్లో రెండో రోజు విన్పించకూడదు.

అలా జీవితాన్ననుభవిస్తూ వచ్చాడు.

తన పోకడల్ని ముందే పసిగట్టిన పెత్తండ్రి పలువిధాల ప్రయత్నించి తనలో మార్పు తీసుకురాలేక చివరి రోజుల్లో ఒకపని చేసాడు. ఖరీదయిన

గోడగడియారం తెచ్చి తనగదిలో పెట్టించాడు. అర్థంగానట్లు చూస్తున్న తనని చూస్తూ అన్నాడు—

"ఒరేయ్ నందుడూ! యీ గడియారం యిక్కడెందుకు బిగింపిస్తున్నానో తెలుసా?"

తెలియదన్నట్లు తలాడించాడు తను.

"అసలు గడియారం అంటే ఏమిటో, అదెందుకు మనిషి జీవితంలో ఒక భాగమైందో నీకు తెలియాలి. పూర్వం కాలాన్ని సూర్యగమనంతోను, తిథుల తోను కొలిచేవారు గడియారం పుట్టాక మనిషి నది కొనేసింది! నిముషాల ముల్లుతో కొన్నాళ్లు పరిగెత్తిన మనిషి, దాంతో తృప్తిచెందక సెకండ్ల ముల్లు తగిలించాడు. నిజానికి గడియారం మనిషికి మిత్రుడు కాదు శత్రువు! గంట గంటకీ మోగుతూ మనల్ని హెచ్చరిస్తుంటుంది. నీ జీవితం అనే కొవ్వొత్తి గంట కాలింది సుమా అని మృత్యు సంకేతాల్ని టిక్కు, టిక్కుల్లో విన్పిస్తుంటుంది. మృత్యు సంగీతాన్ని గంటల్లో ఆలపిస్తుంటుంది"

"ఇలాంటి శత్రువు మనకెందుకు పెదనాన్నా? పైగా నా గదిలో ఎందుకు?" అంటే ఆయన నవ్వి—

"కారణం ఉంది! ఇప్పుడు నీ గదిలోకి పాము దూరిందనుకో. నువ్వు ప్రశాంతంగా ఉండగలవా? ఉండలేవు పాము ఎటువైపు నుంచి వచ్చి అమాంతం మీదపడి కాటేస్తుందోనని వణికిపోతుంటావ్. ఊహల్లో పాము కరిచినట్లే భ్రమించి చావు భయంతో మంచం మధ్యలో కూర్చుంటావ్. పాముని చంపే ధైర్యం ఉంటుందా. ఏ కర్రనో అందుకుని ఆ పని చేస్తావ్. లేదంటే నీ భయం నిజమవుతూ పాము కాటుకి చస్తావ్...శత్రువు పక్కలో బల్లెంలా ఉన్నప్పుడే మనిషిలో శక్తులు చైతన్యవంతంగాను అప్రమత్తంగానూ ఉంటాయి. ఇప్పుడీ గడియారం నీకు శత్రువు! ఇది విన్పించే కాలసత్యాలూ, హెచ్చరికలూ నేనీ లోకంలో లేక పోయినా నీకు విన్పిస్తూ ఉండిపోవాలనే దీన్నిక్కడ పెట్టిస్తున్నాను..." ఆయన ఒకప్పుడు వ్యాపకానికి బడిపంతులుమరి!

ఆయన మాటలు నిజమన్నట్లు కొత్త గడియారం చెవుల్ని చీలుస్తూ గంటలు కొట్టింది. తను నివ్వెరబోయేడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే ఆయన కాలం చేసాడు.

తను సెంటిమెంటల్ పూల్ కాదు. అయినా పెత్తండ్రి అక్కడ ఆ రోజు నిలబడి అన్నమాటల్నే తిరిగి, తిరిగి గడియారపు గంటల్లోంచి వింటున్నట్టుంటే దాన్నక్కణ్ణుంచి తొలిగించేశాడు.

అప్పట్నుంచీ గడియారాల మీద ఆసక్తి చచ్చిపోయింది.

పెత్తండ్రి కొనిచ్చిన రిస్టువాచీని

వాడకుండా ఉంచేసి, మరోటి కొనుక్కున్నాడు. అది కూడ అతి తక్కువగా వాడతాడు. చెంద్రిగాడి కిచ్చేసింది పెత్తండ్రి గడియారమే!

చెంద్రిగాడు!

నందగోపాల్ మనసు గిలగిల్లాడింది.

తెల్లకుందేల్లాంటి మళ్లీ రూపం కళ్ళ ముందు కదిలింది.

తల మీద గాయం మళ్ళీ రేగినట్లని పించింది!

పోట్లు...బాధ...

ఎవరో తనని తలమీద గట్టిగా క్రరతో కొడుతున్నారు. "ముట్టుకో వద్దు...దగ్గిరావొద్దు...సంపేత్తా...." జుట్టు విడిన కాళి గొంతులోంచి గర్జనలు విన్పిస్తున్నాయి.

కాళి రౌద్రంగా, అర్ధనగ్నంగా ఉంది.

నందగోపాల్ వణికిపోతున్నాడు.

ఆశ్చర్యం!

కాళికి ఐదులు కుందేలు కనిపించింది.

తెల్ల కుందేలు!

ఎర్రని అగ్నిగోళాల్లాంటి ఆ కళ్ళలో కాళి కరాళ నృత్యం ప్రతి బింబిస్తోంది.

కాళి అర్ధనగ్నంగానే ఉంది!

ఎదురుగా నాలుక జాచి ఆకలిగా చూస్తున్న వేటకుక్క మీదకి ఎగిరి దూకింది కుందేలు.

తోక ముడిచి పరుగులు తీస్తోంది వేటకుక్క.

ఉలిక్కిపడి చుట్టూ చూసేడు నందగోపాల్.

అది ఆస్పత్రే!

మెల్లగా ఆతనికి మామూలు స్పృహ కల్గింది.

ఎదురుగా ఉన్న గోడగడియారం ఎప్పటిలా కాలసంకేతాన్ని చూపిస్తూ, జీవన సంగీతాన్ని విన్పిస్తూనే ఉంది!

ఇప్పుడతను పశ్చాత్తాపం ఒడిలో అప్పుడే కళ్ళు తెరచిన పసిబిడ్డలా, నిర్మలంగా ఉన్నాడు!






విఠల్ గేటువగ్గర నిలబడి బంగళావంక ఎగాదిగా చూస్తున్నాడు. ఆ బంగళాలో మనుషులెవరూ కనపడలేదు. ఆ బంగళా నలువైపులా ఘెరావ్ చేసినట్లుగా పెద్ద గార్డెన్ చూడముచ్చటగా వుంది. పిల్లప్రేవుల్లా వంకరటింకరగా ఆ గార్డెన్ నుంచి బంగళాకి అనేక దార్లున్నాయి. ఆ బంగళావంక చూస్తూనే పదినిముషాలు గడిచిపోయింది విఠల్‌కి.

ఇంతలో గేట్‌కీపర్ కాకీదుస్తుల్లో, చేత కర్ర ఒకటి పట్టుకొని, అతను నేపాలీవాడనుకుంటాను తెల్లగా పాలిపోయినవాడిలా వున్నాడు, వచ్చి లోపం గేటుదగ్గర నిలబడ్డాడు. అతడు విఠల్ని ఎగాదిగా చూశాడు "ఎప్పుడూ రాలేదే! ఎవరా ఇతను?" అని.

"నేను బాబాయిగార్ని కలుసుకోవాలి." గేటు తియ్యమన్నట్టుగా అడిగాడు విఠల్.

"బాబాయిగారా ?" అర్థంకాని దృష్టితో మళ్ళీ అడుగుతున్నట్టుగా విఠల్‌వంక చూశాడు గేట్‌కీపర్.

"ఇంతకూ బాబాయిగారు లోపల లేరా ?" మళ్ళీ ఆతృతగా అడిగాడు విఠల్.

"బాబాయిగారా ? బాబాయిగారంటూ ఇక్కడ ఎవరూలేరు !" విసుక్కున్నట్లుగా విఠల్ వంక చూచి వెనక్కు తిరిగాడు గేట్‌కీపర్.

"అదే ! శివరాంప్రసాద్ జమిందార్ గారు !" అంటూ గట్టిగా అన్నాడు. విఠల్.

ఆ మాట వినగానే గేట్‌కీపర్ సంతోషంతో ముఖం ఇంత చేసుకొని తిరిగొచ్చి గేటు తాళం తీశాడు విఠల్ చేతిలోవున్న సూట్‌కేసు, టిఫిన్ క్యారియర్ తాను తీసుకున్నాడు.

ఇంతలో గేటుతీస్తున్న చప్పుడువిని బంగళానుంచి ఓ నౌకరు హడావిడిగా పరిగెత్తుకొచ్చాడు. గేట్‌కీపర్ ఆ సామానులు అతని చేతికి ఇచ్చాడు అతడు విఠల్‌ను శివరామ్‌ప్రసాద్ వద్దకు తీసికెళ్ళాడు.

శివరామ్‌ప్రసాద్ ఆ గార్డెన్లో ఓ మూల గార్డెన్‌ఛైర్‌లో పడుకొని ఏదో ఇంగ్లీషుపుస్తకం చేత పట్టుకొని ఆకాశం కేసి చూస్తూ పరధ్యానంలో వున్నాడు. ఉండుండి సిగరెట్ దమ్ము వేసుకొంటున్నాడు.

"సార్ ! సార్ ! సార్ !" అంటూ నౌకర్ శివరామ్‌ప్రసాద్‌ని ఈ లోకంలోకి తీసుకొచ్చాడు.

అటు తిరిగి వున్న శివరాంప్రసాద్ నెమ్మదిగా ఇటు తిరిగి విఠల్‌వంక తదేకంగా చూశాడు. అతణ్ణి తానెప్పుడూ చూడలేదు. కాకీపాంటు వేసుకొని వైట్ లాంక్లాత్ చొక్కా తొడుక్కొని వున్నాడు. కాళ్ళకు మామూలు చెప్పులు వున్నాయి. చొక్కా నలిగుంది. వచ్చీరాని మీసం, గడ్డం, ఓ పద్ధెనిమిదేళ్ళు వుంటాయి. పేదవాడుగా కన్పిస్తున్నా ముక్కూ, ముఖంలో జమిందారు పోలికలు కనిపించాయి శివరామ్‌ప్రసాద్‌కి అలాగే కొన్ని క్షణాలు తీవ్రంగా చూశాడు విఠల్‌ని.

విఠల్ ఆ చూపు భరించలేక పోయాడు. భయపడ్డాడు. అయినా తానూ తదేకంగా చూశాడు శివరామ్‌ప్రసాద్‌ను. శివరాంప్రసాద్ మిరపకాయల్లాంటి మీసాలు, పెసరకాయల్లాంటి పెదవులు కండికాయల్లాంటి కనుబొమలు, ఆ బోడితలకు చుట్టూ కట్ట కట్టిన నలుపూ తెలుపూ కలిసున్న అతని వెంట్రుకలు-ఇవన్నీ కలుపుకొని మొత్తంగా చూస్తే యస్వీరంగారావులా కన్పించాడు విఠల్‌కి. అంత బొద్దుగా, దబ్బపండులావున్న శివరామ్‌ప్రసాద్‌ని చూడగానే గౌరవభావం ఏర్పడింది విఠల్‌కి. ఆ చూపుల పోటీలో విఠల్

నిలవలేకపోయాడు. తలదించేసుకొని పక్కకు చూశాడు

విఠల్ అలా ప్రక్కకు చూడ్డం చూసి శివరాంప్రసాద్ పిచ్చివాడిలా పకపకా నవ్వాడు. ఆ నవ్వు చూసి మళ్ళీ భయపడ్డాడు విఠల్. చేతిలోవున్న సిగరెట్‌ని యాష్‌ట్రే మీద పెట్టాడు రెండోచేతిలోవున్న పుస్తకాన్ని మూసి వేశాడు శివరాంప్రసాద్.

"సిడౌన్! సిడౌన్!" అంటూ పక్కనున్న కుర్చీ చూపించాడు విఠల్‌కి. తానూ లేచి సరిగా కూర్చున్నాడు.

విఠల్ శివరాంప్రసాద్ ఆజ్ఞను శిరసా వహించాడు. అది చూసి నౌకర్ సూట్‌కేస్, టిఫిన్ క్యారియర్ విఠల్‌కు ప్రక్కగా పెట్టి వెళ్ళిపోయాడు.

"ఎవరవు బాబూ నువ్వు? నిన్నెక్కడా చూసినట్లు లేదే? ఇందాక అందుకే అంతసేపు చూసాను అడక్కుండానే తెలుసుకుందామని! కానీ అంతుపట్టలేదు!" అంటూ మరొకసారి నవ్వాడు.

"నేను విఠల్ని! విశ్వేశ్వర్రావుగారి అబ్బాయిని! సీతాదేవిగారి మనవడ్ని! కాకినాడనుంచి వచ్చాను!"

"నువ్వు విశ్వేశ్వరరావు కొడుకువా? సీతాదేవి మనవడివా? నిజమేనా?" అంటూ హడావుడిగా కుర్చీలోంచి లేచొచ్చి వణికిపోతూ విఠల్ భుజాల మీద గట్టిగా చేతులు వాల్చాడు! కళ్ళల్లోకి మళ్ళీ మళ్ళీ తదేకంగా చూశాడు. విఠల్ ఏదో అబద్ధం చెప్తున్నట్లుగా అనుమానించాడు.

"బాబాయిగారూ! నేను అబద్ధం ఆడటంలేదు!" అంటూ విఠల్ గబాల్న లేచాడు

"సిడౌన్ మేన్! సిడౌన్! నువ్వు నన్ను బాబాయని పిలుస్తున్నావా? ఇప్పటికి ఇరవైనాలుగేళ్ళనాటి పిలుపది! మళ్ళీ ఈనాడు నీ నోట విన్నాను!" ఆనందంతో అతని ఒళ్ళు ఒకటికి నాలుగుసార్లు పులకరించింది. విఠల్ని దగ్గరకు తీసుకొని గట్టిగా కౌగలించుకున్నాడు. బొటాబొటా కన్నీళ్లు కారుస్తూ వెళ్ళి తన గార్డెన్ ఛైర్లో జారిగిలబడ్డాడు.

"మీ నాన్నా నన్ను బాబాయనే పిల్చేవాడు!" అంటూ పరధ్యానంలోకి వెళ్ళిపోయాడు.

విఠల్‌కి ఆయన్నిచూసి జాలివేసింది. తానూ ఆయనకి దగ్గరగా తన కుర్చీలో కూర్చున్నాడు.

కొద్దిక్షణాలకి తిరిగి స్వీయధ్యానం లోకి వచ్చేశాడు శివరాంప్రసాద్.

"పోతురాజూ! పోతురాజూ!" అంటూ నౌకర్ని గట్టిగా పిలిచాడు శివరాంప్రసాద్ వాడు రెప్పపాటులో వచ్చి నిలబడ్డాడు.

"ఈ సామాను తీసికెళ్ళి నా గదిలో పెట్టు! ఇదిగో నా మంచం ప్రక్కన ఈయనకూడా మంచం వేయి.




అక్కడే పడుకుంటాడు! ముందు వేణ్ణీళ్ళు పెట్టు! స్నానం చేస్తాడు!"

ఆ మాటలు విని వినడంతోనే పోతురాజు సామాను తీసుకువెళ్ళాడు. శివరాంప్రసాద్ తన కుర్చీని విఠల్ కుర్చీకి దగ్గరగా లాక్కొని విఠల్ చెయ్యి తన చేతుల్లోకి ఆప్యాయంగా తీసికొన్నాడు. శివరాంప్రసాద్ చేతుల స్పర్శ తగిలి విఠల్ ఆత్మీయంగా ఫీలయ్యాడు.

"నువ్విలా సన్నగా వున్నావేమిటి? ఈ వయసులో మీ నాన్న దుత్తలా గట్టిగా వుండేవాడు. ఇప్పుడు నీ కెన్నేళ్లు బాబూ?"

"పందొమ్మిదో సంవత్సరం జరుగుతోంది!"

"అయితే నువ్వింకా కుర్రవాడివే! అలా సిగ్గుపడతావెందుకు? భయమెందుకు? మీ నాన్న ఎంతధైర్యస్థుడని! మీరు ఐదరెంతరు బాబూ?" అంటూ ఒకదాని తర్వాతొకటి అంతులేకుండా అడిగాడు శివరాంప్రసాద్.

"మా నాన్నకు నే నొక్కడ్నే!"

"అలాగా! మీ నాన్నా ఒక్కడే! ఆయనేం చేస్తున్నాడిప్పుడు?" ఎంతో దాహంతో అడిగాడు శివరాంప్రసాద్.

"ఆయన లేదు సార్! నా అయిదో ఏటే చనిపోయాడు! మా మదర్ కూడా లాస్టియర్ చనిపోయింది ఇక నాకు మిగిలింది మా నాయనమ్మ సీతాదేవి వొక్కతే!"

"అబ్బ! ఏం చావుకబుర్లు

చెబుతున్నావయ్యా!'' అంటూ బాధ పడ్డాడు గుండె ఎగురవేస్తుంది. అమితంగా ఆయాసపడ్డాడు. కుర్చీకి అంటుకుపోయాడు. అది చూసి విఠల్ భయపడ్డాడు ఆయన భుజంపట్టుకొని కదిలించి చూశాడు. ''బాబాయ్! బాబాయ్! ఏమిటలా అయిపోయారు?''

''ఏం లేదు బాబూ!'' అంటూ నూతిలోంచి పలికినట్లు సన్నగా పలికాడు. చేతితో సైగచేసాడు తనకేం ఫర్వాలేద న్నట్టుగా.

అలా కొద్దిక్షణాలు నిశ్శబ్దం. విఠల్ ఆయన బాధ చూచి వణికిపోయాడు శివరాం ప్రసాద్ కాసేపటికి తేరు కొన్నాడు ''మీ నాయనమ్మ సీతాదేవి నన్నుగురించి ఏమయినా చెప్పిందా?'' అని భయం భయంగా అడిగాడు

''ఆమేం చెప్పలేదు బాబాయిగారూ! మిమ్మల్ని కలుసుకోమని మాత్రం చెప్పింది మిమ్మల్ని చూసిరమ్మని మరీ మరీ చెప్పింది. మీ కోసం పులిహోర, పకోడీలు స్వయంగా చేసి పంపించింది. మీకు ఇంగువ పులిహోరన్నా, ఉల్లి పాయ పకోడీలన్నా ఇష్టమటగా!''అంటూ చిరునవ్వు నవ్వుతూ బాబాయ్‌కేసి చూశాడు విఠల్.

''అలాగా! అలాగా!'' అంటూ కొండంత సత్తువ తెచ్చుకొని లేవబోయాడు సంతోషబలంతో.

విఠల్ ఆయన్ను పట్టుకొని కూర్చోబెట్టాడు. దూరాన్నుంచి ఇదంతా చూస్తున్న పోతురాజును పిలిచి, ఇందాక తాను తెచ్చిన టిఫిన్ క్యారియర్ తెమ్మ న్నాడు విఠల్. నిముషాల్లో పోతురాజు ఆ టిఫిన్ క్యారియర్ తెచ్చి ఇచ్చాడు. దాహంగొన్న పిల్లవాడిలా ఎగబడి టిఫిన్ క్యారియర్ లాక్కున్నాడు శివరాం ప్రసాద్ ''ఏదేదీ నన్ను చూడనీ!'' అంటూ.

పోతురాజు ప్లేటు తెచ్చాడు వాడొచ్చేటప్పటికే టిఫిన్ క్యారియర్ ఖాళీచేశాడు శివరాంప్రసాద్

''ఎన్నాళ్ళకు తిన్నాను! ఎన్నాళ్ళకు తిన్నాను! సీతాదేవి వండిన పులిహోర, పకోడీలు తిని పాతికేళ్ళయింది! ఈ పాతికేళ్ళనుంచి ఆకలితోనే ఉన్నాను విఠల్ ఈ పాతికేళ్ళ ఆకలి ఈ టిఫిన్‌తో తీరిపోయింది విఠల్!'' అంటూ సంతోష పడ్డాడు చెయ్యి తుడుచుకుంటూ

ఆయన సంతోషమేమిటో విఠల్‌కు అర్థంకాలేదు పాతికేళ్ళ క్రితం మా ఫ్యామిలీ ఫ్రెండయి వుంటాడనీ, అంత ఆత్మీయంగా వుండి వుంటారనీ అనుకున్నాడు విఠల్.

''అయ్యో నా మతి మండ! గెస్టు తెచ్చినవి తిన్నానేకాని గెస్టుకి టీ అన్నా ఇవ్వలేదు!'' అని బాధపడుతూ పోతు రాజును పిల్చాడు శివరాంప్రసాద్. గెస్టుకి టీ, బిస్కట్లు తెచ్చివ్వమని వాణ్ణి కసురుకున్నాడు ఆ హుషారులో శివరాం

ప్రసాద్ గార్డెన్ ఛైర్‌లోంచి లేచి సిగరెట్ ముట్టించుకొని, ఉల్లాసంగా సిగరెట్ కాలుస్తూ అటూ ఇటూ పచార్లు చేశాడు ఏవేవో ఆలోచించుకుంటూ.

ఇంతలో టీ, బిస్కట్లు తెచ్చాడు నౌకరు. విఠలూ అంత మక్కువగానే తీసుకొన్నాడు. క్షణాల్లో తాగేశాడు.

"ఇదిగో సిగరెట్. కాల్చుకో!" అంటూ టీ త్రాగటం ముగించిన విఠల్‌కి ఇవ్వబోయాడు శివరాంప్రసాద్

"నో సార్, ఐ వోంట్ స్మోక్!"

"ఐ. సీ. దెన్ వెల్ అండ్ గుడ్! నీ వయసులో మీ నాన్న తెగ కాల్చేవాడు! నే నెంత వద్దన్నా వింటేనా వాడు! సరే అయిందేదో అయిపోయింది!" ఈ మాటలు చెబుతూనే అక్కడికక్కడే పచార్లు చేశాడు శివరాంప్రసాద్ మనసులోవున్న దూకుడంతా నడకలో చూపెట్టాడు.

"విఠల్! నీకో రహస్యం చెప్పేదీ? మీ నాన్నేకాదు, మీ నాయనమ్మకూడా బీడీ త్రాగేది! ఆమెకు గ్యాస్టిక్ ట్రబుల్ వుండేది! డాక్టర్ ఆమెకు బీడీ త్రాగమని సలహా ఇచ్చాడు! రోజుకు రెండూ మూడు బీడీలు తప్పక త్రాగేది!"

ఇంతలో నౌకరు వచ్చి ప్లేట్లు, టిఫిన్ క్యారియర్ తీసికెళ్ళాడు.

"రా? అలా షికారుకు పోదాం రా!" అంటూ శివరాంప్రసాద్ ముందుకు సాగాడు హ్యాండ్ స్టిక్ ఒకటి తీసుకొని. విఠల్ ఆయనతో జంటగా నడిచాడు. ఆ తోటలోనే ఓ సమాధి దగ్గరకు వెళ్ళి ఆగిపోయాడు శివరాంప్రసాద్ ఆ సమాధి చుట్టూ గులాబీతోట. ఆ సమాధిని చేతో స్పర్శిస్తూ "ఇది నా భార్య సమాధి! ఈమెకు గులాబీలంటే ఇష్టం! అందుకనే ఆమె సమాధి చుట్టూ ఈ తోట వేశాను. ఆమె చచ్చిపోయి యిరవై ఏళ్ళయింది! పాతికేళ్ళక్రితం, ఆమెను పెండ్లిచేసుకోక ముందు మీ ఫ్యామిలీతో వుండేవాణ్ణి! ఆమెతోనూ అయిదేళ్ళే వున్నాను! అంతలో ఈమె చనిపోయింది. తిరిగి మళ్ళీ నేను మీ ఫ్యామిలీలోకి రాలేకపోయాను. అలా ఒంటరి వాణ్ణయిపోయాను! నే నిక్కడి కొచ్చినప్పుడు, నువ్వు చెబితే నమ్మవేమో పదణాలంటే-పదణాలు జేబులో వుంది! ఇవ్వాళంటావా? పది లక్షల ఆసామినయ్యాను! ఇదంతా ఈమె ఆస్తే!" తన కథ చెబుతూ బాధగా నీలాకాశంకేసి చూశాడు శివరాంప్రసాద్.

ఆ బాధను శ్రద్ధగా విన్నాడు విఠల్. "అమ్మంటే మీరంత ఇదిగా వుండబట్టే ఈనాడిలా బాధపడుతున్నారు!" సానుభూతి పలికాడు విఠల్.

"అంతే బాబూ! అంతే! అయినా ఆమెమీద నాకు వున్న మక్కువంతా ఆమెతో అయిదేళ్ళు ఉండేటప్పటికి విరిగిపోయిన పాలలా ముక్కలు ముక్కలయి

పోయింది. ఆమెకు తాను మహా ఆస్తిపరురాలినని గర్వ ముండేది! నన్నొక బానిసగా చూసేది! నాకొక రకంగా బుద్ధే చెప్పింది. ఆమె డబ్బును చూసి ఆమెను ప్రేమించాను! మీ కుటుంబంతో వున్నంతకాలం కరువుల్తో బాధపడ్డాను. కరువుల్తో విసుగెత్తిపోయిన నా మనసు సుఖ సౌఖ్యాలను కోరింది! నన్ను తెచ్చి ఇక్కడ పడేసింది! రెండు చేతులా ఖర్చుపెట్టాను. భోగ భాగ్యాలు కరువుతీరా అనుభవించాను! కానీ ఏం లాభం! మనశ్శాంతి లేకుండాపోయింది! ఆమె నన్ను నానాటికి వెట్టిచాకిరీ బానిసగా చూసింది అది భరించలేక తిరిగి మీ కుటుంబంలోకి వెళ్ళామనుకున్నాను! అంత కంటే ఆత్మీయులు నాకెక్కడా కన్పించ లేదు! అయినా తిరిగి వెళ్ళడానికి సాహ సించలేకపోయాను! మీ నాయనమ్మకు నేనంటే పంచప్రాణాలు! అలాంటి అమెను వొదిలేసి వొచ్చేసి ఈ నరకం అనుభవిస్తున్నాను బాబూ! నేను వొచ్చేసే టప్పుడు మీ నాయనమ్మ కంటతడిపెట్టి అదేపనిగా ఏడ్చిందేగానీ నా మార్గాని కడ్డం రాలేదు! ఆనాడే ఆమె నా మార్గం అడ్డగించి వుంటే ఈనాడు నాకీ ఒంటరి తనం లేదు! ఈ నరకంలేదు!" అంటూ బొటా బొటా కన్నీరు కార్చాడు. కళ్ళ జోడు తీసి కంటనీరు మరీ మరీ తుడుచుకున్నాడు.

"ఈ వయసులో మీకో తోడు వుంటం మంచిదనుకుంటాను! మీ కెవరూ బంధువుల్లేరా బాబాయిగారూ?" ఆయన బాధకు జాలిపడి అడిగాడు విఠల్.

"ఏం చెప్పేది బాబూ? ఎక్కడి వాళ్ళక్కడ పోయారు! ఇలా ఒంటరిగా వుండటమే నా కలవాటయిపోయింది!" అంటూ ఆకాశంవేపుకు చూశాడు శివరాంప్రసాద్. సూర్యుడు అస్తమిం చాడు. మబ్బులు ఉదయించాయి. వాటికి గాలి తోడయింది.

"వర్షం వొచ్చేటట్టుగా వుంది! రూం కెళ్దాంరా!" అంటూ హ్యాండ్ స్టిక్‌తో నడుస్తూ బయల్దేరాడు శివరాం ప్రసాద్. చెయ్యి, ఒళ్ళు వొణికాయి.

"చూట్టానికి దృఢంగానే వున్నారే! అలా వొణికిపోతున్నారేం బాబాయి గారూ? అడుగడుక్కీ ఆయాసపడ్తు న్నారు!" అడిగాడు విఠల్.

"మంచి తిండి తినడంతో ఈ ఒంటికేం బాగానేవుంది! కానీ మనసే రోగిష్టదయిపోయింది!" సమాధానం చెప్పాడు శివరాంప్రసాద్, విఠల్ ప్రశ్నకు.

"ఇంతకూ నీ సంగతులడగనేలేదు! ఎంతసేపూ నా సొద చెప్పుకుంటూ వచ్చాను! ఏం చదువుతున్నావు బాబూ?"

"ఇంటర్ పాసయ్యాను. ఇక చదవాలనుకోవడంలేదు!"

"అదేమిటి? అప్పుడే చదువు




మానివెయ్యటమా ? మానేసి ఏం చేస్తావ్?" నడుస్తున్న వాడల్లా నిలబడి అడిగాడు శివరాంప్రసాద్.

"ఇక ఏదయినా ఉద్యోగం చూసుకోవాలి! ఇంతవరకూ మా నాయనమ్మ మిషనుకుట్టి చదువు చెప్పించింది. ఇప్పుడామెకు చూపుకూడా తగ్గిపోయింది. కుట్టుపని మానేసింది ! ఆరోగ్యం సరిగా లేదు మంచం పట్టింది."

"ఏమిటీ ? సీతాదేవి మంచం పట్టిందా ? చూపు కనపడ్డం లేదా ?" అంటూ బాధపడ్డాడు శివరాంప్రసాద్. "పోనీ కళ్ళకు జోడు వేయించుకోకపోయిందా ?" మళ్ళీ అడిగాడు శివరాంప్రసాద్.

"నా కాలేజీ ఫీజులే కడ్తుందా ? ఆమె కళ్ళకు జోడే వేయించుకుంటుందా ? ఆమె కుట్టు సంపాదన నా కాలేజీ ఫీజులకే చాలలేదు ! పైగా నన్నింకా బీ. యస్సి చదవమంటోంది. చదువు మానటానికి వీల్లేదంటోంది !"

"అవునవును ! నువ్వు చదువు మానటానికి వీల్లేదు ! ఆమె కాకపోతే నేను నీకు చదువు చెప్పిస్తాను ! ఎంత వరకు చదవాలనుకుంటే అంతవరకూ చదువుకో ?"

"అది కాదు బాబాయ్ ! మీరు చదివిస్తారు సరే ! నేను చదువుకుంటాను సరే ! మరి ఆమెను ఎవరు పోషిస్తారు ? ఆమెను పోషించాల్సిన బాధ్యత నాకు లేదూ ? అందుకే చదువు మానేసి, ఉద్యోగంచేసి ఆమెను పోషిస్తానంటున్నాను !"

"దటీజ్ కరెక్ట్ ?" అంటూ ఏదో ఆలోచించాడు శివరాంప్రసాద్.

"మీ నాయనమ్మ మాత్రం ఎవరని ? నేనన్నేది ఏమిటంటే - నేనూ మీ తాత లాంటివాడ్నే. నేనూ మీ తాత అనుకో ! అలాంటపుడు మీ నాయనమ్మ బాధ్యత నాకు లేకుండా పోతుందా? ఔనంటావా ? కాదంటావా ? టెల్ మీ బాయ్!" అంటూ భుజంమీద చెయ్యివేసి నిలబెట్టి అడిగాడు శివరాంప్రసాద్.

విఠల్ బదులు చెప్పలేదు. ఆయన చెయ్యి పట్టుకొని నెమ్మదిగా మెట్లెక్కించి ఆయన్ని రూంలోకి తీసుకొచ్చాడు. సోఫాలో కూర్చున్నారు. అంతసేపూ ఇద్దరూ మౌనం వహించారు. శివరాం ప్రసాద్ ఏవేవో తల్చుకొని లోలోన బాధపడ్డాడు.

"ఏదో కాంప్లెక్స్‌తో బాధపడుతున్నావ్ బాబాయ్ ! అదేమిటో చెప్పు బాబాయ్!" చేతులు పట్టుకున్నాడు విఠల్.

"నువ్వు తెలుసుకొని మాత్రం ఏం చేస్తావు బాబూ ! అంతా అయిపోయింది! తప్పంతా నాది ! చేతులారా చేసుకున్నాను ! చేసిందానికి సిగ్గుపడుతున్నాను !" అంటూ బాధపడ్డాడు. ఆ బాధతోనే లేచి అలమరానుంచి ఆ వణుకుతున్న చేతుల్తోనే స్కాచ్ బాటిల్ తెచ్చుకున్నాడు. తానొక గ్లాసులో పోసుకొని త్రాగుతూ మరో గ్లాసు విఠల్ కందించాడు.

"నో సార్ ! నో సార్ !" అంటూ ఆ గ్లాసును క్రింద పెట్టేశాడు విఠల్.

"వెరీ గుడ్ ! త్రాగటం తప్పే ! నీకు చెప్పకపోవడం ఏమిటి ? నేను బాటిల్సుకు బాటిల్సు త్రాగేస్తున్నాను ! ఎందుకు తాగుతున్నానో తెలియదు ! ఆమె గుర్తొచ్చినప్పుడల్లా మరీ త్రాగుతున్నాను ! సీసాలకు సీసాలు గుట్టలు పడిపోతున్నాయి !"

"ఆమంటే ఎవరు బాబాయ్ ? మీ మిస్సెసా ?" అని జంకుతూ అడిగాడు విఠల్.

ఆ త్రాగిన మైకంలో "నో నో" అనేశాడు. ఆ మరుక్షణమే తెలివిలోకి వచ్చి "యస్ ! యస్ !" అన్నాడు శివరాం ప్రసాద్ !

"ఇందాక...అలా అన్నారేం బాబాయ్ ! ఆమేదో మిమ్మల్ని బానిసగా చూసేదని...బాధ పెట్టేదనీ !"

"ఆ గొడవంతా ఇప్పుడెందుకులే ! ఇంకా ఏమయినా కబుర్లు చెప్పు... ఎన్నాళ్ళుంటా విక్కడ ?

"ఎన్నాళ్లోనా? రేపు వెళ్ళిపోతాను !"

"రేపే ! పదిరోజుల్దాకా నువ్వు వెళ్ళడానికి వీల్లేదు !" ఆర్డర్ వేసినట్లుగా మాట్లాడాడు శివరాంప్రసాద్.

"నేనిక్కడ పదిరోజులుంటే అక్కడ ఆమె..."

"బాబాయ్ రానివ్వడంలేదని రేపే మీ నాయనమ్మకు ఉత్తరం రాసెయ్ !

ఆమె ఏమీ అనదులే! పైగా ఇక్కడే వుండిపొమ్మని రాస్తుంది కూడాను! ఏమనుకుంటున్నావో?" పక పకా నవ్వాడు శివరాంప్రసాద్.

ఆ నవ్వు బలంతో లేచి గాడ్రేజ్ బీరువా దగ్గర కెళ్ళాడు. ఏవో డాక్యుమెంట్స్ తెచ్చి విఠల్ చేతి కిచ్చాడు.

"ఇవేంటి బాబాయ్!" అని ఆయన కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు విఠల్.

"ఇవి తీసికెళ్ళి మీ నాయనమ్మకివ్వు? ఆమె పేరరాసిన వీలునామా ఖది!"

ఆ మాట విని ఆశ్చర్యపోయాడు విఠల్. అతని కేమీ అర్థం కాలేదు

"మీ నాన్న పేరు కూడా రాయొచ్చనుకో! ఆయనో పెద్ద త్రాగుబోతు! జూదగాడు! పైగా ఆయనిప్పుడులేడు!" అంటూ ముగించాడు శివరాంప్రసాద్

"అయినా ఇదంతా ఏమిటి!" తిరిగి ప్రశ్నించాడు విఠల్

అదంతా నీకు తెలియదు! మీ నాయనమ్మ నా ఫస్ట్ వైఫ్! ఈ ఆస్తి కోసం కక్కుర్తిపడి ఆమె నొదిలేసి వచ్చేశాను! ఆస్తి దక్కింది కానీ ఆ ప్రేమ, ఆ మనశ్శాంతి ఎంత పెట్టి కొనుక్కుందామన్నా నాకు ఇక్కడ దొరకలేదు! ఆమెకు నేనంత అన్యాయం చేసినా ఆమె పల్లెత్తు మాటన్లేదు. ఏ దారిద్ర్యానికి భయపడిపోయి యిటు పరుగెత్తుకొచ్చానో, ఇవ్వాళ తిరిగి ఆ దారిద్ర్యాన్నే అనుభవించాలని అన్పిస్తోంది. మనసు తపిస్తోంది! నిజంగా ఆమెకు **నేను** చేసిన అన్యాయం క్షమించరానిది! అయినా ఆమె నన్ను క్షమిస్తూంది. అంత ఉత్తమురాలు," అంటూ భోరున ఏడ్చి సోఫామీద పడిపోయాడు.

బయట వర్షం కురుస్తోంది. ఉండుండి మెరుస్తోంది. అది ఇప్పుడు వెలిసేటట్టు లేదు! ఈయన ఇప్పుడు ఏడుపు మానేటట్టులేదు. విఠల్ అలాగే ఆయన్నంటి పెట్టుకొని కూర్చున్నాడు. అతని కళ్ళు ఉండుండి ఝడివాన కురిశాయి



# జిలేబి



వంశీ

'అద్దాల మేడలో అందాల భామ వుంది' అద్దాల బండిలో తియ్యటి జిలేబి వుందీ' అంటూ తియ్యటి కూనిరాగం తీస్తున్నాడు భద్రయ్య

గుండ్రంగా చుట్టలు చుట్టి ఎత్తుగా పేర్చిన తేనెరంగు జిలేబీ మిఠాయి బండిలో వుంది భద్రయ్య నోరూరిస్తోంది.'

అది తన నోట్లో పడే వుపాయం ఏమిటా అని ఆలోచిస్తున్నాడు.

పార్టీ ఎవరైనా క్వార్టర్ ఎలాట్‌మెంట్ కోసం రాకపోతాడా! ఆ వచ్చిన వాడితో జిలేబీ కొనిపించకపోతానా అనుకున్నాడు.

కాలం గడిచేకొద్దీ ఎండ తగిలిన మంచుముక్కలా అతని ఆశ నిరాశై పోయింది.

పార్టీ లెవరూ రాకపోవడంవల్ల ఆఫీసులో గుమస్తాలు గూడా కాఫీమాట ఎత్తడంలేదు లేకపోతే ఈపాటికి రెండు మూడుసార్లు కాఫీకి ఆర్డరు ఇచ్చివుండే వాళ్ళు. (బిల్లు పార్టీ ఇస్తాడనుకోండి.)

ఆ ప్రాజెక్టులో కొన్నివేల క్వార్టర్స్ వున్నాయి. వాటిని ఉద్యోగులకు ఎలాట్ చేసి ఆర్డర్స్ ఇచ్చే ఆఫీసు అదే. ట్రాన్స్‌ఫర్ మీద వెళ్ళిపోయే వాళ్ళ

క్వార్టర్స్ ఖాళీచేసి పోతుంటే, కొత్తగా వచ్చినవాళ్ళు ఆ క్వార్టర్స్ కోసం పడిగాపులు కాస్తూ ఆ ఆఫీసు చుట్టూ తిరుగుతూ వుంటారు. అలా వచ్చేవారికి సేవ చెయ్యడానికి భద్రయ్య ఎంతో ఆతృతతో వుంటాడు పాపం. ఆఫీసు జవాను భద్రయ్య ద్వారా క్వార్టర్ కోసం వచ్చినవారికి చిరునవ్వుతో దర్శనమిచ్చి సీనియార్టీ తల్లక్రిందులు చేసి సహాయం చెయ్యడానికి తహతహ లాడుతూ వుంటాడు ఆఫీసు గుమస్తా.

కాని పాపం ఆ రోజు వాళ్ళిద్దరూ ఎవరి ముఖం చూశారో గాని వాళ్ళ జేబుల్లో ఒక్క రాయీ పడలేదు.

కాలం గడిచేకొద్దీ కనిపించని ఎవరి మీదో భద్రయ్యకు చిరాకు కలిగింది. జిలేబీ కలయికకోసం అతని జిహ్వ తహతహ లాడుతోంది.

పోతే పోయింది ఒక అర్ధరూపాయి ఆ బండివాడి ముఖాన కొట్టి జిలేబీ తిందామా! అన్నంత ఆవేశం వచ్చింది భద్రయ్యకి.

కాని అర్ధరూపాయి వాడి ఎదాన కొట్టడమేగాని ఎంత వస్తుంది? ఏభై గ్రాములు అంటూ ఒక గులకరాయి త్రాసులో వేసి బంగారంలా తూస్తాడు. నోరు పాడైపోవడం తప్ప ఒక్క పంటి కిందకూ రాదుకదా!

ఎవరైనా పార్టీతగిలినప్పుడు తృప్తిగా తినాలి గాని సొంతడబ్బుతో కక్కుర్తి తిండి కడుపు నిండుతుందా?

భద్రయ్యకు కడుపులో వికారంగా వున్నట్లనిపించి సింగిల్ 'చా' నీళ్ళయినా గొంతులో పోసుకుందామని లేచాడో లేదో ఎవరో పాపం గొడుగు వేసుకుని వస్తూ కనిపించాడు.

'హమ్మయ్య! దేవుడిలా వస్తున్నాడు ఎవరోగాని' అనుకుని స్టూలుమీద కూలబడిపోయాడు భద్రయ్య.

ఆయన తెల్లటి బట్టల్లో బట్టలసబ్బు అడ్వర్టైజ్ మెంట్ మోడల్ లా వున్నాడు, బట్టతల నున్నగా ఎండలో అద్దంలా మెరుస్తోంది. ఆయన వయస్సు నలభై పైనే వుంటాయి.

"అయ్యగారున్నారా ?" అన్నాడతను వస్తూనే.

"లేరండీ, పెళ్ళికెళ్ళారు." అన్నాడు భద్రయ్య.

ఆ వచ్చిన అతని పేరు శ్రీశైలం. ప్రాజెక్టులో సూపర్ వైజర్ గా జేరి మూడునెలలు దాటిపోయింది. పెళ్ళాం, పిల్లలు బెజవాడ ఎండల్లో మాడిపోతున్నాం తీసుకెళ్ళమని వారానికొక రిమైండర్ ఇస్తున్నారు. ఇక్కడ ఈయనకి ఇల్లు ఎలాట్ చెయ్యడంలేదు. పోనీ ఇల్లు అద్దెకు తీసుకుందామా అంటే ప్రైవేట్ ఇళ్ళు లేవు. ఎన్నిసార్లు వచ్చి అడిగినా 'మీ సీనియార్టీ ఇంకా రాలేదు' అంటాడు ఎలాట్ మెంట్ గుమస్తా.

ఈసారి సరాసరి ఆఫీసరుగారితో మాట్లాడి పోదామని వచ్చాడు.

"అయ్యో! లేరా!" అంటూ శ్రీశైలం నిట్టూర్చాడు.

"ఫరవాలేదులెండి. ఆయన లేకపోతే నేం? మేం లేమా?" ఆప్యాయంగా అన్నాడు భద్రయ్య.

"వున్నారనుకోండి..." అన్నాడు శ్రీశైలం భద్రయ్య వ్యూహం అర్థంకాక.

"గుమస్తాగారితో మాట్లాడి మీకు క్వార్టర్ ఎలాట్‌మెంట్ చేయించే బాధ్యత నాది. తమకు 'ఏ' టైప్ కావాలా? 'బి' టైప్ కావాలా?"

"సీనియార్టీ వచ్చిందా?..." ఆశగా అడిగాడు శ్రీశైలం, తన పేరు ఇక్కడ జాయిన్ అయిన తేదీ వగైరా చెప్తూనే భద్రయ్య చిన్నగా నవ్వి "సీనియార్టీతో పనేముంది సార్? తమకు తెలియంది ఏముంది? ..." అంటూ ఎత్తుగా కన్పిస్తున్న శ్రీశైలం జేబువంక చూశాడు.

శ్రీశైలానికి భద్రయ్య భావం అర్థమై పోయింది. "అలాగే... అదెంత భాగ్యం. ఎలాట్‌మెంట్ ఆర్డర్స్ ఇవ్వాలి గాని. నా ఫామిలీ బెజవాడలో, నేనేమో ఇక్కడ చస్తున్నాననుకో," అన్నాడు.

భద్రయ్య ఆలోచించాడు ఒక్క క్షణం' గుమస్తాకి వంద, తనకి పాతిక. గుమస్తాకి ఏభై, తనకి పది. ఛా... మరీ తక్కువ. గుమస్తాకి రెండొందలు తనకి ఏభై...

ఏదీ ఒక అంకె కుదరడంలేదే. పని పూర్తవక ముందే ఆ అంకె ఏదో తేల్చు కుని అడ్వాన్సు తీసుకోవాలి. లేకపోతేనా పోతూ ... పోతూ ... కాఫీ తాగవోయ్ భద్రయ్యా అంటూ పావలా చేతిలో పెట్టేరకం.

"కాస్త తలనొప్పిగా వున్నట్లుంది శ్రీశైలంగారూ! కాస్త కాఫీ వేసు కుందామా?..." అన్నాడు భద్రయ్య.

"అయ్యో! కాఫీకేం భాగ్యం పదండి. అసలు నేనే అనాల్సింది..." అంటూ దారితీశాడు శ్రీశైలం.

'కాఫీ' అని పైకి అన్నాడుగాని జిలేబి తినాలని భద్రయ్య జిహ్వ తెగ తాపత్రయ పడిపోతోంది.

"శ్రీశైలంగారూ ఈ బండిలో జిలేబి వుంది చూశారూ. భలే రుచిగా వుంటుంది. నోట్లో వేసుకుంటే కరిగిపోతుందను కోండి."

"అలాగా..." అన్నాడు శ్రీశైలం పైకి. పీక్కుతింటారు ఏదైనా పనిమీద వస్తే చాలు అనుకున్నాడు లోలోపల.

"ఏవోయ్ శెట్టూ, చెరొక వంద గ్రాములూ ఇవ్వు," అంటూ ఆర్డరు చేశాడు భద్రయ్య.

"వీడి బాబుగాడిసొమ్ము దాచిపెట్టి నట్టు ఎంత దర్జాగా ఆర్డర్ ఇస్తున్నాడో పీనుగ వెధవ' శ్రీశైలంగొణుక్కున్నాడు

"నాకెందుకూ. మీరు తీసుకోండి," అన్నాడు.

"అలాగనకండి శ్రీశైలంగారూ. ఈ రోజు మీరు జిలేబీ రుచి చూడవలసిందే ఒక్కసారి తిన్నారంటే మళ్ళీ మళ్ళీ జిలేబికోసం మా ఆఫీసుకు రావల్సిందే. అంత బాగా చేస్తాడు మా శేటు. ఏంవాయ్ శేటూ "

బండివాడు నవ్వుతూ చెరొక వంద గ్రాములూ తూచి కాగితాల్లో పెట్టి ఇచ్చాడు.

శ్రీశైలం జిలేబీ నోట్లో వేసుకున్నాడు.

"మంచిది భద్రయ్యగారూ. మీరు చేసిన సహాయానికి ధన్యవాదాలు. ఆఫీసర్‌గారు వచ్చాక కలుసుకుంటాను." అన్నాడు వెళ్ళబోతూ.

భద్రయ్య అయోమయంగా చూశాడు.

"అదేంటి సార్. ఆఫీసర్‌గారు లేకపోతేనేం? వుంటేనేం? అంతా గుమస్తా గారి చేతిలోనే వుంది. మీ అప్లికేషన్ బయటకు తీయించి మీ 'ఏ' టైప్ ఇలు చూపించకపోతే నా పేరు భద్రయ్య కాదు."

శ్రీశైలం నవ్వాడు.

నా అప్లికేషన్ ఎప్పుడో బయట పడింది" అన్నాడు.

భద్రయ్య అర్థంగాక శ్రీశైలం వంక ఎగాదిగా చూశాడు.

"నేను క్వార్టర్ కోసం పెట్టిన అప్లికేషన్‌లో జిలేబీ పెట్టియిచ్చాడు ఈ మిఠాయి బండివాడు," అంటూ తన చేతిలోని కాగితం భద్రయ్యకు చూపించాడు శ్రీశైలం.

భద్రయ్య గుండెల్లో రాయిపడింది ఎవరో కర్రతో నెత్తిన కొట్టినట్లు స్థాణువై నిల్చుండిపోయాడు.

"లంచం ఇవ్వకపోతే మీరు క్వార్టర్స్ ఎలాట్ చెయ్యర్నమాట. అప్లికేషన్లు చెత్తకాగితాలుగా మిఠాయి వాడికి అమ్ముకుంటున్నారన్న మాట. సరే చూస్తాను" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు శ్రీశైలం.

* * *

క్వార్టర్స్ ఎలాట్ చేసినందుకు లంచం తీసుకుంటూ వుండగా గుమస్తాను అవినీతి ఆరోపణపై అరెస్ట్‌చేసి ఉద్యోగం నుంచి సస్పెండ్ చేశారని, ఆఫీసు కాగితాలు మిఠాయిబండివాడికి అమ్ముకున్నందుకు జవాన్‌ని వుద్యోగంనుంచి పంపివేశారనీ తర్వాత పేపర్లో ఒక వార్త పడింది.

ఇప్పుడు భద్రయ్య మిఠాయి బండి నెట్టుకుంటూ వీధుల్లో కన్పిస్తున్నాడు.

"జిలేబీ నా కొంప తీసింది," అంటూ సన్నిహితులకు జరిగిన కథ చెప్తూ వుంటాడు భద్రయ్య.



# పొట్లం

### బాలం వెంకట్రావు

పైట కొంగుతో చేతులు తుడుచు కుంటూ వంటింట్లోనుండి బయటికి వచ్చింది కమల. గుమ్మం వీధికెదురుగా వుండటంవలన చాల దూరంలో భర్త నడిచిరావటం కంటపడింది.

అతని చేతిలో ఒక పొట్లం వుండటం కూడా గమనించింది. పొట్లం ఏమైవుంటుంది చెప్మా అని ఆలోచనలో పడింది. 'తను ఎన్నిరోజులనుండో అడిగే పూరీ కర్ర, పీట తెస్తున్నారా? జాకెట్ గుడ్డలు తెస్తున్నారా? యిప్పుడున్న జాకెట్లు పాతవైపోయి తొడుక్కోగానే పిగిలిపోతున్నాయి ... లేక యింట్లోకి వెచ్చాలు ఏమైనా తెస్తున్నారా? ఎంత పొదుపుగా వాడుతూ వచ్చినా వెచ్చాలు చాలడంలేదు. నలుగురు బ్రతకాలి.

—ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయింది భర్త చేతిలోని పొట్లంవంక చూస్తూ.

ఇంతలో అక్కడికి కూతురు వచ్చింది వచ్చీరాగానే నడిచి వస్తున్న తండ్రిని చూసి, అతనిచేతిలోని పొట్లాన్ని పసిగట్టేసింది. తను అడుగుతూవున్న ఎంబ్రాయిడరీ వలయమో, లేక సంచులు అల్లడానికి ప్లాస్టిక్ నారో తెస్తున్నాడని కుతూహలపడింది. అమాయక మనసు




ఆగలేక, "అమ్మా! అమ్మా! నేను నాన్నగార్ని రోజూ అడిగే ప్లాస్టిక్ దారం తెస్తున్నారే!" అని సంబరపడిపోయింది. సంతోషపడిపోయింది. ఆ సమయానికి కొడుకూ వచ్చాడక్కడికి.

తండ్రి పొట్లం పట్టుకురావడం చూసి "నాన్న నాకు జామెంట్రీ బాక్సు, లెక్కల పుస్తకాలు, నోట్సు తెస్తున్నాడు" అని చేతులు చరుచుకున్నాడు ఆనందంతో.

"కాదు, నాకు ప్లాస్టిక్ దారం తెస్తున్నారు" అ ది కూతురు.

"కాదు, పుస్తకాలే తెస్తున్నారు" అన్నాడు కొడుకు

ఇద్దరికీ వాదన పెరిగే లోపు, "ఆగండర్రా! ఏదో ఒకటి ఎవరికో ఒకరికి ఈ రోజు తెస్తున్నారు. రేపు ఇంకొకరికి తెస్తార్లే" అని సర్దింది తల్లి.

"ఏమిటి! ముగ్గురూ నన్ను తదేకంగా చూస్తూ నిలబడ్డారు?" అని అంటూ వాకిట్లోనే ఆగిపోయాడు రామం.

"మిమ్మల్ని కాదులెండి, చూసేది! మీ చేతిలోని పొట్లాన్ని" అంది భార్య.

"పొట్లాన్నా? దేనికి!!" ఆశ్చర్య పోయి తన చేతిలోని పొట్లాన్ని తిప్పి తిప్పి చూసుకున్నాడు.

"ఆ పొట్లంలో ఎంబ్రాయిడరీ వలయం, ప్లాస్టిక్ దారం వుందంటోంది అమ్మాయి. కాదు, జామెంట్రీ బాక్సు, పుస్తకాలు వున్నాయంటున్నాడు అబ్బాయి," అంది భార్య.

రామం మనసు గతుక్కుమంది. పిల్లల ఆశల్ని తీర్చగలడా తను?

"మరి నువ్వేమనుకుంటున్నావో అదీ చెప్పేసెయ్యి" అన్నాడు, జాలిగా భార్యను చూస్తూ

"పూరి కర్రో, పీటో, జాకెట్

ముక్కలో లేక వెచ్చాలో అయివుంటా యనుకుంటున్నాను" అంది ఆశగా.

"కాదు కమలా కాదు. మీరడిగేవి ఏవీ ఈ పొట్లంలో లేవు. అసలు ఈ పొట్లమే మనది కాదు. నా స్నేహితుడిది. అవసరంగా అతను ఆఫీసునుండి అటే వెళ్ళిపోయాడు ఆఫీసు పనిమీద. వెళ్తూ ఈ పొట్లాన్ని తన యింట్లో యిమ్మని ప్రాధేయ పడ్డాడు. వెళ్ళి యిచ్చిరావాలి. ఈ పొట్లంలో ఏముందో నా కసలు తెలియదు" అన్నాడు రామం.

పిల్లలిద్దరూ చప్పబడిపోయి లోపలి కెళ్ళిపోయారు. భార్య వెళ్ళబోయింది, ఏమీ మాట్లాడలేక.

"ఇదిగో, నిన్నే! నీ దగ్గర ముప్పై పైసలుంటే యిస్తావా!" దిగులుగా అడిగాడు భార్యని.

"ముప్పై పైసలా? దేనికి?" విస్తుపోయింది ఆమె.

"రిక్షాకి, వెళ్ళేటప్పుడు రిక్షాలో వెళ్ళి వచ్చేటప్పుడు నడిచివస్తాను, లేకుంటే వెళ్ళేటప్పుడు నడిచివెళ్ళి వచ్చేటప్పుడు రిక్షాలో వస్తాను. స్నేహితుడి కిచ్చిన మాట దక్కించుకోవాలి ప్లీజ్!" అన్నాడు రామం నడిచివెళ్ళి రాలేనన్న బాధతో.

"బావుందండీ వరస! పొట్లాన్ని యివ్వడానికి ముప్పై పైసలు దండగ పడాలా? నా దగ్గర లేవు. మీకు జీతం వస్తేనే పైసల ముఖం చూడబోయేది" అంది నిఖచ్చిగా.

"దేవుడి దగ్గరుండే డబ్బులోనైనా తీసుకురావే! జీతం రాగానే దేవుడి డబ్బుల్లో వేసేద్దాం" అన్నాడు ఎంతో దీనంగా.

భర్త నడిచివెళ్ళి నడిచిరాలేక ప్రాధేయ పడుతున్నాడని గ్రహించి, దేవుడి దగ్గరకెళ్ళి దణ్ణంపెట్టుకుని, లెంపలేసుకుని ముప్పై పైసలు తీసుకొచ్చి యిచ్చింది, యిక ఎప్పుడూ అటువంటి పనులను ఒప్పుకోవద్దని మందలిస్తూ.

తలూపి బయల్దేరాడు రామం. తిన్నగా రోడ్డువారనున్న దుకాణం వద్దకెళ్ళి పొట్లం అతని కిచ్చాడు. ఆ పొట్లంలో వున్నవి తెగిపోయిన చెప్పులు!

ఉదయం ఆఫీసుకు చేరుకునేటప్పుడు చెప్పులు పట్టీలు తెగాయి. చేతితో పట్టుకు రాలేక న్యూస్‌పేపర్లో చుట్టి తెచ్చాడు. చెప్పులున్న పొట్లం ఆశలు రేపింది, ఆలు బిడ్డల్లో. తనను అబద్ధం చెప్పించింది. ఆశలు, అబద్ధాలు మధ్య నలిగిపోతూ తనబోటివారు ఆత్మల్ని సైతం చంపేసుకుని ఎలా బ్రతికేస్తారో ఊహించుకుంటూ ఇల్లు చేరుకున్నాడు రామం," చెప్పుల కాళ్ళతో.




జడి రఘుపతిగారింట్లో పెళ్ళివేడుకలు జోరుగా జరుగుతున్నాయి పెద్ద పందిరి వేశారు రంగు కాయితాల తోరణాలు కట్టారు. కొత్త బట్టలు, నగలు, అబ్బో! యెన్నెన్నో సరుకులు, సరంజామాలు పెళ్ళివారింటి కొస్తున్నాయి. పెళ్ళిసంరంబం ముమ్మరంగా వుండడానికి కారణం ఆయన ప్రప్రథమంగా చేయబోతున్న పెళ్ళి! పైగా, తన ముద్దుల రెండవ కుమార్తెకు!... చుట్టపక్కాల హడావుడీ కూడా యెక్కువగానే వుంది. అంతా యేదో వో బాధ్యత నెత్తిన వేసుకున్ని ఇటూ-అటూ తిరిగేస్తున్నారు. యెవరికి వారు తాము చెయ్యకపోతే ఆ పని ఆగిపోతుందేమో నన్నంత ఫీలింగు. పెళ్ళింకా సరిగ్గా రెండ్రోజులే వుంది!

అడపా - దడపా అమ్మలక్కలు యేదో వో మూల వో నిమిషమాగి, చెవులు కొరుక్కోడం; ముక్కున వేళేసుకోవడం; ముసిముసి నవ్వులు నవ్వుకోవడం వగైరాలు చేస్తూనేవున్నారు.

ఇవేమీ పట్టించుకోక, పెళ్ళి యెవరింట్లోనో, యెవరికో అనే భావనతో వున్నట్టు కనిపిస్తుంది. పెళ్ళి కుమార్తెకు స్వయాన తల్లి, రఘుపతిగారి ప్రియమైన భార్య అయిన మాలతి!

ఆమె అలంకరించుకొని, అలవోకగా హాల్లో కూర్చుంది. ఆలోచనలు, చూపులు యెక్కడో కేంద్రీకృతమై వున్నాయి! దేనికోసమో తీరని ఆవేదనతో నిరీక్షిస్తున్నట్లుంది.

ఆరోజు పోస్టులో మాలతి పేరున వో కవరొచ్చింది. దానివంక చూసి బాధగా నిట్టూర్చింది. ఆ రాత తనకి బాగా గుర్తే! తాను ఆ కవరును ఆశించ లేదు. ఆ కవరు వ్రాసిన వ్యక్తి సమక్షాన్ని నిరీక్షించింది! కానీ ఏంలాభం? తాను స్వయంగా వెళ్ళి, శుభలేఖ యిచ్చి ఆహ్వానించలేకపోయింది. అందుకే అభిమానం అడ్డంవచ్చి, తత్ఫలితంగా యీ కవరొచ్చింది! నిరుత్సాహంగా కవరు చించింది.

"పూజ్యురాలైన అమ్మకి నమస్కరించి వ్రాయునది, చెల్లి పెళ్ళి కళ్ళారా చూడా లన్న కాంక్ష, అమ్మని చూడాలన్న తపన, నాకు పిచ్చెక్కించేస్తున్నాయి! కానీ, యేం చేయగలనమ్మా? ... నాన్నగారి వద్దనుండి వదులుకోలేక, వెంటతెచ్చుకున్న 'అభిమానం' నన్ను మీ ప్రేమపాశానికి కూడా దూరంగా విసిరేస్తుంది! అందుకనే, కాంక్షలు, కోర్కెలనైనా చంపుకోగలను కానీ, అభిమానాన్ని చంపుకోలేను! నేనూ, మా వారు, తలలు వంచుకొని నిల్చో లేము! చిన్నా దూర-దూరంగా తిరిగి ఆడుకోలేదు! నాన్నగారి కఠిన దృక్కు-లనీ, మీ దయనీయ చూపులనీ భరించడం నా వల్లకాదు. గతం మనకు తెలిసిందే కదా! అందుకే మమ్మల్ని, ముఖ్యంగా 'నన్ను' క్షమించమని శతకోటి వందనా లర్పించుకుంటున్నాను! చెల్లి సౌభాగ్యాన్ని మనసారా వాంఛిస్తూ, శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాను!

ఇట్లు
విజ్జి!"

ఉత్తరం చదివిన మాలతి గుండెలు బరువెక్కిపోయాయి! లేచి, తన గదిలో కెళ్ళి పడుకుంది.

'విజ్జి బి.ఏ. చదువుకుంటున్న రోజుల్లో కాలేజీనుండి ఆలస్యంగా రావడం మొదలెట్టింది. తానొకరోజు నిలదీసి అడిగితే, కాలేజీ లెక్చరర్ ఆనందరావుని ప్రేమిస్తున్నానని, అతనితో పార్కుకి వెళ్ళొస్తున్నానని చెప్పింది! పైగా అతను ఆస్తిపాస్తులు కూడా లేనివాడుట! ఈ సంగతి ఆయనకి తెలిస్తే యింకేమైనా వుందా? ... యేం చేయడం? అని ఆలోచిస్తూండగానే 'విజ్జి' కి సుస్తీ చెయ్యడం, వెంటనే కంగారుపడి తమ ఫామిలీ డాక్టర్ ని పిలవడం, ఆమె నెల తప్పినట్టు చెప్పడం జరిగింది. అది విని నివ్వెరపోయింది తను. ఆయన అగ్గిమీద గుగ్గిల మయ్యారు. ఆనందరావుని జైలుపాలు చేస్తానని విజ్జీని అబార్షన్ చేయించు కోమని, నానా గొడవ చేశారు.




కానీ, విజ్జీ ఒప్పుకోలేదు. తాను ఆనందరావునే చేసుకుంటానని పట్టు పట్టింది. అదే నిర్ణయంతో అతనుకూడా యింటికి వచ్చాడు ఆయన యిద్దర్నీ యిష్టమొచ్చినట్టు తిట్టి, యికమీదట తనకు ఒక్కతే కూతురని విజ్జీకి, తనకూ సంబంధం లేదని, తాను చచ్చినా సరే, విజ్జీ మాత్రం యీ గడపలో కాలుపెట్ట రాదని శాసించి, యెంత చెప్పినా వినకుండా విజ్జీని వెళ్ళగొట్టేశారు. అంతే కాదు! ఆనందరావుని ఆరునెలల్లోగా చాలా దూర ప్రాంతానికి బదిలీ చేయించారు.

బదిలీఅయి వెళ్ళేనాటికి విజ్జీ పచ్చి బాలింత ఆడపిల్లని కని, ఆ పసికందుతో అలాగే భర్త వెంట వెళ్ళి పోయింది. వారు వెళ్ళకముందు గుడికో, బజారుకో వెళ్ళినప్పుడల్లా భర్తకి తెలీకుండా తాను విజ్జీ వాళ్ళింటికెళ్ళి, చూచి వస్తూండేది

విజ్జీ దూరమై మూడేళ్ళయింది. పెళ్ళిలోనైనా చూడవచ్చు అనుకుంటే ఆ ఆశ నిరాశ అయ్యింది. మాలతి మాతృహృదయంలో దుఃఖసాగరం పొంగి పొర్లింది

ఇద్దరే యిద్దరు కూతుర్లయినప్పుడు ఆయన కెందుకంత పక్షపాతం? ఇద్దరు పిల్లలూ తమకు సమానమే అయినా, యెందుకో పెద్దపిల్ల 'విజ్జీ' అంటే తనకు అమిత యిష్టం! అలాగే చిన్నది సుమతి అంటే ఆయనకి ప్రేమ! ఆడది కనుక తనేం చెయ్యలేకపోయింది విజ్జీ విషయంలో. మగవారు గనుక, తన ముద్దుల కూతురు సుమతి చేసిన ఘన కార్యాన్ని మెచ్చుకొని, బ్రహ్మాండంగా పెళ్ళి చెయ్యాలని యేర్పాట్లు చేస్తున్నారు!

అసలేమిటో యీ పక్షపాత వైఖరి కనుక్కోవాలి! ఆడది నోరు మూసుకు

కూర్చున్నంతకాలం యీ మగాళ్ళ ఆగడాలు యిలా హద్దులు మీరిపోతూనే వుంటాయి!

'ఆ ది' తొ మ్మి ది వం ద లు సంపాయించుకునే లెక్చరర్‌ని ప్రేమిస్తే తప్పొచ్చిందట! 'ఇది' తన దగ్గర అప్రెంటీసు యేడ్చి యీ మధ్య ప్రాక్టీసు పెట్టిన కుర్రకాకి లాయర్‌ని ప్రేమిస్తే, మంచిపని చేసిందట! ఇంత చేసి, కులస్థుడాంటే, అదీకాదు! యేమైనా సరే! యీ రోజు ఆ సంగతేదో తేల్చుకోవాలి.

'ఆయనే వెళ్ళి, మర్యాదగా విజ్జీ వాళ్ళందరినీ వెంటబెట్టుకొస్తారో, లేక పోతే యీ అన్యాయం భరించలేక తనని 'ఆత్మహత్య' చే సు కో మం టా రో అడగాలి!

దృఢనిశ్చయంతో లే చిం ది కన్నీళ్ళతో తడిసిన దిండుని వో మూలకు విసిరి, ముఖం తుడుచుకుంది. అంతలో భర్త హడావిడిగా రూమ్‌లోకొచ్చాడు.

భార్య ముఖకవళికలు గమనించాడు. "నాక్కూడా బాధగానే వుంది మాలతీ విజ్జీ రానందుకు! కానేం చేద్దాం? యేదో.. జరిగిపోయింది!" అంటూ ఆ మె ను దగ్గిరకు తీసుకోబోయాడు.

మాలతి అతని చేతిని నెట్టివేసింది. తన మనస్సులో వున్న బాధనంతా వెళ్ళగక్కింది. తన రక్తంలో పాలు పంచుకు పుట్టిన బిడ్డలపట్ల, యే తండ్రికీ యింతటి పక్షపాత బుద్ధి వుండదని అంది. ఇంతటి విపరీతాన్ని చూస్తూ బ్రతికేకంటే తాను వెంటనే చచ్చిపోతానంది!

అంతా విని బరువుగా నిట్టూర్చాడు. జాలిగా మాలతివంక చూసాడు. "చూడు మాలతీ!" ఆమె కన్నీళ్ళు తుడుస్తూ, "నువ్వు అన్నమాట ఆవేశపూరితమైందే తప్ప, నిజమైంది కాదు! ఎందుకంటే, 'పక్షపాత బుద్ధి' అన్నది నా కెప్పుడూ లేదు! నేను వృత్తికి న్యాయాధికారిని! న్యాయాన్ని కాపాడడమే నా ధర్మం! ఇన్నేళ్ళ స ర్వీ సు లో, నా వృత్తి ధర్మాన్ని నే నెప్పుడూ ఉల్లంఘించ లేదు!" అన్నాడు.

"విజ్జీకి నేనేదో అన్యాయం చేశానని, సుమతిని వెనకేసుకొస్తున్నానని అను కోవడం పొరబాటు!" కాస్త దూరంగా జరిగి, అరుణిమను సంతరిస్తున్న అస్త్రాద్రి దినకరుడిపై దృష్టి మళ్ళించాడు. "సూర్యుడు అందరికీ వెలుగు నిస్తాడు. కానీ వుదయించే సూర్యుడు అలాకాదు, చెట్లు - కొండలు అడ్డొచ్చి అస్తవ్యస్తంగా వెలుగునిస్తాడు. అలాగే విజ్జీ ప్రేమ వ్యవహారం బయటపడే నాటికి, వృత్తిరీత్యా నేను లాయర్‌ని. అంటే ఉదయించే సూర్యుడినన్నమాట! న్యాయవాది కెప్పుడూ తన క్లయింటే ముఖ్యం. ఆ క్లయింట్‌ని గెలిపించడం కోసం వాదించడమే న్యాయవాది ధర్మం!

అందువల్ల, ఆ నాడు నా కూతురే నాకు క్లయింట్. నా కులం, గౌరవం, అంతస్థుకు తగిన వరుడిని వెదికి, పెళ్ళి చేయవలసిన బాధ్యత నాది! అలాంటి సమయంలో 'విజ్జీ' నాకు అన్నివిధాలా 'అవమానం' కలిగించే పని చేయ బూనింది. అందుకే అడ్డు చెప్పాను. వాదించాను. ఆఫ్‌కోర్స్... చివ్వరికి నేనే వోడిపోయాననుకో!

"కానీ మాలతీ! యీ రోజు నేను జడ్జిని! నడినెత్తిన ప్రకాశించే సూర్యుడు లాంటివాడిని!" భార్యవైపు తిరిగి అన్నాడు.

"లాయర్‌గా వున్నప్పుడు, యెప్పుడూ త్రాసు నా వైపే మొగ్గాలి అనుకునేవాడిని!

"అయితే, యిప్పుడలా కాదు నేను న్యాయాధికారిని. యెప్పుడూ నాకు త్రాసు సమంగా వుండాలి!

జూన్ నెల యువ

## భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 25-00**

**ఈ కార్టూనుకు హాస్యయుత వాక్య (Caption) కావాలి**



**గమనిక :** వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి.
ఏప్రెల్ 1వ తేదీ లోపు మాకు చేరాలి.

"కనుకనే యుక్తవయస్కురాలైన వో స్త్రీ, తనకు నచ్చిన మరో యువకుడిని ప్రేమిస్తే, వారి మానసిక, శారీరక, ఆర్థిక పరిస్థితులను పరిశీలించి, అది సమమైన, పరిపూరకమైన, అవివాహితుల ప్రేమగా గుర్తించి, జడ్జిగా అంగీకరించాను. తండ్రిగా యీ పెళ్ళికి యేర్పాట్లు చేశాను! ఇప్పుడు కులగోత్రాలు, ఆస్తి, అంతస్థులు కాదు నాకు ముఖ్యం! నాకు మనుషులంతా ఒక్కటే! నేను న్యాయాధికారిని! ఆనాటి ధర్మం మారింది!

"అంతేకాదు! విజ్జీకి, నాకూ యిప్పుడు యెలాంటి విరోధమూ లేదు. ఈ రోజే నేను స్వయంగా వెళ్ళి, విజ్జీని, అల్లుడిని, మనుమరాలినికూడా పెళ్ళికి తీసుకు రాబోతున్నాను. యిది చెప్పాలనే యిప్పుడు నేను యిక్కడికొచ్చాను. నాకంతా సమానమే! ఇంతలో నువ్వే తొందరపడ్డావు!

"జరిగిందేదో జరిగిపోయింది. నువ్వేమీ బాధపడకు! నగలూ, బట్టలూ యింకా నువ్వు సెలక్ట్ చెయ్యలేదని తెలిసింది. సుమతికి, విజ్జీకి సమంగా సెలెక్ట్ చెయ్యి. ఇద్దరూ నాకు సమంగా వున్న త్రాసులోని రెండు సబ్బెలు! నాకు ముద్దుల బిడ్డలు! మరి... వెళ్ళొస్తా..." అని ప్రయాణమయ్యాడు.

ధర్మమాటలకి అవాక్కయిన మాలతి 'ధర్మం మారిందా...?' అంది, అసంకల్పితంగా.

## మే నెల యువ భావపరిచయ పోటీ

### బహుమతి పొందిన వ్యాఖ్య



డా॥ వారధి, యం. బి. బి. ఎస్.

— ఎస్.సి.వి.బి. చారి, పాల్వంచ.




తండ్రి ప్రియమైన జ్ఞాపకాలు, ఆయన ఆదరణ, ఆప్యాయతల మధ్య శ్యామూ తనూ గడిపిన మధురమైన బాల్యం జ్ఞాపకం వచ్చి మధు కళ్లవెంట అవిరళంగా కన్నీళ్ళు కారిపోతున్నాయి. అలాంటి మధురస్మృతులెన్నో, ఎన్నెన్నో కోరికలు ఒక్కటీ తీరలేదు, తీర్చడానికి తండ్రీ మిగల్లేదు.

ఇక తనకు మిగిలిన ఒకే ఒక ఆశా జ్యోతి శ్యాం. వాడిని తండ్రి కోరిక ప్రకారం పైలట్ ఆఫీసర్‌ను చేయగలిగితే... ఆ తర్వాత తనేమైపోయినా బాధలేదు. ఆలోచనలతో టైమెంత గడిచిందీ చూడలేదు. అప్పుడే చుట్టూ చీకటి ముసురుకోబోతోంది. అయిదుగంటలు దాటినట్లుంది.

శ్యాం యింకా రాలేదేమా? అని చూస్తూ, ముఖం తుడుచుకొని వీధివాకిట్లో నిలబడింది. ప్రక్కింటి మనోహర్ వచ్చేడు. బయట పిల్లలతో చేరి ఆడుతున్నాడు... ''ఒరే మనూ! శ్యాం కనిపించాడా?'' అని అడిగింది మధు.

''లేదక్కా, నేను చూడలేదు. అంతా వెళ్ళిపోయారే యిళ్ళకు'' అన్నాడు. వాడి ప్రక్కనే వున్న రాజేంద్ర ''అక్కా! వాడు స్కూల్‌నుంచి గంగానదివైపు వెళుతుండే చూశా. ఇంటికి రావురా అంటే, తర్వాత వస్తాను నువ్వెళ్ళరా

అన్నాడు" అంటూ మళ్ళీ వాడు తన ఆటలో మునిగిపోయాడు.

'పరీక్షలు అయిపోయినవనే వుత్సాహంతో పిల్లలంతా కలసి నదీతీరానికి వెళ్ళారేమో' అనుకొని లోపలికొచ్చి అన్నం వండి, అంతక్రితం రోజు తమ దొడ్లో కాసిన సొరకాయ తీసుకొచ్చి "అక్కా, ఇవ్వాళకూర, రేపుపులుసు." అంటూ క్రితం రోజు శ్యాం అందించిన సొరకాయ జ్ఞాపకం వచ్చి, సొరకాయ చెక్కుతీసి ముక్కలు కోసి, పులుసు పెట్టింది. ప్రొద్దుగూకింది బాగా. ఇంకా శ్యాం జాడ లేదు. మళ్ళీ వీధిలోకొచ్చింది మధు. ఆ దారిన పోయేవాళ్ళందరినీ అడిగింది. ఎవర్నడిగినా "మేం చూడ లేదు" అంటున్నారు.

క్రితం రోజునుంచీ వాడొకమాదిరిగా వుండటం, మధ్యాహ్నం తనని రెండు చేతుల్తో చుట్టేసి ఏడవడం అన్నీ గుర్తొచ్చాయి. రాజా చెప్పినట్లు వాడు గంగా తీరానికి వొంటరిగా పోలేదు కదా! పరీక్ష సరిగ్గా వ్రాయక తనేమైనా అంటుందని భయపడ్డాడేమో! కొంపదీసి ఏ అఘాయిత్యమన్నా చేయదుకదా?' ఆ ఊహరాగానే మధు నవనాడులూ కృంగిపోయాయి. భయంతో వళ్ళంతా కంపించింది. తలుపులైనా మూయకుండా భయంగా చంద్రం యింటివైపు పరుగెత్తింది.

ధాన్యం బస్తాల కానుకొని కూర్చొని తీరిగ్గా లెఖ్ఖలు వేసుకుంటున్నాడు చంద్రం. పరుగెత్తుకుంటూ, తలుపు త్రోసుకొని లోపలికొచ్చిన మధును చూసి,

"ఏవిటి మధూ?" అన్నాడు ఆదుర్దాగా లేస్తూ.

"బావా! ... శ్యాం ... శ్యాం కనిపించడంలేదు బావా!" అని అంతక్రితం రోజునుంచీ అప్పటివరకూ జరిగినదంతా వివరించింది. మౌనంగా విన్న చంద్రం చెప్పులేసుకుంటూ "నువ్వింటికి వెళ్ళు మధూ! నేను చూస్తాను. ఒకవేళ యీపాటికి యింటికి వచ్చాడేమో!" అంటూనే హడావుడిగా బయలుదేరాడు.

మధుతో అనలేదుగానీ చంద్రానికీ మనసులో భయంగానే వుంది. యిలాంటి కథలెన్నో విన్నాడు. పరీక్షపోయిందని తెలిసి ఆత్మహత్య చేసుకునే పిల్లలెందరో? వీడేమిటి? పరీక్షవ్రాయగానే కనిపించకుండా పోయాడేవిటి? పరీక్ష ఫలితం వాడి వూహకు ముందుగానే అందిందేమో! ఒకవేళ ఏ ఫ్రండ్స్‌తోనైనా కలిసి ఆడుకుంటున్నాడేమో! మధు ఖంగారుపడి అనవసరంగా నన్ను ఖంగారు పెడుతోంది" అనుకుంటూ ముందుకు నడుస్తున్న చంద్రం, తనను అనుసరించి వస్తున్న మధుని చూసి,

"మధూ! నువ్వింటికెళ్ళమ్మా! నేను తీసుకొస్తాను. వాడు నిజంగానే పరీక్ష సరిగ్గా వ్రాసి వుండకపోతే నిన్ను చూసి నువ్వు కోప్పడతావని భయపడొచ్చు.

నేను బుజ్జగించి తీసుకొస్తాను. నువ్వు పద" అని గంగాతీరం వైపు అడుగులు వేశాడు. దారిలో కనిపించిన రాజేంద్రను తీసుకొని వాడు చెప్పినవైపుగా వెళ్ళి నదీతీరమంతా గాలించారు. బ్యాటరీ సాయంతో మావిడితోటంతా వెదికారు. బస్సుస్టాండ్ దగ్గర, స్కూల్‌దగ్గర, పిల్లలు సాధారణంగా ఆడుకునే అన్ని ప్రదేశాల్లోనూ గాలించారు.

"ఇటు వెళుతుండేనే చూశాను మావయ్యా! ఒక్కడే వెళ్ళాడు," అంటూ బిక్కముఖం వేసిన రాజేంద్ర భుజం తడుతూ వాడిని వాళ్ళింటిదగ్గిర వదిలేసి తను నెమ్మదిగా నడుస్తూ మధు యింటికి చేరుకున్నాడు. ధారాపాతంగా కారుతున్న కన్నీళ్ళతో శోకదేవతలా అరుగుమీద కూర్చొని వున్న మధు చంద్రాన్ని చూడగానే పరుగెత్తుకుంటూ ఎదురొచ్చింది. చంద్రం వెనక దాక్కున్నాడేమో నని చంద్రాన్ని దాటి ముందుకు పరుగెత్తి, నిరాశగా వెనుదిరిగి చంద్రాన్ని చూసింది. ఆ చూపులో కదలాడిన భావానికి చలించి పోయిన చంద్రం నెమ్మదిగా-

"ఎక్కడా కనిపించలేదు మధూ! అంతా వెదికి చూశాను. వాడి ఫ్రెండ్సం దరినీ అడిగి చూశాను," అంటూండగానే హృదయం బ్రద్దలయ్యేలా ఏడుస్తూ-

# ఏప్రిల్ నెల క్విజ్

## సమాధానాలు

1 — బి  2 — సి  3 — సి

4 — ఎ  5 — ఎ

6. హిక్కీస్ కలకత్తా గెజిట్  7. క్వినైన్  8 లాడ్

9 అనంతపూర్  10. నాసిక్.

అల్ కరెక్టుగా పంపిన కిందివారికి ఒక్కొక్కరికి రూ 16-67 చొప్పున బహుమతి సొమ్ము పంచడం జరిగింది.

1. వి. నారాయణమూర్తి, కడప 2. కె. ఎం. నటరాజన్, సికింద్రాబాద్ 3. కె. ఇందిర, హైదరాబాద్ 4. కె. జ్యోతి, హైదరాబాద్ 5. కె. సాంబశివ నాయుడు, వెలమవారిపల్లె 6. కాలెపు నమశ్శివయ్య, రాజమండ్రి 7. ఎన్. వి. చలమారెడ్డి, పులివెందల.

"లేదు... లేదు. అలా జరగటానికి వీల్లేదు. వాడు నాకు దూరమవడానికి వీల్లేదు. వాడూ దూరమైతే యింక నా బ్రతుక్కి అర్థమేముంది? నేను వెళ్ళి వెదుకుతాను. నువ్వు సరిగా చూసి వుండవు వాడు గంగాతీరానే వుండి వుంటాడు," అంటూ ఆ చీకట్లో గంగా తీరంవైపు పరుగెడుతున్న మధును ఆపాలని చంద్రం చేసిన ప్రయత్నం ఫలించలేదు. గుండె లవిసేలా ఏడుస్తూ పరుగెడుతోంది. అప్పటికే రాజాద్వారా విషయం విన్న చాలామంది మధు ఏడుపు విని బయటకు వచ్చారు.

"శ్యాం గంగానదిలో పడి చచ్చిపోయాడట!" అనే వార్త అప్పటి కప్పుడే వూరంతా వ్యాపించింది! "మధు కూడా గంగాతీరానికి పరుగెడు తోందట చచ్చిపోవాలని" అనే వార్త క్షణాలమీద పాకిపోయింది వూరంతా.

జరిగిందొకటైతే ఆ వార్త అంచె లంచెలుగా పాకి ఆ వార్తకు మరో విరుద్ధమైన రూపాన్ని ఆపాదించే ప్రచారం చేసే ప్రబుద్ధుల ప్రచార ఫలితంగా ఆ వార్త అలా రూపు దిద్దు కుంది. వాళ్ళు విన్నది నిజమే ననిపించే ట్లుగా వుంది. ముందు మధు, వెనక చంద్రం గంగాతీరం వైపు పరుగెట్టడం చూస్తే...మరికొంతమంది చంద్రాన్ని నుసరించారు, మధు ఏ అఘాయిత్యం చేయకుండా ఆపాలని.

మధు తీరానికి చేరుకొని అంతా వెదుకుతూ "శ్యాం ... శ్యాం...బాబూ శ్యాం, ఒరేయ్ నిన్నేమీ అననురా ... వచ్చేయరా ... శ్యాం నువ్వు రాకపోతే నీ కళ్ళ ముందే ఈ గంగలో దూకు తాను ..." అంటూ ఏడుస్తూ, హృదయ విదారకంగా శ్యాం...శ్యాం... అంటూ చుట్టుప్రక్కల మారు మ్రోగేట్లు పిలుస్తోంది. ఎదురుగా నిండుగా పారే గంగమ్మతల్లి ఎలాంటి బదులూ ఇవ్వ లేదు. మధుకు ప్రక్కనే వున్న సరుగుడు చెట్లు ఏవో శబ్దాలు చేశాయి. మావిడాకులు గలగల మన్నాయి. మళ్ళీ ఆశగా అటు పరుగెత్తి "శ్యాం...శ్యాం తమ్ముడూ" అని పిలిస్తూ అక్కడేం బదులు దొరక్క నిరాశగా మళ్ళీ తీరానికి వచ్చింది. అప్పటికే అక్కడికి చేరి మధు పిలుస్తుంటే మౌనం వహించిన చంద్రం,

"మధూ నా మాట విను. వాడెక్కడో దాక్కొని వుంటాడు. రేపటికల్లా కన్పిస్తాడు. పద యింటి కెళదాం" అని చేతులు పట్టుకొని బ్రతిమాలాడు.

"లేదు బావా! నాకు తెలుసు. వాడింక నాకు కనిపించడు. మిగిలిన ఆ ఒక్కడూ గంగమ్మ ఒళ్ళో తలదాచుకున్నాడు. నువ్వెళ్ళు. నేను రాను - వాడొచ్చేంత వరకూ యిలాగే పిలుస్తాను. రాకపోతే నేనూ ఆ గంగమ్మతల్లి చల్లటి కడుపు లోకి వెళ్ళిపోతాను. అంతేగాని వాడు





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు. పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు. దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యాగల నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




## ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.

DC.G.64 TL

లేకుండా నేను మళ్ళీ గంగాపూర్‌లోకి రాలేను బావా!" అంటూ ఏడవటం మొదలెట్టింది

చంద్రాన్ని అనుసరించి వచ్చిన వాళ్ళంతా ఎన్నో రకాలుగా చెప్పి చూశారు. మధు వినలేదు ఆ యిసుకలో పడి హృదయం పగిలిపోయేలా కుమిలి కుమిలి ఏడుస్తోంది. శ్యాం...శ్యాం... అని స్వరపేటిక తెగిపోయేలా ఆక్రోశిస్తోంది. ఎవరి మాటా వినడంలేదు. చంద్రం మధు దగ్గర మోకాళ్ళమీద కూర్చొని "మధూ! నా మాట వినమ్మా! వాడు రేపటికి తప్పకుండా తిరిగివస్తాడు. యింటికెళ్దాం రామ్మా!" అంటూ గడ్డం పట్టుకొని బ్రతిమాలుతున్న చంద్రం చేతుల్ని ఒక్కసారిగా విదుల్చుకొని లేచి దూరంగా పరుగెత్తి ఎత్తుగా ఉన్న వొడ్డును చేరింది. లేచి మధును అనుసరించబోయిన చంద్రాన్ని చూసి పెద్దగా ఏడుస్తూ బావా! అక్కడే ఆగిపో బావా! నా గాలి సోకితేనే నా అనుకునేవాళ్ళంతా దూరమయిపోతున్నారు. నేను నష్టజాతకురాలిని బావా! నా దగ్గరకు రాకు, నువ్వూ మసైపోతావు. నా నీడ కూడా ఎవరిమీదా పడకూడదు. నా మాట కాదని నువ్వు నా దగ్గరకు వచ్చావంటే నేను గంగానదిలోకి వురుకుతాను. నా దగ్గరకు రాకు బావా!

"నాకు మిగిలినఒక్కరక్తసంబంధం ఈ రోజుతో పోయాడు. ఆత్మీయుడవైన నిన్ను పోగొట్టుకోడానికి సిద్ధంగా లేను బావా! నన్ను వదిలెయ్! నువ్వెళ్ళిపో. మీరంతా వెళ్ళిపోండి."

"నా మాట విను మధూ!" అని దీనంగా అర్థిస్తున్న చంద్రాన్ని మరోసారి హెచ్చరించింది, నువ్వు నా దగ్గరకు వస్తే నేను గంగానదిలో దూకుతానని ఏడుస్తున్న మధుని నిస్సహాయంగా చూస్తూ దూరంగా నిలబడ్డాడు చంద్రం. వచ్చినవాళ్ళలో ఎవ్వరూ అడుగు ముందుకు వేయడానికి సాహసించలేదు. అలా అని మధునక్కడ ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోవడానికి ఎవ్వరికీ మనసొప్పడంలేదు. గుండె లవిసిపోయేలా ఏడుస్తున్న మధునలాగే వదిలేస్తే ఏడ్చి ఏడ్చి పిచ్చిదైపోతుందేమోనని భయంగా వుంది చంద్రానికి ఇంకా శ్యాంని పిలుస్తోంది. ఎదురుగా వున్న మనుషులెవ్వరూ కన్పించడంలేదు. "శ్యాం ... ఒరే శ్యాం. ... వచ్చెయ్ నాన్నా!" అంటూ పిచ్చెత్తినదానిలా పిలుస్తూ ఏడుస్తోంది. చంద్రం కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి. కానీ కాళ్ళు భూమికి కట్టి పడవేసినట్లు నుంచున్న చోటునుంచీ కదల్లేకపోయాడు తను అడుగు ముందుకు వేస్తే మధు నదిలో దూకే ప్రమాదముంది. మధు దీనావస్థ చూస్తున్న వాళ్ళందరికీ కళ్ళు చెమ్మగిల్లాయ్. దూరంగా నిలబడే బ్రతిమాలుతున్నాడు చంద్రం "మధూ! వచ్చేయమ్మా" అని.

అసలు అతని మాటలు మధుకు వినిపిస్తున్నట్లు లేదు. తన లోకంలో తనుండి ఏడుస్తోంది మధు.

ఇంతలో ఎక్కడినుంచి వచ్చాడో ఎలా వచ్చాడో మధు వెనగ్గా వచ్చి రెండు భుజాలూ గట్టిగా పట్టుకున్నాడు శేఖర్. ధైర్యంగా సంతోషంగా అడుగు ముందుకు వేశాడు చంద్రం శేఖర్‌ను కూడా రెండుచేతుల్తో విదిలించి పారే స్తోంది. ఏడుస్తోంది. ఆ ఏడుపు మాత్రం ఆపడంలేదు. వినేవారి కడుపు తరుక్కుపోయేలా వుంది. ఏడుపు ఆపితే బావుండునని వుంది. కానీ ఆపడంలేదు. వో చేత్తో శేఖర్‌ను విదిల్చి ముందుకు పరుగెత్తాలని ప్రయత్నిస్తోంది. శేఖర్ పట్టునుంచి విడిపించుకోడం మధుకు సాధ్యంకావడం లేదు. అయినా తప్పించుకుపోవడానికి శతవిధాల ప్రయత్నిస్తోంది. శేఖర్ పిలుస్తున్నాడు.

"మధూ! మధూ! ఏవిటిది ? ఏడుపు ఆపు" అంటున్నాడు.

శేఖర్ అరుపులు,అంతకంటే పెద్దగా ఏడుస్తున్న మధు! ఏడుపు విచిత్రంగా చూస్తున్నారు జనం. మళ్ళీ మొదలెట్టింది మధు

"నేను నష్టజాతకురాల్ని, దురదృష్టవంతురాల్ని, నన్ను ముట్టుకోకండి, దూరంగా పొండి. నా గాలి సోకనంత దూరంగా పోండి" అని అరుస్తూ, ఏడుస్తోంది. ఆ ఏడుపులో ఏవంటున్నదో కూడా అర్థంకాకుండా వుంది. శేఖర్ నుంచి తప్పించుకోవాలనే ప్రయత్నం కొనసాగుతూనే వుంది. శేఖర్ బలం

# గడువు పొడిగింపు

శ్రీ చక్రపాణి అవార్డులు–1978 కు చేరవలసిన నవలల, కథల ఆఖరు తేదీ మే 1, 1978 గా రచయితలూ, రచయిత్రులూ గమనించ ప్రార్థన. ఈ పొడిగింపును రచయితల, రచయిత్రుల అర్థింపుపై చేయడం జరిగింది.

సంపాదకుడు
యువ

ముందు మధుకు అది సాధ్యంకావడం లేదు. అయినా ప్రయత్నం మానకుండా పోరాడుతూనే వుంది. ఏడుస్తూనే వుంది. ఆ ఏడుపుకు అంతంలేదేమో ననిపించేంత భయంకరంగా ఏడుస్తోంది.

"మధూ! మధూ! నా మాట విను. ముందా ఏడుపు ఆపు" అని అరుస్తున్న శేఖర్‌కు కూడా అంత చల్లటిగాలిలోనూ ముచ్చెమటలు పోశాయి చమటతో బట్టలు తడిసిపోయాయి. జడ విడిపోయి మోకాళ్ళవరకు జారి చెదిరిన జుట్టుతో చెమటకు తడిసి చెదరిన కుంకుమతో, శేఖర్‌ను తప్పించుకొని ముందుకు దూకాలని ప్రయత్నంలో అలసిపోతుంది మధు. గొంతు జీరబోతోంది. యింకా ఏడుస్తూనే వుంది. ఒక్కసారి చెయ్యి చాచి మధు చెంప అదిరిపోయేలా ఒక్క దెబ్బ వేశాడు శేఖర్ ... అంతే ... అప్పటి వరకూ ఎవరి మాటా వినకుండా, పిచ్చి పట్టిన దానిలా ఏడుస్తూ అందర్నీ ఖంగారుపెడుతున్న మధు ఒక్కసారే ఏడుపు ఆపి తలెత్తి శేఖర్ వైపు చూసి ది. మసక వెన్నెల్లో మిలమిలా మెరుస్తున్న ఆ కళ్ళలో ఏ భావం కనిపించిందో ఒక్కసారిగా శేఖర్ హృదయంలో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

మధు భుజాలచుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకుంటూ తల, వీపు నిమురుతూ "వూరుకో - వూరుకో మధూ," అంటున్న శేఖర్ గొంతు అస్పష్టంగా వినిపించింది. మధు ఏడుపు వుధృతం తగ్గింది. వెనక్కి తిరిగి చూసిన చంద్రం, నోళ్ళు వెళ్ళబెట్టుకొని ఆ విచిత్రాన్ని వినోదంగా తిలకిస్తున్న వాళ్ళవైపు తిరిగి, "పదండి పోదాం" అంటూ ముందుకు అడుగు వేశాడు. అప్పుడే ఆ సీన్ వదలిపోవాలని వాళ్ళకు లేకపోయినా, ముందుకు వేగంగానడుస్తూన్నచంద్రాన్ని చచ్చినట్టు అనుసరించక తప్పలేదు.

అంతా వెళ్ళిపోయారు. శేఖర్ గుండెల్లో ఒదిగి వెక్కిళ్ళు ఆపుకోడానికి ప్రయత్నిస్తున్న మధును నెమ్మదిగా నడిపించుకుంటూ తీరంవైపు సాగిపోయాడు. కొంత దూరం వెళ్ళిన తర్వాత అక్కడ యిసుకలో కూర్చుంటూ మధును కూర్చోబెట్టి నెమ్మదిగా గడ్డం పైకెత్తి

"మధూ! నీకునేను ఏమీకానా? చెప్పు. నా కోసమైనా నువ్వు బ్రతికుండాలని ఎందుకనుకోలేదు? నువ్వు పోతే నేను సుఖంగా బ్రతికుండగల ననుకున్నావా? శ్యాం యిలా ఎందుకు చేశాడో నాకర్థం కావడంలేదు. తమ్ముడు కనిపించకుండా పోయాడంటే బాధ ఉండదని నేననను. కానీ మరీ పిచ్చెత్తిపోయేలా ఏడుస్తూ నదిలో దూకుతాననడం వెర్రితనం. క్షమించు మధూ! నా చేత్తో నిన్ను కొట్టాను. పువ్వులా చూసుకోవలసిన నిన్ను కర్కశంగా నా వేలిముద్రలు

పడేంత గట్టిగా కొట్టాను. ఆ క్షణంలో నిన్ను పడం నా తరం కాదనిపించింది. పాపం! నువ్వలా మోడికెత్తి ఏడుస్తుంటే చంద్రం ఎంత బాధపడి వుంటాడు? నేను రావడం మరో రెండు నిముషా లాలస్యమైవుంటే ఏమై వుండేది" అంటూ మృదువుగా మందలిస్తున్న శేఖర్ మాటలు వింటూ,

"నేనేం చేయను? నా కింక యీ ప్రపంచంతో పని లేదనిపించింది. ఆ క్షణంలో శ్యాం ఒక్కడు తప్ప నా కెవ్వరూ జ్ఞాపకం రాలేదు" అంటూ కన్నీళ్ళు కారుస్తున్న మధు కన్నీరు తుడుస్తూ "అలా ఎప్పుడూ అనుకోకు మధూ! నీ కోసం అనుక్షణం ఆరాటపడే హృదయముందని జ్ఞాపకం పెట్టుకో. అన్నయ్యలా ఆదరించే చంద్రం వున్నాడని గుర్తు తెచ్చుకో. నీకు నువ్వే వొంటరిదాన్నని అనుక్షణం అనుకుంటూ బాధపడవలసిన పని వుండదు. పద, ప్రొద్దుపోతోంది." మధుకు చెయ్యి ఆసరాగా యిచ్చి యింటివైపు అడుగులు వేయించాడు

చంద్రం వాళ్ళింటి ముందే నుంచొని ఎదురుచూస్తున్నాడు శేఖర్... చంద్రాన్ని, సుషమను వాకిట్లో చూడగానే "సుషమా! మధును యింట్లోకి తీసుకెళ్ళు" అని మధు భుజం పట్టుకొని ముందుకు తీసుకెళ్ళాడు శేఖర్. సుషమ మధు భుజాన్ని చుట్టూ చేయివేసి, "రా మధూ!" అంటూ లోపలికి తీసుకెళ్ళింది. కళ్ళనిండా నీళ్ళతోనే సుషమ ననుసరించింది మధు

చంద్రం, శేఖర్‌లు మిగిలారు వాకిట్లో. "పద, నిన్ను యింటివరకూ పంపి వస్తాను" అంటూ శేఖర్ భుజాన చేయివేసి ముందుకు నడిచాడు చంద్రం. దారిలో ఎన్నో విషయాలు మాట్లాడా లనుకొన్న యిద్దరూ ఏమీ మాట్లాడుకో లేకపోయారు. మౌనంగా ముందుకు నడుస్తున్న వాళ్ళను వింతగా చూస్తున్నారు కొందరు ఇళ్ళముందు నుంచొని. శేఖర్ ఇల్లు రాగానే ఆగిపోయాడు చంద్రం. "శేఖర్! ఎన్నో మాట్లాడాలను కున్నాను. కానీ ఒక్కటీ గొంతుదాటి రావడంలేదు. మనం ఎన్ని రకాలుగా అనుకున్నా, ఈ రోజు సమయానికి నువ్వు రాకపోతే మధు మనకు దక్కేది కాదు. అది మట్టుకు నిజం. ఏవిటో మాట్లాడబోయి మరేవిటో మాట్లాడుతున్నాను. ప్రొద్దుపోతుంది. వెళ్ళు, నాన్నగారు కోప్పడతారేమో!" అంటున్న చంద్రాన్ని అప్యాయంగా చూస్తూ "నాన్నగారు ఈ రోజే వూరెళ్ళారు అమ్మ ఆదుర్దా పడుతుంటుంది. రామి పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పకపోతే నాకు విషయం తెలిసేదికాదు. నేను యింట్లోనే వున్నా నివాళ. బయటకు రాలేదు. రామి చెప్పిన విషయం వినగానే ... క్షణం ఆలోచించా, అమ్మ

పిలుస్తున్నా వినిపించుకోకుండా గంగా తీరానికి చేరాను. అటు రాగానే ఆ జనం, నీ వేడికోలు, మధు ఏడుపూ అటు ఎత్తుగావున్న వొడ్డు వైపు పరుగెత్తడం అన్నీ కనిపించాయి. మరోనిముషం నిలవకుండా వెనక్కు తిరిగి, సరుగుడు తోట మీదుగా ఆ వొడ్డుకు చేరుకున్నాను" అని తృప్తిగా అంటున్న శేఖర్ మాటలు పూర్తి కాకుండానే శ్యామలాదేవి బయటకు వచ్చి "చంద్రం మధు ..." అంటుండగానే "యింటికి తీసుకొచ్చా మమ్మా! మా యింట్లోనే వుం—ంటా నమ్మా! వస్తారురా శేఖర్! సుషమ ఒక్కతే వుంది, అమ్మ కూడా లేదు యింట్లో మధు ఏ అఘాయిత్యానికి పాల్పడుతుందోనని భయంగా వుంది" అంటూ ముందుకు వెళుతున్న చంద్రాన్ని చూస్తూ "ఇక నీకా భయంలేదు చంద్రం. మధు అలాంటి పిచ్చిపనులు చేయదు నేను బ్రతికుండగా" అనుకుంటూ, తల్లి ననుసరించి యింట్లోకి వెళ్ళిపోయాడు శేఖర్. హృదయం నిండిన ఆత్మవిశ్వాసంతో.

* * *

వారంరోజులకు గంగాపూర్ చేరిన రఘుపతిరావుగారు, శ్యామలాదేవి ద్వారా కథంతా విని చిన్నగా నవ్వుకున్నారు.

"మధు యిప్పుడెక్కడ వుంది?" అని అడిగారు.

అంతటి అశుభవార్త విని నవ్వ
గలుగుతున్న ఆయన ఆంతర్య మేమిటో
అర్థంకాని శ్యామలాదేవి విసుగ్గా ఆయన
వైపు చూసి,

"పాపం! దానికి యింకెవరు మిగి
లారు? వాళ్ళ చంద్రంబావ యింట్లోనే
వుంది. మళ్ళీ ఒక్కతే వుంటే తమ్ముడిని,
మావయ్యను, అత్తయ్యను తలుచు
కొని దిగులుపడుతుందని సుషమ,
చంద్రం వాళ్ళింట్లోనే వుంచారు,"
అన్నారు. మధును తలచుకొని సాను
భూతిగా రామి ద్వారా గంగాతీరాన
జరిగిన సంఘటనంతా విన్న తర్వాత
మధుమీద అభిమానాన్ని మరింత పెంచు
కున్నారు శ్యామలాదేవి మధు అంటే
ఆమె కెప్పుడూ యిష్టమే. కాకపోతే
అంతస్థుకు తగదనే ఆలోచనతో మధును
కోడలిగా చేసుకునేటందుకు అంతరంగం
అంతగా అంగీకరించకపోయినా మధు
మీద కావల్సినంత అభిమానం,సానుభూతి
ఉన్నాయి. కొడుకు ఆరోగ్యం దెబ్బ
తిన్నప్పుడే తప్పకుండా ఎలాగైనా
రఘుపతిగారిని వొప్పించి మధును
కోడలిగా చేసుకోవాలనుకునారు.
ఒక్కగానొక్క కొడుకు ,వాడు అమితంగా
కోరుకున్న మధును కాదనడానికి ఆమెకు
మనసొప్పలేదు. ఇంతలో శ్యాం పోవడ
మనే అవాంతరం వచ్చిపడింది.
రఘుపతిగారు వూళ్ళో లేకపోవడంవల్ల ఆ
విషయాలు ఆయన ముందు సంప్రదించే
అవకాశం కలగలేదు.

"మీరు వెళ్ళిన పనేమైంది? ఎందుకట
అంత అర్జంటుగా రమ్మని కబురుచేశారు
శ్రీధర్ గారు?" అంది.

"ఆ ఏదో వాళ్ళ శిరీష్
విషయం మాట్లాడ్డానికి పిలిపించారులే.
అసలు విషయం ఒక్కడే వుండటంతో
ప్రొద్దుపోవడం లేదట. నాలుగు రోజులు
సరదాగా నాతో గడిచిపోతుందని పిలి
పించాడు" అంటూ లోపలికెళుతున్న
రఘుపతిగారి వంక విచిత్రంగా
చూసింది శ్యామలాదేవి ఆమె యిన్నేళ్ళ
కాపురంలో ఎప్పుడూ ఆయనలా ఒకరి
కోసం కలకత్తా వెళ్ళి వాళ్ళతో సరదాగా
నాలుగు రోజులు గడిపి వచ్చానని
చెప్పగా వినడం యిదే మొదటిసారి

ఏవిటో ఎన్నేళ్ళైనా ఈ మనిషిని
అర్థం చేసుకోలేక పోతున్నాను అను
కుంటూ చిన్నగా నిట్టూర్చి, వంటగది
లోకి వెళ్ళిపోయారు. వంటమనిషికి
ఏమేం చేయాలో పురమాయించే పనిలో
మునిగిపోయారు.

* * *

మరోవారం ఏ విశేషాలూ లేకుండానే
గడిచిపోయాయి. మధు శ్యాంని తలుచు
కొని రోజూ తనలో తానే కుమిలి
పోతోంది. అయినా మధుకంట తడి
పెట్టకుండా సాధ్యమైనంతవరకూ,
ఏవేవో కబురు చెబుతూ సుషమ,
చంద్రం; శేఖర్ వంతులు వేసుకొని
కాలం దొర్లిస్తున్నారు. శేఖర్ తన సమ

ఇప్పుడు మీరు అతని పళ్లను
పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును

## వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరిచి దంత క్షయాన్ని నివారించేందుకు
దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.






**సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో**

కుటుంబంలో వారికి పిప్పి
పళ్లు రాకుండా నిరోధిస్తుంది

హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2.1-172 TL

Yuva (*Telugu Monthly*) May 1978

క్షంలో వున్నపుడు మధుకు తను అతని కోసమే బ్రతుకుతున్నాననే భావన కలిగేది. 'అంత ఆత్మీయంగా వున్న వ్యక్తి ఆ రోజు అంత గట్టిగా ఎలా కొట్ట గలిగాడా ?' అని ఆశ్చర్యపోయేది అయితే ఆ చెంపదెబ్బే తనను స్పృహ లోకి తీసుకురాగలిగింది. తనకోసం ఆరాటపడే మరో హృదయముందని గుర్తుచేసింది. అందుకే అధారంగా నిలబడ్డ ఆ గుండెల్లో తల దూర్చి తన ఆవేదన్ని చెప్పుకోడానికి ప్రయత్నిం చింది." ఆలోచనలలో వున్న మధు శేఖర్ మాట వినిపించి లేచి నుంచొని గుమ్మంవైపు చూసింది అప్పుడే లోపలి కొస్తున్న శేఖర్-

"మధూ! చంద్రం ఎడీ! వాడి నెందుకో అర్జంటుగా రమ్మని చెప్పారు నాన్నగారు" అంటూండగానే, లోపలి నుంచి బయటకు వచ్చిన సుషమ, "ఎందుకన్నయ్యా ? స్నానం చేస్తు న్నారు. అయిపోయినట్లుంది, పిలుస్తా నుండు" అని వెనక్కు తిరగ్గానే-

"కానీయ్ సుషమా! ఫర్వాలేదులే మరీ అంత తొందరేం లేదు నువ్వెళ్లి నాన్నగారు పిలుస్తున్నారట" అని చెప్పావా! అలాగే వచ్చేసినా వచ్చే స్తాడు వాడు. డ్రెస్ చేసుకొని రానీ" అన్నాడు చిన్నగా నవ్వుతూ శేఖర్ నవ్వుతో శృతి కలిపింది సుషమ మధు తల వంచుకొని బొమ్మలా నుంచుంది

దగ్గరగా వెళ్ళి కుర్చీలాక్కొని కూర్చుంటూ-

"నుంచున్నావేం మధూ! కూర్చో" అంటూ చేయిపట్టుకొని బల్లమీద కూర్చో బెట్టాడు

"కాఫీ తెస్తానన్నయ్యా! మీరు మాట్లాడుతూండండి" అంటూ లోపలి కెళ్ళింది సుషమ. ఇంతలో షర్ట్ వేసు కొని హాల్లోకి వస్తూ వంటగదిలోకి వెళు తున్న సుషమకు ఓ దాష్ యిచ్చి "అరెరే పడిపోతావ్" అంటూ ఆ పంకతో దగ్గరకు లాక్కోబోతున్న చంద్రాన్ని ఒక్క తోపు తోసి-

"అన్నయ్య వచ్చాడు" అంటూ చిన్నగా నవ్వుతూ లోపలికి పరుగెత్తింది సుషమ

అప్రయత్నంగా ఆ దృశ్యం చూసిన మధు శేఖర్‌లు చిన్నగా నవ్వుతూ తలలు వంచుకున్నారు.

"ఏంరా శేఖర్! పెళ్ళికొడుకులా తలవంచు కూర్చున్నావేమిటి ?" అంటూ నవ్వుతూ ప్రక్కన కూర్చోబో తున్న చంద్రాన్ని.

"ఒరేయ్! చంద్రం! నాన్నగారు నిన్న ర్జంటుగా రమ్మని చెప్పమన్నార్రా. పద పద" అంటూ లేచిన శేఖర్‌ను చూసి, కాఫీ పట్టుకొస్తున్న సుషమ-

"ఆయనే కదన్నయ్యా రమ్మన్నది. నువ్వెందుకూ మళ్ళీ ఆయన వెళతారులే. నువ్వు కూర్చో కాసేపు కబుర్లు చెప్పు



మరే ఇతర
డిటర్జంట్ బార్ తోనైనా
ఉతికినది




సూపర్ రిన్‌తో
ఉతికినది






SUPER
RIN
DETERGENT CAKE
RIN

కుందాం" అంటూ ముగ్గురికీ కాఫీ అందించి తనూ ఓ గ్లాసు తీసుకొని వచ్చి కూర్చుంది కాఫీ తాగి చంద్రం శేఖరింటివైపు వెళ్ళిపోయాడు "నువ్వు కూర్చోరా" అని శేఖర్‌ను ఆపేసి

సుషమ, శిరీష్ అమెరికానుంచి వ్రాసిన లెటర్ తీసుకొచ్చి శేఖర్‌కు చూపించింది కొంత సేపు శిరీష్ గురించి, ఫ్లారెన్స్ గురించి మాటలతో కాలక్షేపం చేశారు "యిప్పుడు అన్నయ్య లెటర్స్ చాలా బాగా వ్రాస్తున్నాడన్నయ్యా" ఇండియాలో వున్నప్పుడు ఎంత బద్ధకించేవాడో నీకు తెలుసుగా. యిప్పుడు ప్రతి విషయం వివరంగా వ్రాస్తున్నాడు యిది అమెరికా వనిత ప్రభావమో, ఆ వాతావరణ మహాత్మ్యమో తెలీడంలేదు. కానీ నాకు చాలా సంతోషంగా వుంది," అంది సుషమ.

"పరాయిదేశం వెళ్ళాడు కదమ్మా! యిప్పుడు సహజంగానే అసలైన ఆత్మీయతలన్నీ బయటపడతాయి. నాకు కూడా అలాగే చాలా వివరంగా వ్రాస్తున్నాడు వాడి మనసులో వున్న ప్రేమాభిమానాలు, పరాయిదేశం వెళ్ళాక గానీ పొంగి ప్రవహించలేదన్నమాట."

"ఈ మధ్య డాడీ లెటర్స్ వ్రాయడం తగ్గించారు ఆరోగ్యమెలావుందో ఏమో! ఒంటరిగా వున్నారు" అంటోన్న సుషమ గొంతు చలించడం గమనించి-

"ఈ మధ్య అంకుల్‌కూ నాన్నగారికీ మంచి దోస్తీ అయిందిలే. ఆ వయసులో ఫ్రెండ్స్ దొరికితే యింకెవ్వరూ కనిపించరు. మొన్నీమధ్య ప్రత్యేకంగా కలకత్తా వెళ్ళి నాన్నగారు, కలకత్తాలో వారంరోజులు వుండగలిగారంటే చాలా ఆశ్చర్యకరమైన విషయమే నాన్నగారికి నిన్న అంకుల్ దగ్గరనుంచి లెటర్ వచ్చినట్లుంది 'శ్రీధర్‌కు యింక కొడుకును గురించిన బెంగ తీరిపోయిందిలే' అని అమ్మతో అంటున్నారు. బహుశా శిరీష్ త్వరలో వస్తానని వ్రాసి వుంటాడు అందుకే ఆ సంతోషంలో తాత్కాలికంగా కూతురికి లెటర్ వ్రాయడం మర్చిపోయివుంటారు పోనీ నువ్వే వ్రాయకపోయావా?" అన్నాడు శేఖర్.

"ఇవ్వాళే వ్రాస్తానన్నయ్యా!" అంది సుషమ వాళ్ళ మాటలు వింటూ కూర్చుంది మధు కొంచెం సేపు శేఖర్‌తో ఏవో కబుర్లు చెబుతూ కూర్చొని "మీరు మాట్లాడుతూ ఉండండన్నయ్యా! లోపల కొంచెం పనుంది మధూ! మరీ అలా మూగలా కూర్చోకు, మా అన్నయ్య బోర్ కొట్టి పారిపోతాడు" అంటూ మధుకో హెచ్చరిక జారీచేసి నవ్వుకుంటూ లోపలికెళ్ళిపోయింది సుషమ.

మధు, శేఖర్ వొంటరిగా మిగిలారు మళ్ళీ మధు తలవంచుకుని చేతిలోని పుస్తకంపై దృష్టి సారించింది చిన్నగా నవ్వుతూ ఆ పుస్తకం తన

చేతుల్లోకి తీసుకున్నాడు శేఖర్. అప్పటికీ తల ఎత్తకుండా కూర్చున్న మధు వైపు ఓ క్షణం చూసి, "మరి నే వెళ్లొస్తాను" అంటూ చిరుకోపంతో లేచి నుంచున్నాడు.

అప్రయత్నంగా శేఖర్ చేయి పట్టుకొని అంతలోనే వదిలేసింది మధు. కానీ పెదవి కదపలేదు నవ్వుతూ మళ్ళీ కూర్చున్నాడు శేఖర్.

"వధూ! ఇంకా సంకోచమేనా? యింకా ఆలోచిస్తున్నావా? నవ్వు మాట్లాడకుండా అలా వుంటే నే నెలా కూర్చోను?" అంటుంటే నెమ్మదిగా కళ్ళెత్తి శేఖర్ వైపు చూసి—

"ఏం మాట్లాడను? జీవితాశ నశించిన నన్ను 'నా కోసం జీవించు వధూ!' అని బ్రతికించారు. అయినా ఎప్పుడూ ఏవేవో ఆలోచనలతో నా మనసు నా స్వాధీనంలో వుండటంలేదు. ఎంత వద్దనుకున్నా శ్యాం జ్ఞాపకాలు..." అంటున్న మధు కళ్ళనిండుగా నీళ్ళునిలిచి చెంపల మీదుగా జారిపోయాయి.

"ఛ! ఛ! ఏవిటిది వధూ! నా ముందెన్నడూ కంట తడి పెట్టనని అన్న మాట మర్చిపోయావా? కళ్ళు తుడుచుకో. నీకు మనశ్శాంతిగా వుండటానికి నేనూ, చంద్రం కలిసి ఓ ప్రోగ్రాం వేశాం?" 'ఏవిటది?' అన్నట్లు కళ్ళెత్తి చూసింది మధు కళ్ళు తుడుచుకుంటూ.

"అదేమిటంటే... నువ్వు యింతకు ముందు ప్రారంభించిన ఆ కిండర్‌గార్టెన్ స్కూల్ మళ్ళీ ఓపెన్ చేయబోతున్నాం. అయితే ఈసారి పిల్లలు మట్టుకే కాదు సాయంత్రాలు పెద్దలు కూడా వచ్చి చదువు నేర్చుకుంటారు ఇంతగా అన్ని విధాలా అభివృద్ధిని సాధించిన మన దేశంలో వయోజన విద్య ఎంత అవసర మన్నది మన గంగాపూర్ జనానికింకా అంతుబట్టటం లేదు ఒక్కో పల్లెటూరు ఎంతో అభివృద్ధి చెందిందో వీళ్ళకింకా తెలీదు

"నాకు ఎన్నాళ్ళుగానో ఈ కోరిక వుంది. ప్రకృతి సంపదకు ఆలవాలమైన మన గంగాపూర్‌ను మనకు చాతనైనంతగా అభివృద్ధిపరచాలనీ, ఈ అమాయక పల్లె ప్రజలకు బస్తీలమీద వుండే వ్యామోహాన్ని పోగొట్టాలనీ సాధ్యమైనన్ని వసతులు కల్పించి, పల్లెలు పట్టణాల కేవిషయంలోనూ తీసిపోవని ఋజువు చేయాలనే నా కోరికకు, నిన్ననే నేనూ చంద్రం కూర్చొని ఓ ప్రణాళిక తయారుచేశాం. ఓ రూపకల్పన చేశాం. మనకు తోడు సుషమ, చంద్రం వున్నారు మధూ! ఎవరికి టైమున్న పుడు వాళ్ళం ఈ అభివృద్ధి కార్యక్రమంలో ఓ చెయ్యివేసి ముందుకు నడిపిద్దాం.

ఉదయం నువ్వూ, సుషమా, పిల్లల క్లాసులు నడపండి. సాయంత్రం నేనూ, చంద్రం పెద్దవాళ్ళను కూర్చోబెట్టి, వాళ్ళకు తెలీని విషయాలు తెలియ జెప్పుతూ, ప్రతి ఒక్కరూ కనీసం పేపర్ చదవగలిగేంత జ్ఞానమైనా సంపాదించగలిగేటట్లు చేయడం మన విధిగా, కర్తవ్యంగా నిర్వహిద్దాం. ఇందులో కష్టనష్టాలు సహజం ఒకళ్ళ కొకళ్ళు తోడుగా వాటిని తట్టుకొని నిల బడదాం. కొన్ని వ్యతిరేక శక్తులు మన ప్రయత్నాలను ఆటంకపరచవచ్చు. మనం మన ధ్యేయం సాధించడానికి కావలసిన ఆత్మస్థైర్యంతో, దీక్షతో వుంటే చాలు ఏమంటావ్ మధూ?" అంటూ ఆవేశంగా అడుగుతున్న శేఖర్ వైపు మెరిసేకళ్ళతో చూస్తూ తన అభి నందనలు కళ్ళతోనే కురిపిస్తూ—

"అలాగే! మీరు చేసే ప్రతి మంచి పనికి నా సహకారం ఎప్పుడూ వుంటుంది మీ నీడలా మిమ్మల్ని అనుసరిస్తాను. మీరేం చెబితే అది చేయ డానికి సిద్ధంగా వున్నాను." మెల్లగా దృఢంగా చెబుతున్న మధువైపు తృప్తిగా చూశాడు శేఖర్. అంతకంటే అతనికి కావలసిందేముంది?

మరో వారానికి శేఖర్ అనుకున్న కార్యక్రమం ఆరంభమైంది. మొదట ఓ నాలుగు రోజులు పెద్దవాళ్ళను వచ్చి చదువుకోమంటే సిగ్గుపడ్డారు కొందరు విరక్తిగా మాట్లాడారు, యిప్పుడేం చదువని? అయినా అందరికీ చదువు

పాపాయిని

# ఫారెక్స్‌తో

పెంచుతున్నందుకు నిజంగా
నేను గర్విస్తున్నాను.



## మా డాక్టర్ అన్నారు: "పాపాయికి 3 నెలలు వచ్చాక కేవలం పాలు మాత్రమే ఇస్తే చాలదు. వానికి కావాలి ఫారెక్స్".

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు ?**
అందుకు రెండు కారణాలున్నాయి. పెరిగే మీ పాపాయికి కావలసిన మొట్టమొదటి సంతులిత ఘన ఆహారాన్ని ఇది పూర్తిగా సమకూరుస్తుంది. సున్నితమైన పాపాయి జీర్ణకోశానికి ఇది సరిగ్గా సరిపోతుంది కూడా.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం ?**
పాపాయి మెదడు, శరీరం పెరుగుదల కోసం ఫారెక్స్ సులభంగా జీర్ణమయ్యే ప్రోటీన్లను తగినంతగా అందిస్తుంది. పాపాయికి శక్తినిచ్చేందుకు కార్బొహైడ్రేట్లను కూడా సమకూరుస్తుంది. ఫారెక్స్‌లో పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ ఉంది. మరో విషయం. ఫారెక్స్‌లో మీ పాపాయికి దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తోడ్పడే కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి$_2$ తగినంతగా ఉన్నాయి

**3 నెలలు వచ్చాకనే ఎందుకు ?**
ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. ఇప్పటినుంచే ఫారెక్స్ ఇచ్చినట్టయితే పెద్దవాడయ్యాక తినే ఆహారాన్ని సరిగ్గా నమిలి చక్కగా జీర్ణం చేసుకోగలడు.

**బంగాళ దుంపలు ఉడికించి మెత్తగా చేసి ఇస్తే కాదా ?**
మీ పాపాయికి ఏదైనా ఘన ఆహారం పెట్టే ముందు పాపాయి జీర్ణశక్తి గురించి కూడా కొంచెం ఆలోచించండి. 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగా ఉంటుంది. అందుచేత, అతడు సులభంగా జీర్ణం చేసుకోగలిగే ఘన ఆహారమే ఇవ్వాలి. పైగా, మామూలుగా ఇచ్చే ఆహారాలు సంతులితమైనవి కావు. మీ పాపాయికి అతి ముఖ్యంగా కావలసిన ఐరన్, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి$_2$ మొదలైన వన్నీ అవి సమకూర్చలేవు. అందుకే 3 నెలలు వచ్చాక మీ పాపాయికి ఫారెక్స్ తప్పని సరిగా ఇవ్వాలని డాక్టర్లు చెప్పడంలో ఆశ్చర్యం లేదు.

**"పెద్దలు తినే ఆహారాన్ని" ఎప్పటి నుంచి ఇవ్వవచ్చు ?**
మొదటిసారిగా పాపాయి తప్పటడుగులు వేసినప్పుడు అతడికి పళ్ళు, కూరగాయలు, పప్పు, గుడ్లు ఇవ్వండి. అయితే ఫారెక్స్‌ను మాన్పించకండి. మీ పాపాయికి మాటలు వచ్చేవరకు, కొంచెం ఆలోచించి అతడు తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి పెట్టండి.




**పక్వమైన, సంపూర్ణమైన ఎదుగుదలకోసం పాపాయి మొట్ట మొదటి ఘన ఆహారం.**

లింటాస్-GF.57-1710 TL (R)

ప్రయోజనాల్ని చెబుతూ శేఖర్, చంద్రం చాలా శ్రమపడ్డారు.

చెప్పేది చంద్రం, శేఖర్ కనుక వాళ్ళ మాటను కాదనలేక కొందరు వచ్చి కూర్చుంటే, నలుగురూ వెళుతున్నారు కదా మన మెళితే ఏవుంది! ఏం చెబుతారో చూద్దామనే వుత్సాహంతో మరికొందరు చేరారు.

రోజు రోజుకూ వచ్చే పెద్దవాళ్ళ సంఖ్య ఎక్కువ కావడంతో శేఖర్‌లో వుత్సాహం వురకలు వేసింది. మధు కూడా యిప్పుడు ముందుకొచ్చి వుత్సాహంగా చిన్నపిల్లల్లా బుద్ధిగా కూర్చొని పాఠాలు నేర్చుకుంటున్న పెద్ద వాళ్ళను ఆత్మీయంగా చూస్తూ, వాళ్ళకు తెలీనివి "అలా కాదు బాబాయ్! యిలా కాదు మావయ్యా!" అంటూ చిన్నగా నవ్వుతూ వాళ్ళ చేత అక్షరాలు దిద్దిస్తుంటే అలౌకికమైన ఆనందం కలిగేది. ఓ పక్క మళ్ళీ ప్రారంభించిన మధు, సుషమల స్కూలుకు పిల్లలు బాగానే హాజరవుతున్నారు ఇంతకు ముందనుకున్న [illegible] మరిచిపోయి పిల్లల్ని పంపుతున్నారు.

"మాకు మీరేమీ యివ్వక్కరలేదు. మాకు ఖాళీగా వున్న టైమ్‌లో చదువు చెబుతాం." అనేసరికి [illegible] లుగారి మీదా ఓ మంచి అభిప్రాయం ఏర్పడింది అందరికీ సుషమా మధు శ్రద్ధగా పాఠాలు చెబుతున్నారు

మరో రెండు మూడు నెలలు గడిచే సరికి శేఖర్ పెట్టిన పిటిషన్ ఫలితంగా గంగాపూర్‌లో చక్కటి రోడ్లు వేసే కార్యక్రమం ఆరంభమైంది. శేఖర్ శ్రమ ఫలించి గంగాపూర్ గ్రామంలో హాస్పిటల్ నిర్మాణానికి గవర్నమెంట్ కొంత లోన్ యివ్వడానికి అంగీకరించింది. చుట్టుప్రక్కల రెండు మూడు మైళ్ళ దూరంలో వున్న రాంపూర్ లాంటి గ్రామాలకు చక్కటి రోడ్లు పడ్డాయి. ఎలక్ట్రిక్ దీపాలు వెలిశాయి. నామకహాగా వున్న బస్సుస్టాండ్, రూపం దిద్దుకుంది, షెడ్లతో.

అంత క్రితం ప్రతి చిన్న విషయానికీ పార్టీలు, కక్షలూ, వైషమ్యాలు పెంచుకునే అందరూ గ్రామాభివృద్ధి కార్యక్రమంలో చేతులు కలిపి పనిచేశారు శేఖర్ మీద వున్న విశ్వాసంతో. ప్రతి చిన్న పనికీ కలకత్తా పరుగెట్టవలసిన పని లేకుండా కొత్తగా కోఆపరేటివ్ స్టోర్స్ ఒకటి వెలిసింది. అన్ని వసతులూ అందాల బృందావనం లాంటి పల్లెలో వుంటే, నిరంతరం, పరిశ్రమల ఫలితంగా నిండి వుండే పొగతో, విపరీతమైన జనాభాతో, సరైన నీడా తిండీ దొరకని, అనుక్షణం ఆకలి బాధలతో, యాక్సిడెంట్లతో మునిగి వుండి రణగొణ ధ్వనులతో హోరెత్తించే పట్నం వెళ్ళాలని ఎవరు కోరుకుంటారు?

(సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

# చక్రపాణి అవార్డులు

తెలుగులో ఉత్తమ నవలా, కథాసాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో గత సంవత్సరం చక్రపాణిగారి అవార్డులను ప్రవేశపెట్టాం. అయితే 1978 సంవత్సరం అవార్డులను మరో రూపంలో ఇస్తున్నాము. ఈ సంవత్సరం మూడు ఉత్తమ నవలలకు మూడు అవార్డులను, అయిదు ఉత్తమ కథలకు అయిదు అవార్డులను ఇవ్వడానికి నిర్ణయించాం.

## అవార్డుల వివరాలు

| | | |
|---|---|---|
| నవల : | మొదటి అవార్డు — రూ | **2,250** |
| | రెండో అవార్డు — రూ | **1,116** |
| | మూడో అవార్డు — రూ | **850** |
| కథానిక : | మొదటి అవార్డు — రూ | **1,000** |
| | రెండో అవార్డు — రూ | **750** |
| | మూడో అవార్డు — రూ | **500** |
| | నాలుగో అవార్డు — రూ | **350** |
| | అయిదో అవార్డు — రూ | **250** |

పై అవార్డులను పొందటానికి రచయితల, రచయిత్రుల నుంచి ఉత్తమ నవలలను, కథలను ఆహ్వానిస్తున్నాం.

*అవార్డులను పొందగోరేవారు పాటించవలసిన నిబంధనలు :*

1. నవల, కథానిక — ఆంధ్రుల సమకాలీన సామాజిక జీవనానికి ప్రతిబింబంగా ఉండాలి.

2. నవల అరఠావు సైజులో 100 పేజీలకు మించకుండా 80 పేజీలకు తగ్గకుండా ఉండాలి. అచ్చులో 80 పేజీలకు మించరాదు. ఒక్కొక్క పేజీలో 25 లైన్లు మించకుండా, ఒకే ప్రక్కన వ్రాయాలి.

3. కథానిక అరఠావు సైజులో 16 పేజీలకు మించకుండా ఉండాలి. పేజీకి ఒకవైపునే వ్రాయాలి.

4. అనువాదాలూ, అనుసరణలూ అవార్డులకు ఆమోదించబడవు. రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీ పత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి. కలం పేర్లతో వ్రాసేవారు తమ అసలు పేర్లను తప్పకుండా తెలియజేయాలి.

5. అవార్డులకు పంపే నవలల, కథల కవర్లపై 'చక్రపాణి 1978 అవార్డుల కోసం' అని స్పష్టంగా వ్రాయాలి.

6 అవార్డులు పొందని నవలలను, కథలను కూడా 'యువ'లో ప్రచురణకు స్వీకరించే హక్కు మా కున్నది.

7. అవార్డులు లభించని నవలలు, కథలను తిరిగి పొందగోరే వారు తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా జతపర్చాలి. లేకపోతే వాటిని తిప్పి పంపడం సాధ్యంకాదు.

8. అవార్డులను పొందినవారి జాబితాను సెప్టెంబరు 1978 'యువ' సంచికలో ప్రకటిస్తాం. అవార్డులు పొందిన నవలలు, కథలను అక్టోబరు సంచికనుంచి ప్రచురించడం జరుగుతుంది.

9. అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకులదే తుదినిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

చాలామంది రచయితలు, రచయిత్రులూ కోరినమీదటనే అవార్డుల నిమిత్తం నవలలు, కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీని మే 1, 1978 వరకూ పొడిగిస్తున్నాం.

— సంపాదకుడు, యువ.




## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1 సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుబాట్లు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి. ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.

2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్‌కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.

8. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.

4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను జూన్ సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ ఏప్రిల్ 29. ఆపై వచ్చిన వాటిని పరిశీలించడం జరగదు.

## మే నెల క్విజ్

1. మనదేశంలో 14 పెద్ద బ్యాంకులను జాతీయం చేసిన తేదీ

ఎ) 19-7-1968 బి) 19-7-1969 సి) 1-9-1969 డి) 1-9-1968

2. ఆగాఖాన్ కప్పు కింది దానికి సంబంధించినది

ఎ) క్రికెట్ బి) హాకీ సి) [illegible] డి) [illegible]

3. ఈ ప్రజలను "కివిస్" అంటారు

ఎ) నీలగిరికొండలలోని ఆదిమవాసులు బి) హంగేరీ దేశస్థులు

సి) న్యూజిలాండ్ ప్రజలు డి) ఆఫ్రికాలోని నల్లజాతివారు

4. రాగి గనులకు ప్రసిద్ధి చెందిన "ఖేత్రి" ఈ రాష్ట్రంలో ఉంది.

ఎ) మధ్యప్రదేశ్ బి) రాజస్థాన్ సి) బీహార్ డి) గుజరాత్

5. "విష్ణు కాంచీ మహాత్మ్యం" అనే ప్రబంధాన్ని వ్రాసినది

ఎ) దగ్గుపల్లి దుగ్గన బి) అయ్యలరాజు తిప్పయ్య సి) నిశ్శంక కొమ్మన
డి) ఆంధ్రకవి రామయ్య

6 గోదావరి నదికి ఆనకట్ట నిర్మాణం ________ సంవత్సరంలో జరిగినది

7. ఆగ్రా నగరాన్ని నిర్మించినది ________

8. అర్జున అవార్డును పొందిన తొలి బాట్‌మింటన్ ఆటగాడు ________

9. మోనోటైపును కనిపెట్టింది ________

10. అల్జీరియా రాజధాని ________

## యువ క్విజ్ కూపన్ - మే '78
### సమాధానాలు

1- 2- 3- 4- 5-

6- 7- 8-

9- 10-

పేరు: ________

అడ్రసు: ________



మహాభినిష్క్రమణము —

